13-19, సెప్టెంబర్, '85
రు. 3-00

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

హాస్యకథ
**అత్తగారూ_శకునం**
డా. భానుమతీ రామకృష్ణ



**వినాయక చవితి విశేషం**
గొల్లపూడి/మారుతీరావ
ద్విపాత్రాభినయం

















**వినాయక చవితి
ప్రత్యేక సంచిక**

పూర్తినవల
**అక్షింతలు**

# భారతదేశంలో మొట్టమొదటిసారి




## 3 సం॥ గ్యారంటీతో.....

# డెల్టావిజన్ టీ.వీ.

### బ్లాక్ & వైట్




- ఎన్నో టీవీలు మీరు మార్కెట్‌లో చూసారు. కాని, **డెల్టావిజన్‌లా** 3 సం॥ గ్యారంటీతో, ఇంత తక్కువ ధరలో అందించే వాళ్ళు ఎవరూ ముందుకు రాలేదు. ఔనంటారా?
- మీ ఇంట్లో ఓల్టేజ్ డ్రాప్ అయ్యి, ఆఖరికి ట్యూబ్‌లైట్ కూడా వెలగక పోయినా సరే, **డెల్టావిజన్** లోని బిల్టిన్ స్టెబిలైజర్ వలన నిరంతరం మీకు వినోదం కలిగిస్తుంది. (110 TO 280 VOLTS)
- ఎలక్ట్రానిక్స్ టెస్ట్ & డెవలప్‌మెంట్ సెంటర్, హైదరాబాద్ వారిచే పూర్తిగా పరీక్షించబడి ఆమోదించబడినది.
- *V. C. R.* కనెక్షన్ ఆడియో ఇన్/అవుట్ సౌకర్యాలతో.........
- అందమైన మీ మనోభావాలకు అనుగుణంగా మలచబడ్డ డబుల్ షట్టర్ మరియు షట్టర్స్ లేని మోడల్స్‌లో లభిస్తుంది.
- ఇక విజయవాడ పట్టణ పరిసర ప్రాంతాల ప్రభుత్వ ఉద్యోగులకు, హామీదారులు గల వారికీ ప్రత్యేక సదుపాయాన్నిస్తుంది **డెల్టావిజన్ వెంటనే సంప్రదించండి!**
- రాష్ట్ర ప్రభుత్వం *G. O. No. 721* ప్రకారం 4% సేల్సుటాక్సు మాత్రమే.

# DELTAVISION

**A Joint Venture with**
**A. P. Electronics Development Corporation**
**For Colour Tvs**

తయారు చేయువారు:

## డెల్టావిజన్స్,

బెంజిసర్కిల్,
విజయవాడ-520 006.
ఫోన్ : 52966



# మనలో మాట

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటన కర్తలందరికీ వినాయక చవితి సందర్భంగా మా శుభాకాంక్షలని అందచేస్తున్నాము.

ఈ వినాయక చవితికి ఆంధ్ర సచిత్ర వారపత్రిక 77 ఏళ్ళు పూర్తి చేసుకుని 78వ సంవత్సరంలో అడుగు పెట్టింది ఈ 78వ జన్మదినోత్సవ సంచికని ప్రత్యేక సంచికగా ఎక్కువ పేజీలతో మరింత ఆకర్షణీయంగా వెలువరించడానికి మేము చేసిన ప్రయత్నం ఎంతవరకు నెరవేరిందో పాఠకులే నిర్ణయించగలరు

ఈ ప్రత్యేక సంచికలో ప్రత్యేక ఆకర్షణలుగా పూర్తి నవల 'అక్షింతలు', డా భానుమతి రామకృష్ణ హాస్య కథ 'అత్తగారూ– శకునం', శ్రీ గొల్లపూడి మారుతీరావు ద్విపాత్రాభినయం, తారల వినాయక చవితి అనుభవాలు, ప్రత్యేక వ్యాసాలు, కథలు, కార్టూన్‌లు, గేయాలతో పాటు మామూలు శీర్షికలు అన్నీ చోటు చేసుకున్నాయి.

ఇటీవల మేము నిర్వహించిన ఛాయా చిత్రాల పోటీలో ఎంతో ఉత్సాహంగా పాల్గొని దానిని జయప్రదం చేసిన వారందరికి మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము. ఈ పోటీలో మొదటి బహుమతి రు. 1000/– శ్రీమతి ఎం. కన్యాకుమారి (హైదరాబాదు) తీసిన 'ముదిమి' చిత్రానికి, రెండవ బహుమతి రు. 750/– శ్రీ మొదిని అప్పారావు (విజయవాడ) తీసిన 'మహిష స్నానం' చిత్రానికి, మూడవ బహుమతి రు. 500/– శ్రీ డి. మంగ రాజా రావు (భీమవరం) తీసిన 'ఓహో ఎంత అందం!' చిత్రానికి లభించాయి. ప్రత్యేక బహుమతులుగా ఒక్కొక్కటీ రు. 250/– పొందిన మూడు ఛాయా చిత్రాలు 'ఉషోదయం', 'నిరీక్షణ', 'మధుపము'లని వరుసగా శ్రీ కె. భవాని శంకర్ (హైదరాబాదు), శ్రీ ఎస్. ఎస్. మూర్తి (కాకినాడ), శ్రీ పి. రఘోత్తమ (కర్నూలు) తీసారు. ఈ ఆరుగురికి మా ప్రత్యేక అభినందనలని తెలియచేస్తున్నాము.

బహుమతి పొందిన ఛాయా చిత్రాలని, వాటిని తీసిన వారి ఫోటోలు, జీవిత వివరాలని త్వరలో పాఠకులకి అందచేస్తాము

## ముఖచిత్రం

సూపర్ స్టార్ కృష్ణతో ముఖచిత్రముగా వెలువడిన పత్రిక ఆకర్షణీయముగా ఉన్నది.

కానూరి సూర్యారావు, గుడివాడ

* * *

మా అభిమాననటి నళిని ముఖచిత్రముతో వెలువడిన 2.8 1985 సంచిక బాగుంది

అంగలూరి సత్యనారాయణ, రామచంద్రపురం




ముఖచిత్రంగా మా అభిమాన నటుడు డేరింగ్ డాషింగ్ హీరో కృష్ణను ప్రచురించినందుకు మా హృదయపూర్వక అభివందనలు.

పి. శ్రీరామచంద్రమూర్తి, శ్రీదేవి, గుంటూరు

* * *

2.8.85 ఆంధ్రసచిత్రవారపత్రిక నళిని ముఖచిత్రం అందంగా, ఆకర్షణీయంగా, ముద్దుగా, ముచ్చటగా వున్నది.

జూలూరు వెంకటపద్మ, మైలవరం

* * *

2 ఆగస్టు ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం "నళిని" చాల బాగుంది.

రామ్, శివకుమార్, వేములవాడ

* * *

మా అభిమాన నటుడు సూపర్ స్టార్ కృష్ణగారి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా బావుంది.

అన్నపూర్ణ, వసుంధర, నిడుబ్రోలు

## నచ్చింది

2.8.85 పత్రికలో తెరవెనుక ఆర్టిస్ట్ విజయదుర్గ ఇంటర్‌వ్యూ మాకెంతో నచ్చింది.

సి. బి. లక్ష్మి, తాడిపత్రి

## సీరియల్స్

మా అభిమాన హీరో "మహామనిషి" కృష్ణ ముఖచిత్రంతో 9.8.85 సంచిక మాకు నచ్చింది. "ప్రతిభ" సీరియల్ ఆరంభంలోనే ఆకట్టుకుంటుంది. ముఖ్యంగా రసవత్తరమైన శైలిలో చక్కగా సాగుతున్నది.

నీలం కైలాసనాథబాబు, ఆకివీడు

## కథలు

భానుప్రియ ముఖచిత్రంలో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయముగా ఉన్నది. శ్రీ 'కవనశర్మ' గారు రచించిన "చన్నీళ్లలో వేణ్ణీళ్ల బొట్టు" కథ చాలా బాగున్నది.

పంచాగ్నుల నాగరాజ, కువాయిట్ ☐


## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

శుక్రవారం : 13-19 సెప్టెంబరు, '85
శ్రీ క్రోధన నామ సం. నిజ శ్రావణ. బ. చతుర్దశి
సంపుటము 78 : సంచిక 1

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్ట్‌లో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్ట్‌లో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
అష్ట గణపతులు
(చిత్రం : వి. ఎస్. రావు)

కథలు :

| | |
|---|---|
| గణపతి గడప దాటితే.... | 40 |
| అత్తగారూ - శకునం | 54 |
| తెలుగు వినాయకుడు | 81 |
| ప్రశాంత్ ప్రేమ కథ | 96 |
| అర్ధనారీశ్వరుడు | 110 |

పూర్తి నవల :

| | |
|---|---|
| అక్షింతలు | 10 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| అంతరాలు–అంతర్యాలు | 46 |
| కుతుకుత నర్సింగ్‌హోమ్ | 76 |
| ప్రతిభ | 88 |
| మల్లిక | 102 |

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు-4, గణపతి గాథా రహస్యం-6, న్యూఢిల్లీ లేఖ-7, సుభాషితాలు-37, ప్రశ్నావళి-38, వాగ్గేయకారుల రచనలలో విఘ్నేశ్వరుడు-52, ధర్మపథం-53, ఇ 'వేమన' పద్యాలు-60, సినిమా విశేషాలు-62, వినాయక చవితి విశేషం-64, నేనే V నాయకుడ్ని అయితే...?-72, గణపతి కటాక్షం!-73, డాక్టర్ సలహాలు-95, సరాగమాల-106, వ్యక్తిగతం, వారఫలం-118, హైదరాబాద్ నోట్‌బుక్-120.

# పరిసరాల్ని మరిపించే కలర్ టెలివిజన్ పేరు ఒక్కటే.



## ఇ సి టీ వి స్పెక్ట్రా - రంగుల్లో అద్భుతం

రుచికరమైన పదార్థం నోటి నిండుగా
వున్నా "అదుగో చూడు" అనటానికి
కారణం అది కనువిందుగా ఆహ్లాదంగా
వుండటమే.

ఇసి టివి స్పెక్ట్రా. అందరినీ అలరించే
రంగుల విందు మృదు మధురమైన
శబ్దంతో అపూర్వమైన రంగుల కలయిక
దశాబ్దాల అనుభవం గల నిపుణుల
ద్వారా ఎల్లప్పుడూ అందుబాటులో
సర్వీసింగ్ ప్రత్యేక శ్రద్ధతో తయారు
చేయబడిన అందరూ మెచ్చే డిజైన్

ఇలాంటి ఇసి టివి పొందటానికి నిరీక్షణలో
కూడా ఆనందమే

**ECtv SPECTRA**

**ఇ సి ఐ ఎల్ కలర్ టీవి కంటికింపైనది.**





Electronics Corporation of India Limited
Hyderabad-500762

A & M 85 ECIL 23 A



గణపతి    చిత్రకారుడు : దేవు దీక్షితులు (విజయవాడ)

# గణపతి గాథా రహస్యం

నామ రూపాలు లేనివాడూ, గుణరహితుడూ, సర్వవ్యాపి అయిన భగవంతునికి విభిన్నాలో చనలు కల మానవులు తమ తమకు తోచిన రూపకల్పన చేసి ఆరాధిస్తారు. వేర్వేరు దేవతల రూపాలు మానవాకృతికి వ్యతిరిక్తంగా పెక్కు తలలతోను, చేతులతోను, నేత్రాలతోను కానవస్తూ ఉన్నాయి. అంతేకాక నరమృగరూపాల సమ్మేళనం కూడా నృసింహాది అవతారాలలో కనబడుతున్నది. అట్టి రూపాలలో గణాధినాథుని గజముఖరూపం ఒకటి. గణపతి కర్షకుల దేవతగా ప్రఖ్యాతి పొందుటవల్ల ఇతని పూజ ఇతర దేశాలలో కూడా జరుగుతూ ఉండేది. అందువల్ల ఆయా దేశస్థులు గణనాథునికి రకరకాలుగా రూపకల్పన చేశారు. కాని భారత దేశంలో మాత్రం గజ శిరస్సుతోను, కుంద బొజ్జతోను ఇతని విగ్రహం ఒక్కరీతిగానే ఉన్నది.

గణనాథుని ప్రస్తావన వేదపురాణాలలో ఉన్నది. ఇతని జన్మవృత్తాంతం స్కాంద, బ్రహ్మవైవర్తాది పురాణాలలోని భిన్నరీతులలో ఉన్నది. ఒక పురాణంలోనే ఒక చోట ఒక విధంగాను, మరొక చోట మరొక విధంగాను కానవస్తున్నది. బహుళ ప్రచారం ఉన్న గాథ మాత్రం ఈ విధంగా ఉన్నది.

అది వాన కాలం. భాద్రపద శుద్ధ చవితి. మహేశ్వరుడు ఎక్కడికో వెళ్లాడు. పార్వతీదేవి అభ్యంగ స్నానం చేయ సంకల్పించింది. తన ఒడలికి పెట్టుకొన్న నలుగుతో ఒక బొమ్మను చేసి, ప్రాణంపోసి, ద్వారం దగ్గర కాపలా పెట్టి "నేను లోపల స్నానం చేస్తాను. ఎవ్వరినీ లోపలికి రానీయవద్దు" అని చెప్పి లోనికి పోయింది. ఇంతలో బయటికి పోయిన శివుడు రాగా, కావలి పిల్లవాడు అడ్డగించాడు. శంకరుడు వానిపై కోపించి, తల ఎగరగొట్టాడు. పార్వతి దీన్ని తెలుసుకొని తన కుమారుణ్ణి బ్రతికించాలని భర్తను కోరింది. ఎగిరి పోయిన తల దొరకనందున అతడు ఏనుగు తలను అతికించి ఆ బాలుణ్ణి బ్రతికించాడు. అందువల్ల ఆ బాలుడు గజాననుడయినాడు. శివుడతనికి గణాధిపత్యం ఇచ్చినందున గణపతి అనే పేరు కూడా వచ్చింది.

మన పురాణాలలోని గాథల నన్నింటికీ అంతరార్థం ఒకటి ఉంటుందని పరిశీలక విద్వాంసుల అభిప్రాయం. వారు చాలా గాథలలోని రహస్యాన్ని వెల్లడిస్తున్నారు. అలాగే ఈ గాథలో ఒక రహస్యార్థం ఇమిడి ఉన్నదని గ్రహించాలి.

పరమేశ్వరుడు సూర్యునికి, పార్వతిభూమికి సంకేతాలు. పరమేశ్వరుడు ఇంటి నుండి ఎక్కడికి వెళ్లడం, సూర్యుడు మేఘాలచేత కప్పబడి ఉండడమని గ్రహించాలి. వర్షా కాలంలో భూమి పంటచేలను బాగా పెరిగేటట్లు చేస్తుంది. గణాధిపతి సస్య సంపదకు సంకేతం. సూర్యకిరణాలు భూమిపైని ప్రసరించకుండా భూమిచేలను అడ్డు పెట్టడమే వినాయకుణ్ణి ద్వారం దగ్గర కావలిగా ఉంచడమన్న మాట. కోపించిన శివుడు గణపతి శిరస్సును ఖండించడమే చేనికోత. కోసిన పైరు కుప్పగా పెట్టడమే గణపతి కుండబొజ్జకు సంకేతం. పైరు కోయుటకు ఉపయోగించే కొడవలి గణనాయకుని ఏక దంతం. గింజలను తూర్పారబట్టుటకు ఉపయోగించే చేటలే ఏనుగు చెవులు !

సస్యాధి దేవత అయిన గణపతిని పూజించుటకు కర్షకులకు పువ్వులు సులభంగా దొరకవు. అందువల్లనే తమకు సులభంగా లభించే దూర్వాంకురాలతోనూ, రకరకాల పత్రాలతోనూ అతనిని పూజించడం పరిపాటి అయింది. క్రమంగా ఆ పూజయే అతనికి మిక్కిలి ప్రియమైనదని నిర్ణయించడం జరిగింది.

వరి పంటతోనే ఈ గణాధిపతికి ఎక్కువ సంబంధం ఉండడంవల్ల బియ్యపు పిండితో చేసిన కుడుములు, ఉండ్రాళ్ళు నైవేద్యం పెట్టడం జరుగుతున్నది. ఇతర భక్ష్యాలు అవసరంలేదు. మోదకాలే అతనికి ఇష్టమైనవట! అతనికి మోదక ప్రియుడనే బిరుదనామం దీనివల్లనే వచ్చినది.

అంత పెద్ద గణపతికి ఇంత చిన్న ఎలుక వాహనం కావడం వింతగానే కానవస్తుంది. అది ఆ దేవునికి వాహనమయినా పూజ చేసేటప్పుడు ఆ ఎలుకపై వినాయకుణ్ణి కూర్చోపెట్టరు. దాన్ని అతనికి ప్రక్కను ఉంచుతారు.

వరిధాన్యపు కుప్పతో పోల్చినట్లే గణపతి బొజ్జను గాదెతో పోల్చడం ఉన్నది. వరిధాన్యంపై ఎక్కువ మక్కువ గల మూషికం ఆ ధాన్యపు గాదకు రంధ్రం చేసి ధాన్యాన్ని భక్షించడానికి, దానిప్రక్కనే కాచుకొని ఉంటుంది. ఈ విషయాన్నే వినాయకుడి ప్రక్కను ఎలుకను ఉంచడం సూచిస్తున్నదని ఊహించవచ్చును.

ఈ రీతిగా గణాధిపతిగాథ గాథలోని అంతర్యాన్ని ఊహించవచ్చును.

గణనాథుని యితర గాథలకు కూడా ఈ విధంగానే ఏదో ఒక రహస్యార్థం ఉండవచ్చు. ప్రసిద్ధంగా ఉన్న కథకు మాత్రం అంతర్యం వివరించబడినది. దీనిని గ్రహిస్తే వినాయకుని వింతరూపాన్ని గురించి, అతని పూజా విధానాన్ని గురించి ఆశ్చర్య పడవలసిన అవసరం ఉండదు.

వర్షాకాలంలో పూజింపబడే ఇతడు కర్షకులు కొలిచే దేవత అగుట నిశ్చయం.

("గణపతి" గ్రంథం ఆధారంగా)

–ఆంగిరస

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# ప్రభుత్వంపైనే ఆధారపడి ఉన్న ప్రతిపక్షం

ప్రభుత్వమే అన్నీ చెయ్యాలని ప్రజలు అనుకుంటారని ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ ఇటీవల తమని ఇంటర్వ్యూ చేసిన ఒకరితో అన్నారు. ఒకరకంగా ఆయన సరిగానే చెప్పారనవచ్చు. ప్రజలకి ప్రభుత్వమే తిండి పెట్టాలనుకుంటారు, చదువు చెప్పించాలనుకుంటారు. ఉద్యోగాలు, ఇళ్ళు ఇవ్వాలనుకుంటారు రైళ్ళని, బస్సులని నడపాలని అంటారు. వృద్ధాప్య పింఛనులని ఇవ్వాలంటారు ఇంకా అంతవరకు రాలేదు కానీ చివరికి అంత్యక్రియలకి కూడా ప్రభుత్వమే డబ్బు ఇవ్వాలంటారనుకోవచ్చు. భారత ప్రభుత్వం సోవియట్ రష్యా, హంగేరిలలో ప్రభుత్వాలకన్నా ఏ రకంగా భిన్నమైనదో నాకు తెలియదుకానీ ఆ దేశాలలో ప్రభుత్వమే ప్రతి పౌరుడికి తల్లీ తండ్రీ మన దైనందిన వ్యవహారాలలో ప్రభుత్వ ప్రమేయం చాలా పెద్ద ఎత్తున కనిపిస్తుంది. మీరు జాగ్రత్తగా గమనిస్తే మనం నియంతృత్వ ప్రభుత్వానికి ఒక్క మెట్టు మాత్రమే కింద ఉన్నామనిపిస్తుంది.

మనం రోజూ తినే రొట్టె ప్రభుత్వ బేకరిలలో తయారవుతోంది. మనకి వచ్చే పాలు ప్రభుత్వ పాడి పరిశ్రమ కేంద్రం నించి ప్రభుత్వ వాహనాలలో, ప్రభుత్వ సీసాలలో మనకి సరఫరా అవుతున్నాయి. ప్రభుత్వ ప్రచార సాధనాలవల్లనే మనకి ప్రతినిత్యమూ వినోదం లభ్యం అవుతున్నది ప్రభుత్వ రైళ్ళలోనూ, బస్సులలోనూ మనం ప్రయాణం చేస్తాము. మనం చదివే వార్తాపత్రికలు అచ్చువేసే న్యూస్‌ప్రింట్ కాగితం ప్రభుత్వ ఏజన్సీల ద్వారానే అందజేయబడుతుంది. ప్రభుత్వం నడిపే లేదా ఆర్థిక సహాయం చేసే స్కూళ్ళకి, కాలేజీలకి మనం వెళ్తాము. ప్రభుత్వ ప్రయోగశాలలలో పని చేస్తాము. మనలో చాలామంది ప్రభుత్వోద్యోగాలు చేస్తూ ఉంటారు. ప్రభుత్వం నడిపే హోటళ్ళలో చాలామంది ఉంటూ ఉంటారు. ప్రభుత్వ సబ్సిడీతో నడిచే కాంటీన్‌లలో తింటూ ఉంటారు. ప్రభుత్వ విమానాలలో మనం ప్రయాణం చేస్తాము. ప్రభుత్వ సూపర్‌బజార్‌లలో వస్తువులు కొంటాము అన్నిటికీ మనం ప్రభుత్వం మీదే ఆధారపడతాము. అందుకే ప్రభుత్వం మనని కట్టుబానిసలుగా చూస్తుందంటే అందులో వింతలేదు. అంతే కాకుండా మనం 1975లో లాగా అధికారంలో ఉన్నవారిని ఇబ్బంది కలిగించినప్పుడు మనని ప్రభుత్వ జైళ్ళలో పెడతారు.

మనదేశం గతంలో కొంత కాలం వలస రాజ్యంగా

పంజాబ్ సమస్య పరిష్కారం

అస్సాం సమస్య పరిష్కారం

ఉంటటం కొంతవరకు దీనికి కారణం అయి ఉండవచ్చు. బ్రిటిష్‌వారు బేకరీలని, పాడిపరిశ్రమలని, హోటళ్లని, చివరికి రైళ్లని, బస్సులనికూడా నడపలేదు. వాటన్నిటినీ వ్యక్తులకి, లేదా కొందరు వ్యక్తులు ఏర్పరచుకున్న సంస్థలకి వదలివేసేవారు. అప్పుడుకూడా పిల్లలు తల్లిదండ్రుల వైపు చూసినట్లుగా ప్రజలు ప్రభుత్వంవైపు చూసే అలవాటు ఉండేది. అయినా బ్రిటిష్ వాళ్లకి అది సంతోషంగానే ఉండేది. అప్పుడు ప్రభుత్వోద్యోగానికి ఎంతో పలుకుబడి, హోదా ఉండేవి. మోతీలాల్ నెహ్రూ ఇంగ్లాండ్‌లో చదువుకుంటున్న తమ కుమారుడికి రాసిన ఉత్తరంలో తమ ఆశయం "జవహర్‌లాల్ నెహ్రూ, ఐ.సి.ఎస్., డెప్యూటీ కమిషనర్, ఝాన్సీ" అన్న బోర్డుని తమ ఇంటి ముందు చూడాలన్నారట. అయితే నెహ్రూ ఆయన కోరికని తీర్చలేదు. ఎందుకంటే నెహ్రూ ఐ.సి.ఎస్.కి అంతగా పనికిరాలేదు. కానీ అది వేరే కథ.

ఇంతకీ నేను చెప్పదలుచుకున్న దేమంటే దేశంలోని అన్ని రంగాలలో భారీ ఎత్తున ప్రభుత్వ ప్రమేయం ఉండటంవల్ల అధికార వ్యవస్థలోని సమతూకం బాగా దెబ్బతినిపోయింది. ప్రభుత్వం చురుకుగా వుంటేనే ప్రతిపక్షం కూడా చురుకుగా ఉంటుంది మనదేశంలో. ప్రభుత్వంలేదా అధికార పక్షం చేసే ప్రతిదాన్నీ విమర్శించడమే భారతదేశంలో ప్రతిపక్షం చేస్తున్న పని. అంతకుతప్ప స్వతంగా అది ఏదీ చెయ్యదు. చెప్పదు కొత్త ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన గత ఎనిమిది నెలలుగా ప్రతిపక్షం కనుమరుగైపోయిందనిపిస్తున్నది తిరిగి పంజాబ్ ఒప్పందం తర్వాతే అది కాస్త చైతన్యాన్ని పుంజుకున్నది. అంతకుపూర్వం ఏవో చర్చలనే వాటికోసం ప్రధానమంత్రి ఆహ్వానించినప్పుడు మాత్రం దానిలో కాస్త కదలిక కనిపించేది బడ్జెట్‌వల్ల ధరలు బాగా పెరిగినప్పుడు మాత్రమే



ఫోటో . నాయకుల ఆంజనేయులు రెడ్డి

ప్రతిపక్షం గొంతు వినిపిస్తుంది. ప్రతి బడ్జెట్‌లోనూ ధరలు పెరగటం అన్నది చాలా సాధారణ విషయమే. కానీ ఎప్పటికప్పుడే కొత్త పంచవర్ష ప్రణాళిక ముసాయిదాని ఏడాది చివరిలో విడుదల చేసినప్పుడు కూడా ప్రతిపక్షం గొంతు వినిపిస్తుంది. ఇంతకు ముందు ఆరు పంచవర్ష ప్రణాళికలు వచ్చాయి కానీ అవన్నీ ఒకలాగే ఉన్నాయి అలాగే ప్రతిపక్షాల విమర్శలు కూడా ఒకేలా ఉంటాయి. వ్యవసాయానికి ప్రణాళికలో తగినంత కేటాయించలేదని చౌధురి చరణ్‌సింగ్ అంటారు. ప్రయివేటు రంగానికి ఎక్కువ మేలు చేసేదిలా ప్రణాళిక ఉందని కమ్యూనిస్టులు చెప్తారు. చాలా కాలంనించి వాళ్లలాగే అంటున్నారు. కానీ దానిని పట్టించుకున్నవాళ్లు చాలా తక్కువగా ఉంటారు

మహాత్మాగాంధీ ఆనాడున్న ప్రభుత్వానికి ఎప్పుడూ ప్రతికూలంగానే ఉండేవారు. వైస్రాయ్ చర్చలకి ఆహ్వానించినప్పుడే ఆయనలో కదలిక ఉండేదని కాదు దాని అర్థం ఆయన ఎప్పుడూ చురుకుగానే ఉండేవారు ఆయనే బ్రిటిష్ ప్రభుత్వం తమ చర్యలకి ప్రతిస్పందించేలా చేసేవారు. తమ కార్యకలాపాలలో ప్రజలు కూడా భాగస్వాములయేలా చేసేవారు. ఎప్పుడూ రాజకీయాలని ఆయన చురుకుగా ఉండేలా చూసేవారు

ప్రభుత్వం మీద మనం ఎంతగా ఇప్పుడు ఆధారపడి ఉన్నామో ప్రతిపక్షం కూడా అలాగే ఉన్నది. ప్రతిపక్షం కార్యక్రమాలకి స్ఫూర్తిని ప్రభుత్వంనించే పొందాల్సిన స్థితిలో ఉంది. పంచవర్ష ప్రణాళికనే తీసుకోండి. గతంలో వాటికన్నా ఇదేమి భిన్నమైనదికాదు. మన ప్రణాళికా రచయితలందరూ ప్రధానంగా అధికార వర్గంలోనివారే వాళ్ళు తమ జీవితంలో సగభాగాన్ని ప్రభుత్వ సేవలోనే గడుపుతారు. గతంలోనించి బయటికి వచ్చే ధైర్యం వారికి లేదు. మనకి కూడా అలాంటి అభిప్రాయాన్నే కలిగిస్తారు. అయితే ప్రతిపక్షం మాటేమిటి ? ఎంతో అనుభవం గల నాయకులు ఉండికూడా ఏ ఒక్క ప్రతిపక్షం తన దైనటువంటి ఒక ప్రణాళికని రూపొందించదు. వివరంగా కాకపోయినా కనీసం తాను చెయ్యదల్చుకున్న మార్పులు, ఉద్దేశాలు, రాజకీయ ఆదర్శాలని సూక్ష్మంగా అయినా వివరించదు. మనకి ప్రభుత్వ ప్రమేయం తక్కువ ఉండాలంటే ప్రభుత్వరంగ సంస్థలని అదుపు చెయ్యాల్సి ఉంటుంది.

ఆధునికీకరణ కావాలనుకుంటే మరింత ఆధునికమైన సాంకేతిక విజ్ఞానాన్ని సమకూర్చుకోవాల్సి ఉంటుంది. మన స్వావలంబన విధానాన్ని కొంత సడలిస్తే తప్ప అది సాధ్యం కాదుకదా ? ప్రాథమికమైన ఈ ప్రశ్నలకి వివరాలలోకి వెళ్లేముందు ఏ పార్టీ అయినా సమాధానం చెప్పుకోవాల్సి ఉంటుంది అధికారపక్షానికి పెద్ద మార్పులు ఇష్టం ఉండదు కాబట్టి దానికి ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పాల్సిన అవసరంలేదు. ప్రతిపక్షం తన బాధ్యతని సరిగా నిర్వహించనప్పుడు అది ఉన్నా లేకపోయినా ఒకటే తన అభిప్రాయాలని, ఆలోచనలని బయటికి చెప్పే ధైర్యం దానికి లేదనుకోవాల్సి ఉంటుంది.

వీటన్నింటికన్నా ముఖ్యమైనది మరొకటి ఉన్నది ప్రతిదానికి ప్రభుత్వం మీదే ఆధారపడాల్సిన అవసరంలేదని ప్రతిపక్షం ప్రజలకి నచ్చ చెప్పాలి. అసలైన ప్రజాస్వామ్యంలో అన్నీ ప్రజలే చేస్తారు. వాటికి అనువైన పరిస్థితులు కల్పించడమే ప్రభుత్వం బాధ్యత ప్రభుత్వ సంస్థల ద్వారా ప్రజాశక్తి దుర్వినియోగం కావలసిన పనిలేదు ప్రభుత్వం నడిపే పాడి పరిశ్రమలు, బస్సులు, హోటళ్లు లేకపోయినా మనం మనగలము వాటికి ఉండాల్సిన ప్రమాణాలని ప్రభుత్వం నిర్దేశిస్తే సరిపోతుంది వాషింగ్‌టన్‌లో వైట్‌హౌస్, లండన్‌లో 10, డౌనింగ్ స్ట్రీట్‌లు వారి ప్రజలకోసం రొట్టెలని తయారు చెయ్యటంలేదు. ఆవుపాలు పితకటంలేదు అలాగే న్యూఢిల్లీలోని 5, రేస్‌కోర్స్ రోడ్డుకు కూడా అంతకంటే ఎన్నో మంచి పనులని చెయ్యవచ్చు. అయితే దాని కార్యకలాపాలని విశాలదృక్పథంతో నిర్వహించినప్పుడే అది సాధ్యమవుతుంది. ☐

విజయ బాపినీడు



బత్తుల వెంకటనారాయణ నాగార్జున ఆర్ట్ పిక్చర్స్

సమర్పించు



# దొంగల్లో దొర

ఎ.సారధి

ఎ.P బాలసుబ్రహ్మణ్యం సత్యానంద్ • MV రఘు వి యస్ వి నరసింహారావు

రైలు యింకా పూర్తిగా ఆగకుండానే, వైజయంతి కోసం స్టేషన్‌కి వచ్చిన దక్షిణా మూర్తి, రైలు పెట్టెలో వైజయంతిని చూసి, ఆ పెట్టె వెంబడి పరుగు తీశాడు.

వైజయంతికి ఒకటే నవ్వు. పాపం! పెదనాన్నకి తనంటే ఎంత ఆపేక్షో!

రైలాగదా? ఆగాక, వచ్చి తనని దించవచ్చు గద? పెద్ద వాళ్ళకి

పూర్తినవల



## అభిమానం వచ్చినా, ఆగ్రహం వచ్చినా మోతాదు ఎక్కువే బాబూ! అనుకుంది.



మరునిముషానికి రైలాగింది. వైజయంతి తన బ్యాగు తీసి పట్టుకుని, ద్వారం దగ్గరకి వెళ్తూంటే, వెనుకనించీ 'అయ్యో! మీరీ స్టేషన్లో దిగిపోతున్నారా? ఆ వూర్నించీ యింతదాకా ట్రావెల్ చేశాం! పోన్లెండి! యిది నలభయి మూడో రిక్వెస్టు! అడ్రస్ చెప్పరూ?" అంటూ ఒక దళసరి కళ్లద్దాలబ్బాయి అన్నాడు

ఇది తొంభయ్యో మాట! షటప్!" విసురుగా అనటంతో, వైజయంతి చెవుల రింగులు ఒకసారి గలగలా వూగాయి. ఆ అబ్బాయి నోరు మూసుకుపోయింది

దక్షిణామూర్తి గబగబ వచ్చి వైజయంతి చేతిలోంచి బ్యాగు తీసుకున్నాడు. వైజయంతి దిగింది

# అక్షింతలు

### శివల జగన్నాథరావు

స్టేషన్ బయటికి వచ్చి, రిక్షాని పిలిచాడు దక్షిణామూర్తి. ఓ ప్రక్కన క్షేమ సమాచారాలడుగుతూనే వున్నారు. మరో ప్రక్కన రిక్షా పిలిచి, వాడికి వెళ్లాల్సిన







# అక్షింతలు

చోటు చెప్పి బేరంఆడి బ్యాగుపెట్టి ఎక్కవే అమ్మాయ్ అన్నాడు

రిక్షావడివడిగా పోతోంది

స్టేషన్ దాటగానే ఒక పోస్టాఫీసు ఆ తరువాత పెద్ద చెరువు అక్కడో గుడి ఆ మిదట దర్మసత్రం ఒక బజారు రెండు సినిమాహాళ్ళు వరసగా హోటళ్ళు కిళ్ళీబడ్డీలు బార్బర్ షాపులు మద్య మధ్యన కుళ్ళు కాలువలు కుక్కలు, పందులు

"మనవూరు ఏమి మారలేదు పెదనాన్నా అంది వైజయంతి చల్లగాలికి చీరె చెంగు చెవుల చుట్టు తిప్పి పట్టుకుంది

ిణామూర్తి నవ్వాడు

ారడానికీ వూరికివున్న ప్రాముఖ్యతేమిటమ్మా ?

అయినా నీకింక ఈ వూరితో పనేమిటి ? ఎలాగూ నువ్వు ఆ అబ్బాయితో వెళ్ళిపోతావు గద?

వైజయంతి ఆశ్చర్యంగా అసహనంగా చూసింది పెదనాన్నని ఏమిటి పెదనాన్నా నీ మాట? ఏమంటున్నావు నువ్వు? నేను అబ్బాయితో వెళ్ళిపోవడం ఏమిటి? ఏ అబ్బాయితో ?

అదేనమ్మా పెళ్ళి కొడుకు మోహన్రావులేడూ? అతనితో' పెళ్ళిచేసు కుందికేగదా యిప్పుడు నువ్వీ వూరు వచ్చావు'

ఓ అదా?' వైజయంతి తెరలు తెరలుగ నవ్వింది

ఆ అమ్మాయి అలా నవ్వుతూంటే దోవలో మనుషులు విడ్డూరంగా చూస్తున్నారు రిక్షావాడు నవ్వుకుంటూ తొక్కుతున్నాడు

వుష్' వూర్కో ' వూర్కో' బావుండదు' చూడు వాళ్ళెలా చూస్తున్నారో? అన్నాడు దక్షిణామూర్తి మందలింపుగా

చూస్తే చూడనిద్దూ' వెదవసంత' హాయిగా నవ్వుకోందుకి కూడా రెస్ట్రిక్షనే ఆడపిల్లకి? వూ సరేగానీ నీ మాటేం బాగాలేదు పెదనాన్నా' ఇంకా ఆల్లేదు చూల్లేదు కొడుకు పేరు సోమలింగడన్నట్టు వుంది నీ మాట'' యింకానేను పెళ్ళి చూపులికి గదా వస్తున్నాను? చూపులవ్వాలా? నాకా అబ్బాయీ అతనికి నేనూ నచ్చాలా? అన్నీ కుదరాలా? అప్పుడుగదా పెళ్ళి?

దక్షిణామూర్తి నవ్వేసి ఇక్కడాపు' ఇక్కడాపు' అన్నాడు రిక్షావాడితో దిగారిద్దరూ

ఆ డాబా యింటి అరుగు మిద నిలబడింది పూర్ణ దక్షిణామూర్తి గబగబావచ్చి బ్యాగు పూర్ణకిచ్చాడు

ఏమిటంత ఆలస్యం? ఏఁవే వైజయంతీ? ప్రయాణం సుఖంగా జరిగిందా? అడిగింది పూర్ణ

ఆ సుఖంగానే జరిగింది పెద్దమ్మా' ఏది మన స్వరూపా? అంటుంటే ఓయ్' వస్తున్నా' వస్తున్నా' అంటూ రెండో జడ చివర అల్లుకుంటూ వచ్చింది స్వరూప

ఏమిటక్కయ్యా? సంగతులు? ప్రయాణం?

వైజయంతి ఫకాల్న నవ్వింది

ఓసే స్వరూపా' నీ ముస్తాబు చూస్తే ఈతరం' నీ మాటలు వింటే మునుపటితరం'' నువ్వు రెండు తరాల మనిషివే' లేకపోతే పెద్దాళ్ళలా ఏమిటామాట? ప్రయాణం సుఖంగా జరిగిందా? అంటూ?

అబ్బాబ్బా' నీతో మాట్లాడలేం తల్లీ' మరి ఆ అబ్బాయి ఎలావేగుతాడో గాని నీతో ?

"నేను వేపినట్టే వేగుతాళ్ళేగాని నీ చదువు ఏమయింది?

దాని మోహం చదువు' ఇంటరు పుస్తకాలు ఇరవయ్యేళ్ళేనా చదూతుందది' యింక సినీమాలడుగూ' పదో ఎక్కం అంత సుళువుగా అప్ప జెప్తుంది' అంది పూర్ణ

అక్క రాగానే బోర్' బోర్' వూర్కోండి' చిరాకుపడింది స్వరూప

అంతా లోపలికి వెళ్ళారు

స్నానంచేసి ఫ్రెష్‌గ తయారయింది వైజయంతి

ఎలా వుందే నీ వుద్యోగం? పూర్ణ అడిగింది

ఫస్టుగ వుంది పెద్దమ్మా' ఈ పెళ్ళంటే అందుకే బెంగగా వుందినాకు'

అదేవిటే?

అవును పెద్దమ్మా పెళ్ళయిందనుకో' ఆ అబ్బాయి ఎక్కడో దూరంగా జాబ్ చేస్తున్నాడని మిరాశారా? నేనక్కడికి వెళ్ళిపోవాలి గద? వెళ్ళిపోతే నా వుద్యోగమో?

వదిలేస్తావు' వెధవుద్యోగం' మొగుడుకంటే ఎక్కువా?

అది మునుపటి మాట పెద్దమ్మా' మి కాలం మొగుళ్ళు కొన్ని పద్ధతులికి కొన్ని కట్టుబాట్లకి కట్టుబడి పెళ్ళాల్ని యింట్లో తనలో ఒక బాగంగా చూసుకునేవాళ్ళు' అఫ్‌కోర్స్' మా పెదనాన్నలాంటి వాళ్ళనుకో' ఇంకా పెళ్ళాల్ని బాధలుపెట్టే వాళ్ళూ వున్నారనుకో' అప్పుడూ' ఇప్పుడది మరింత ఎక్కువై పోయింది ఏ పేపరు చదివినా రేడియోవిప్పినా భయంవేసే వార్తలు'' విన్లేకపోతున్నాం'' ఒళ్ళు ఒణుకుతోంది'

చాల్లేవే' నీకు చిన్నప్పట్నించి అతి తెలివి' అంతా' నోరిప్పితే వుపన్యాసాలు'

అదికాదు పెద్దమ్మా' నేను నా వుద్యోగం వదల్లేను సుమా' అదినాకు ఒక రిలీఫేకాదు' నా జీవితానికి సేఫ్‌కూడా' నా మొగుడు నా అందం చూసేసి బుర్ర గంగిరెద్దులా వూపేసీ తాళి కట్టియిచ్చు తరవాత మాకు ఎన్నో సమస్యలు రావచ్చు'

పెళ్ళి చూపులకొచ్చి అశుభం మాటలాడతా వేంటే? పూర్ణ బాధపడింది

ఆడదానికి ఆర్ధిక లోపం చాలాకష్టాలు తెస్తుంది పెద్దమ్మా' ఒక మాట'

ప్రథమ చికిత్సతాలుకు వార్త!

# గుండ్రానివీ, పట్టీలూ

## కేవలం బ్యాండ్ - ఎయిడ్
## మాత్రమే వీలైన యీ ఆకారాల్లో వస్తుంది





గుండ్రటి డ్రెసింగ్,
మరేదీ సరిపడదు దీనికి





చదరపు డ్రెసింగ్,
మరేదీ పట్టుకోదు అలా




**బ్యాండ్-ఎయిడ్**

మరింతగా కాపాడేది, మరింత త్వరగా మాన్పేది.

*Johnson & Johnson*



OBM/4669/TEL

# అక్షింతలు

యిప్పుడు తొంబయి తొమ్మిది మంది మగాళ్ళు డ్రింక్ సేవిస్తున్నారు డబ్బంతా దానికే పోస్తూ' ఆ పెళ్ళాం పిల్లలేమయిపోతారని?

నువ్వు ఏదో భయంకరంగా ఆలోచిస్తున్నావే'

ఆలోచనకాదు పెద్దమ్మా' ఫేక్ట్' యిది నిజం' నగ్న సత్యం'

అంతలో స్వరూప పేకముక్కలు పట్టుకునివచ్చి అక్క చెయ్యి పట్టుకుని గదిలోకి లాక్కుపోయింది

ఏవండీ' చూసేరా? వైజయంతి ఎలా మాట్లాడుతోందో?

పూర్ణ బెంగగాఅంది

దక్షిణామూర్తి నవ్వేశాడు

దానితత్వం మనకి కొత్తా పూర్ణా? ఏదో చెప్పింది' చెప్పనీయి' అదేదో అన్నదని దానికి పెళ్ళి చెయ్యకుండా ఎలా వుంటాం మనం? ఆడపిల్ల' వయసులో వున్నది' వుద్యోగం విషయంలో దాని అభిప్రాయాన్ని నేను ఒప్పుకున్నానంటే అది వేరే సంగతి' డిగ్రీ చదివింది ఫస్టుగా పాసయింది' సరదాగా కొన్నాళ్ళు వుద్యోగం చేస్తానంటోంది చెయ్యనీయి అని వెళ్ళమన్నాను'

అసలు వైజయంతి చిన్నప్పటినించి పోర్సే' ఏం చేస్తాం? వున్నవాళ్ళు ఇద్దరే ఆడపిల్లలు మనకి' వైజయంతికి పెళ్ళయితేగాని మన స్వరూపకి పెళ్ళి చెయ్యడానికి వీలులేదు' అక్కని వదిలివేసి చెల్లికెలా చేస్తాం? అలాచేస్తే అదిగో' స్వరూప మీ స్వంత కూతురనీ మీరు స్వార్థం చూపించుకున్నారు' వైజయంతికి పాపం అమ్మా నాన్న లేరనిగదా దాని ఖర్మానికి దాన్నొదిలేశారు మీరు? ఏదో చేరదీస్తే చదువు చెప్పిస్తేసరా? పెళ్ళి చేయడం కూడా మీ బాధ్యతకాదా ఆడపిల్లకి? అని వీధి వూరూ వాడా అంతా మన ముఖాల మీద దుమ్మెత్తి పోస్తారు''

ఆ మాటలకి దక్షిణామూర్తి గట్టిగా నిట్టూర్చాడు పూర్ణ మాట్లాడలేదు

## 2

అదిగో' వాళ్ళొచ్చారు'

అంది పూర్ణ వాకిట్లోకి చూస్తూ

పద పద' నువ్విక్కడ వుండకూడదు' అంటూ వైజయంతి చెయ్యి పట్టుకుని లోపలికి లాక్కుపోయింది

అదేమిటి పెద్దమ్మా? నాకేగదా పెళ్ళి? మరి నన్ను ఇక్కడవుండొద్దంటావేమిటి?

అది కాదే' నువ్వు లోపల వుండాలి' వాళ్ళు వచ్చి కూచుని మాటలయాక అమ్మాయిని తీసుకురండంటే అప్పుడు నేను నిన్ను తీసుకువెళ్తాను' తెల్సిందా?

నిట్టూర్చింది వైజయంతి

తమ ఆఫీసులో ముప్ఫయిమంది మగవాళ్ళ మధ్య జాబ్ చేస్తోంది అక్కడ సిగ్గుపడితే జరగదు' ఇక్కడది పడాలికాబోలు' భగవంతుడా'' రక్షించు అనుకుంది

బైట గదిలో ఏవో మాటలవుతున్నాయి మగపెళ్ళివారం అంటూ వాళ్ళు అయిదుగురొచ్చారు'

అబ్బాయి అతని తండ్రి తల్లి యిద్దరు అక్కలు వచ్చారు

ఫలహారాలు కాఫీలు అయినాయి

పిల్లని తీసుకురండి అన్నారు పూర్ణ వచ్చి వైజయంతిని భుజాలు జాగ్రత్తగ పట్టుకుని నడిపించబోయి విదిలించితే విస్తుపోయింది ఇదేంటి పెద్దమ్మా? నేన్నడవలేనా? పేషంటునా? డాక్టరి దగ్గరికి పేషెంటుని తీసికెళ్ళినట్టు తీసుకెళ్తే వాళ్ళు నన్ను పేషెంటుకిలాగా ఎక్సురే తీస్తారు' ఛీ ఛీ' పాడు చూపులు' పాడు వ్యవహారాలు'

ష్' వూర్కో' వాళ్ళు వింటే బావుండదు' నీ పైత్యం చూపించకు' సమ్మందం తప్పిపోతుంది'

పీడా పోతుందిలే!

సర్లే! పద! పద!

వైజయంతి నిటారుగా నడుస్తూ వచ్చి అందర్నీ కలయచూసి ఒక ఖాళీ కుర్చీ లాక్కుని కూచుంది

వాళ్ళు ఆశ్చర్యంగా చూశారు చాపమీద పూర్ణ మాత్రం చతికిలబడింది ప్రశ్నలు ప్రారంభం అయినాయి పేరడిగింది కాబోయే అత్తగారు చెప్పింది వైజయంతి

ఏం చదివావు? చెప్పింది ఉద్యోగం ఎక్కడా? చెప్పింది

ఓన్లీ క్లర్కా? టైపిస్టా? అబ్బాయడిగాడు

ఓన్లీ క్లర్క్

మీ డిపార్టుమెంట్లో ఎంత మంది మేల్స్?

చాలామంది అని లోపల నవ్వుకుంది వైజయంతి

అనుమానప్పినుగులా వున్నాడు సణుక్కుంది

లేడీసున్నారా?

వున్నారు ఇద్దరమే!

అత్తగారు నడవమంది ఇప్పుడు నడిచేవచ్చాను అంది వైజయంతి

పాటపాడు

వుహు! నాకు పాడ్డం రాదండి! ఆయన్ని వస్తే పాడమనండి! వింటాను!

ఆ మాటకి వాళ్ళంతా విస్తుపోతూ చూశారు

మీకు క్రికెట్ వచ్చా?

అతను తెల్లబోయి రాదు చెప్పాడు

పోనీ హాకీ? ఫుట్‌బాల్?

రావు అంతా విపరీతంగా చూస్తున్నారు

మీ ఆఫీసులో లేడీసున్నారా?

లేరు వున్నారు లేరు

వాతావరణం వుద్రిక్తంగా మారుతోంది

ఏమిటమ్మాయ్? ఆ అడగడం? బొత్తిగా వినయం విధేయతా లేనట్టున్నాయి నీకు? అంది అత్తగారు కేకలేస్తూ

ఏం మీరడగచ్చా? పిచ్చి ప్రశ్నలు? నన్ను నడవమనడం ఏంటి? నాకేం కుంటా? పెళ్ళి చూపులంటే ఆడపిల్లంటే అంత అలుసా? మా ఆఫీసులో మగాళ్ళుంటే నేను పాడైపోతానా? మీకో జడ్జిమెంటూ నాకోటినా? మీరు చేసుకోకపోతే నాకు పెళ్ళవకపోదు! దయచేయండి!

దాం దూం అంటూ వాళ్ళు వెళ్ళిపోయారు

దక్షిణామూర్తి పూర్ణ తలలు పట్టుకున్నారు

ఇలా అయితే నీకు పెళ్ళి అవదే! అన్నారు

అవకపోతే పర్వాలేదు!

నీకు పర్వాలేదు దానికో! నీకు అవకుండా దానికెలా చేస్తాం?

చక్కగా చెయ్యండి! ఏం ఫర్వాలేదు!

ప్చ్! మీ అమ్మ నాన్న మాకు జగమొండినిచ్చి పోయారు!

ఇంతదాకా ఎందుకు నన్ను తెచ్చారు? అప్పుడే ఎక్కడో వదిలేయవల్సింది

ఛా! ఛా! వెదవ కబుర్లూ నువ్వూనూ! మేమంత రాక్షసులంకాము!

పూర్ణ దగ్గరగా జరిగి ఆవిడ వళ్ళో ముఖం దాచుకుంది వైజయంతి

పెద్దమ్మా నాగురించి మీరేం బెంగ పడకండి! నన్నింతదాన్ని చేశావదేపదివేలు! నా పెళ్ళి వూసునాకు వదిలెయ్యండి! చెల్లాయి పెళ్ళి చేసేయండి! డబ్బు సాయం నేను చేస్తాను సరేగాని ఏదీ అది? ఇవాళ ఎక్కడికెళ్ళిందది?

నీకు చెప్పలేదా? వాళ్ళ స్నేహితురాళ్ళతో కల్సి పిక్నిక్కెళ్ళింది!

ఓ! అవునవును! నిన్న చెప్పిందిలే! నేను మర్చే పోయాను! ఈ వుదయం నేను లేచేసరికే వెళ్ళిపోయిందన్నమాట?

చీకటి బాగా పడిపోయినా ఇంకా స్వరూప రాలేదని అంతా ఆత్రంగా చూశారు

దక్షిణామూర్తికి భయం పుట్టి స్వరూప స్నేహితురాలి ఇంటికి వెళ్ళాడు ఆ పిల్ల వస్తూ వుంటుంది యింటికి తరచూ వెళితే స్వరూప రాలేదా యింటికి? అనడిగిందాపిల్లే!

దక్షిణామూర్తి చూశారు ఆ అమ్మాయేదో దాస్తున్నట్టు అన్పించిం దతనికి గట్టిగా అడిగారు

నేను త్వరగానే వచ్చేసేనంది యింటికి అందరూ బయల్దేరిందాకా నేనుండలేదు అందా అమ్మాయి మరొక అమ్మాయి యింటికి అతన్ని తీసుకు వెళ్ళింది

స్వరూపని ఎవరో రవుడీలు అల్లరిపెట్టారండీ! స్వరూప వాళ్ళని తిట్టింది రెచ్చిపోయారు మానించి దూరంగా లాక్కుపోయారు వాళ్ళు స్వరూపని మేం భయంవేసి వచ్చేసేం అని చెప్పిందా అమ్మాయి

దక్షిణామూర్తికి కరచరణాలాడలేదు

ఒక్క పిల్లనలా వదిలేసి వచ్చేస్తారా అమ్మాయ్! అదేం న్యాయం? పోనీ అదేమన్నా మగవాడా? మీలాంటి ఆడపిల్లేగదా? ఏం అఘాయిత్యం జరిగిందో ఏమిటో? అన్నాడు ఒళ్ళుమండి

ఏం చెయ్యమండి? మేం పిక్నిక్కి వెళ్ళిందే అసలు పదిమంది కూడా లేము! మాతో మా టీచర్లుగాని ఏ పెద్దాళ్ళూ రాలేదు! అందరం చిన్నవాళ్ళమే! ఆ రవుడీలు మమ్మల్ని బెదిరించితే భయంవేసి వున్నపళంగా ఎలాగో పరిగెత్తుకుని ఏ బస్సో ఎక్కేసి వచ్చేసేం! అంటూ ఏడ్చేసిందా అమ్మాయి

క్షమించండి బాబాయిగారు! స్వరూపెలా వుందో? ఏంటో? నాకు చాలా భయమేస్తోంది! దాన్నలా వదిలేసి వచ్చేసినందుకు క్షమించండి!

క్షమించితే నా కూతురి పరువూ ప్రాణమూ పోయినవి వస్తాయేంటమ్మా! పూర్కో! మా గొప్పపని చేశారంతానూ! గట్టిగా తిరగబడి ఎదిరించలేనివాళ్ళు






# అక్షింతలు

## 3

ఎందుకు బైల్దేరారూ?"

దక్షిణామూర్తి చెమట్లు కారుతూంటే, ఇంటికి వెళ్లాడు. జరిగిందివిని, పూర్ణ ఘొల్లుమంది. వైజయంతికి మతిపోయినట్టయింది. ఏమిటిలా అయింది? ఏంటిలా అయింది? అనుకుంది భయంతో, ఆందోళనతో.

వూరంతా గాలించారు దక్షిణామూర్తి, అతనిస్నేహితులు. వూరి చివర, తాటితోపులో పడివుంది. స్వరూప శరీరం! ఒంటిమీద బట్టలు చిరిగి పీలికలయి వున్నాయి.! గాట్లుపడి నెత్తురు చిందింది చాలాచోట్ల! తెలివిలేదు! ప్రాణం వున్నది! అలోపాలోమంటూ యింటికి చేర్చారు. డాక్టర్ని తీసుకువచ్చి పరీక్షచేయించితే, స్వరూప ఎక్కువమంది వ్యక్తులచేత, చాలా దారుణంగా మానభంగం చేయబడినదని తెల్సింది!

ఆ ఇల్లు శోకానికి, దిగులుకి నిలయం అయిపోయింది. పూర్ణ, దక్షిణామూర్తి పిచ్చివాళ్లల్లా అయిపోయారు. తిండిలేదు. నిద్రలేదు. ఏడవడం వుండి వుండి, లేదా చేష్టలు లేక అలా బొమ్మల్లా కూర్చుండిపోవడం. వైజయంతిస్థితి అయోమయంగా వుంది. ఆమె ఏడ్చి, ఏడ్చి, ఇంక ఏడవడానికి నీర్సంవచ్చి, మనసురాయి చేసుకుంది.

పెద్దవాళ్లనెలా వోదార్చాలో తెలీదు!

స్వరూపకి చికిత్స జరిగింది. తెలివివచ్చింది. కాని, శూన్యంలోకి చూస్తూ, బొమ్మలా వుండిపోతోంది. వైజయంతి పలకరించినా పలకదు!

వారంగడిచింది.

వైజయంతి పెట్టిన శెలవు అయిపోయింది!

రేపే వెళ్లి జాయిన్ అవాలి!

అవాళ పెదనాన్నతో, పెద్దమ్మతో చాలాసేపు మాట్లాడింది. "ఈ పరిస్థితిలో దాన్నిక్కడ వుంచడం వలన దానికి బాగా వుండదు! మీకూ బాగా వుండదు! అంతా ఒకేచోట, ఒకరి ముఖాలు ఒకరు చూస్తుండడం చాలా కష్టం! ఆ పరిస్థితి అనుభవించిన వాళ్లకే తెలుస్తుంది. దాని కష్టంనించి దాన్ని ఎంతో కొంత దూరం చేయాలన్నా దాని స్థితినించి, ఆ బాధనించి మిమ్మల్ని ఎడం చేయాలన్నా, దాన్ని నా వెంట తీసుకుపోవడం వుత్తమమైన పని!! కాదనకండి!!" అని చెప్పింది.

"తీసుకెళ్తావు. బాగానే వుంది! ఎన్నాళ్లుంచుతావు నీ దగ్గర? నీ ఫ్యూచరో?"

"నా ఫ్యూచరు నా గుప్పిట్లో వుంది! నా గురించి మీరు ఎప్పుడూ వర్రి అవద్దు! అలాగే నాతో వుంటే, స్వరూప గురించి మీరు...."

"చాలు! చాలు! ఇంక దాని గురించి మాకు నిబ్బరం ఏమిటి? జరిగిందేదో జరిగేపోయింది!"

"వూరుకోండి, పెద్దమ్మా!"

స్వరూపని తనవెంట తీసుకు బయలుదేరింది వైజయంతి, రైల్లోంచి తనకి ఒక్క చెయ్యే ఎంతో కొంత నిబ్బరంగా వీడ్కోలు చెపితే, దక్షిణామూర్తి చొక్కాతో కళ్లు తుడుచుకున్నాడు.

"అమ్మాయి వైజయంతిని ఆశీర్వదిస్తూ మీ పెదనాన్న దక్షిణామూర్తి వ్రాయునది. అంతా క్షేమం అని ఎలా వ్రాసేది? అది పూర్వం మాట! ఇప్పుడు ఇల్లే మారిపోయింది వైజయంతీ! మన స్వరూప దానికది నేరం చేయకపోయినా, శిక్ష మాత్రం చాలా దారుణంగా వున్నాదమ్మా! తల్లితండ్రులం! మా యిద్దరికీ ఆ బెంగా, భయం, అవమానంతో చచ్చి పోతుంటే, ఈ వూరివాళ్లు రకరకాల కామెంట్లుతో మరింత చంపుతున్నారనుకో! మా మీద, స్వరూప మీద వాళ్లెవరికీ ఆవంత సానుభూతిలేదు సరికదా, పరాచికాలూ, పరిహాసాలూను!! ఇదంతా చూస్తుంటే స్వరూపకి పెళ్లవడం చాలా కష్టం అనిపిస్తోందమ్మా! చూడు! ఒకమాట! ఈ వూరి పెద్దమనుషులెవరూ, అక్కడ మీ యింటికి రాకుండా చూడు! అక్కడికి కూడా ఈ విషాన్ని మోసి, వాతావరణాన్ని కాలుష్యం చేస్తారు వీళ్లు!

అమ్మాయీ! మీ పెద్దమ్మ జీవచ్ఛవంలాగా వుందనుకో! వుత్తరాలు **రాస్తూండు! చూడు! స్వరూపని చదివించు! దానికి మరో వైపు తిప్పితే, కొంచెం స్వస్థత పొందుతుంది!! వుంటాను!**

మీ

పెదనాన్న, దక్షిణామూర్తి

* * * * * * * * *

పెదనాన్నకి, నమస్కారములతో, వైజయంతి వ్రాయునది. నేనిక్కడ స్వరూపని చదివిస్తున్నాను. దానికి అంతగా చదువుమీద శ్రద్ధ కుదరకపోయినా, పోరి పోరి మరీ చదివిస్తున్నాను! మీరిద్దరూ దాని గురించి బెంగపడకండి! మీ ఆరోగ్యం జాగ్రత్త! మీరు ఒక్క స్వరూపకే కాదు! నాకు కూడా తల్లి, తండ్రి!! స్వరూప భవిష్యత్తు, దాని సౌఖ్యం, సంతోషం అన్నీ నేను చూచుకొంటాను!! దాని పూచీ నాది!! మీరు నన్ను యింతవరకు చూశారని, నన్నింతదాన్ని చేశారనీ, ఆ కృతజ్ఞతలతో, స్వరూప భారం నా పైన వేసుకొన్నానని, నేనేమీ అలాంటి సినీ డైలాగులు పలకను గాని, స్వరూపని ఒక సంపూర్ణ వ్యక్తిగా తీర్చిదిద్దే పని నేను చేస్తానని చెప్పగలను!

పెదనాన్నా! స్వరూపనిక్కడ, ఒక లేడీ డాక్టరికి చూపించాను. గర్భం రాకుండా జాగ్రత్త తీసుకున్నదామె! ఒకటే సమస్య! స్వరూప వివాహం!! ఆ వూరిలో దాని పెళ్ళి కష్టమే! నేరం దానిది కాకపోయినా, మన సమాజం ఇలాంటివి అంగీకరించదు!! అంత విశాల హృదయాలుండవు!! అన్నట్టు ఒక విషయం చెప్పాలి! ఇక్కడికి కూడా స్వరూప దరదృష్టం ప్రాకిపోయింది!! ఇలాంటివి దాగటం చాలా కష్టం! మంచి వార్తలు కంటే చెడ్డ వార్తలు అత్యంత వేగంగా గాలిలోంచి పయనిస్తాయి!! మొన్న మా ఆఫీసులో ఇద్దరు ఆడవాళ్ళు మాట్లాడుకొంటుంటే, విన్నాను! మన వూరే! ఈ ఇన్సిడెంటే!! నా గుండె గుభిల్లుమంది!! నేనప్పుడు బిక్కచచ్చి పోయేననుకో! ఆ వెధవలెవరో ఎదుటపడితే అమాంతం కాల్చి పారేయాలన్పించింది! జెయిలుకి పోతే పోతాను




# అక్షింతలు

గాని!'

రెండ్రోజులపాటు నా మనసు పాడైపోయి నోరు పెగల్లేదు ఏ పని కుదురుగా చెయ్యలేక పోయాను స్వరూప అలా వున్నావేమే? అని అడిగితే ఏం చెప్పేది? ఏం లేదన్నాను మాట మార్చేసాను'

పెదనాన్నా' వుంటానింకో పెద్దమ్మని నువ్వు మామూలు మనిషిని చెయ్యాలి' చెల్లి నా చేతిలో పెద్దమ్మ నీ చేతిలో వున్నారు' ఏదో అయిందని అదే తల్చుకుంటూ వుండిపోతే జీవితాలు సాగవు' మంచి రోజుల్ని మనమే ప్రయత్నించి తెచ్చుకోవాలి'

ఇట్లు మీ అమ్మాయి
వైజయంతి

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

అక్కా' పోస్టు వచ్చింది అంటూ రెండు కవర్లు తీసుకువచ్చి ఇచ్చింది స్వరూప రెండూ క్లోజ్డ్ కవర్లే

కనుబొమ్మలు ముడేసి ఒక కవరుపై అడ్రస్ చూసింది వైజయంతి ముత్యాల్లా వుంది వ్రాత' ఫ్రమ్ అడ్రస్ పైన రాసిలేదు' చించి లోపలి కాయితం తీసింది పెదనాన్న వ్రాత ఇంత చక్కగా వుండదు' రెండోది మాత్రం పెదనాన్న వుత్తరమే' ఆ రాతే చెప్తోంది మొదటి వుత్తరం గబగబ చదివింది

కుమారి వైజయంతి గారికి నమస్తే నేనసలు ఈ వుత్తరం మీకు వ్రాసేటంతటి ధైర్యం నాకు లేదనుకోండి' కాని రాయకుండా వుండలేకపోయాను' ఆఫీసులో మీతో మాట్లాడడానికి అస్సలు వీలుండదు' ఒకవేళ ఏ లంచ్ టైంలో నో వీలున్నా మీరు ఆ అవకాశం యివ్వలేదు' మీదంతా ముక్కుసూటి వ్యవహారం' మీ ముక్కుకి మల్లే చక్కగా సూటిగా తిన్నగా పోతారు' ఆ చక్కటి ముక్కు నన్ను మాత్రం మహా అల్లరి పెడ్తోందండి వైజయంతిగారు' ఎంత వూరుకుందామన్నా మనసు తొలిచేస్తోంది' ఈ అల్లరినింక భరించే శక్తి లేక ఈ వుత్తరం వ్రాస్తున్నాను' దయచేసి చించి పారేయకండి' ప్లీజ్' ఈ మనోజ్ ప్రేమని అర్థం చేసుకోండి' నాకు మీకంటే అధికంగా అర్హతలున్నాయి' చదువులోగాని వుద్యోగంలో సర్వీసులో రూపం పర్సనాల్టీలో ఆధిక్యత లున్నాయి' ఒకే ఆఫీసువాళ్ళం' మీకు తెలీనిదేముంది? దయచేసి రిప్లయ్ వ్రాయండి! నేను మనసారా ప్రేమిస్తున్నా మిమ్మల్ని'

త్వరలోనే మీ జవాబు తెలియజేస్తారు గదూ? ఆ జవాబు అది శుభకరంగానే వుండాలనీ ఆశిస్తూ మీ మనోజ్

అక్కా' ఎవరే? అడిగింది స్వరూప ఆత్రంగా

మా ఆఫీసులో ఒక ప్రేమపక్షి

ప్రేమపక్షి?' ఓహో' లవ్ లెటర్రాసేడా?

వూఁ చూస్తున్నా చాలా రోజుల్నించి ఆ చూపులూ వ్యవహారం అంతానూ'

ఏం చేస్తావు? నీ కాలి జోడుకి పని చెబుతావా?

అదే ఆలోచిస్తున్నా'

నీ కాలి జోడుదాకా ఎందుకు? అతడికి కళ్ళజోడుందా?

వుందే' నీకేం తెల్సు?

నా మొహం మాటవరస కడిగేనే' చూడు కళ్ళజోడుంటే నింపాదిగ దగ్గరికెళ్ళి అది లాగేసి దాచెయ్యి' దాంతో లెటరు కాదు గదా మొత్తం అతనింక ఏది రాయలేడు ఆఫీసు పనాగిపోతుంది' నీలాంటి వాళ్ళని చూడ్డం ఆగిపోతుంది'

యిద్దరూ పగలబడి నవ్వుకున్నారు

ఒసే' స్వరూ' యింత పెంకెదానివి' ఆ దొంగ వెధవలికి ఎలా లొంగిపోయావే?

ఆ ప్రశ్నతో ముఖం మారింది స్వరూపది

నా మొహం' వాళ్ళు ఎలా వున్నారు? ఒక్కొక్కడూ అంత ఎత్తూ ఇంత

# కండరాల పట్లతో తన వ్యాయామం చెడటం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి— ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే, అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ. ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా కండరాల పట్లు, బెణుకులు, కీళ్ల పట్లు లేదా ఒళ్లు నొప్పులతో బాధ పడటం జరిగితే కాస్త అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్®** —నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్

SKOF— ఎస్‌కేఎఫ్ ఉత్పాదన

ELL-151

# అక్షింతలు

వెధవల్బా! అరుగురు! నేను పిట్టలా వున్నాను! వాళ్ళేదో కూస్తే తిట్టాను! రెచ్చిపోయారు! మా ఫ్రెండ్సున్నా సరే వాళ్ళలోంచి నన్ను లాగేసి ఎత్తుకుపోయి

అవాళింక స్వరూప అన్నం తినలేదు నేరకపోయి ఆ వూసు ఎత్తాననుకుని పిచారించింది వైజయంతి

రెండ్రోజులు గడిచాయి వైజయంతి కనిబెడుతోంది ఆపీసులో మనోజ్‌ని ఎదో అడగాలని తెగ వుబలాట పడుతున్నాడు వైజయంతిని సమిపించి టక్కున ఆగి వెళ్ళిపోతున్నాడు లోపల నవ్వొస్తోంది వైజయంతికి లంచ్ టైంలో అవాళ అడిగేశాడు మనోజ్ నా లెటరు?

వైజయంతి నవ్వు దాచుకుని అందాల్సిన వాళ్ళకే అందింది అంది

అంటే అతను విస్తుబోతూ చూశాడు

మన ఆపీసరుగారికే అందింది! ఎం? అరె! అలా వణికిపోతున్నారేం? ఆపీసర్ గారికందితే ఎం? అమాయకంగా అంది వైజయంతి

మనోజ్ గొంతారిపోతూంటే బలవంతాన గుటకేసి అది కాదండి అది ఆయనకి కాదు అన్నాడు

ఆయనకెందుకు రాస్తారూ లవ్ లెటరు? ఆయన కూతురికి గదా మిర్రాశారు?

అయ్యయ్యో! నా ఖర్మ! నేను ఆయన కూతురికి రాయలేదండి బాబోయ్! రాసిరాస్తే ఆపీసరు కూతురికి రాస్తానా? నా బవిష్యత్తు కూలిపోదూ?

అలానా? మరయితే ఎవరికిటా?

మి కు

ఏం? నేను చవగ్గా దొరికేనా? నాకు రాస్తే పర్వాలేదా? నా బవిష్యత్తు కూలిపోయినా పర్వాలేదా? ఆపీసరు గారి కూతురు అంత గొప్పదా?

అదికాదండీ!

వైజయంతి తన పర్సు తెరిచింది అందులోంచి ఒక కాయితం తీసి పట్టుకుని నేనిది యివ్వాల్సిన వారికిస్తున్నా అంటూ నడిచింది మనోజ్ వణికిపోతూ వెంటబడ్డాడు

తల్లీ! తల్లీ! జన్మలో ఎప్పుడూ ఇలాంటి వెదవ పని చెయ్యను! అదిలా ఇవ్వు! ప్లీజ్! వైజయంతికి తెరలుగ నవ్వొచ్చేస్తోంది బింకంగ మొషం పెట్టుకుని నడుస్తోంటే అతను గోల చేస్తూ వెంటబడడం కొంతమంది చూసి గుసగుసలాడారు నవ్వారు ఒకతను మనోజ్‌ని పిల్చాడు మరొకతను నిలేసి అడిగాడు విషయం తెల్సిపోయింది అందరికి మనోజ్‌ని వేళాకోళం చేశారు వైజయంతి సీరియస్‌గా చూస్తూ గుప్పిట్లో కాయితం అతడి ముఖాన విసిరేసింది చూస్తే అది ఒట్టి తెల్ల కాయితం"

"వైజయంతిగారూ! మరెప్పుడూ మనోజ్ అలా చెయ్యడు! చేసాడా మేం అందరం చూసుకుంటాం! యింక అతన్ని బాధపెట్టకండి! అన్నారిద్దరు

ఆ కాయితం కాలిపోయిందిలెండి! యింక ఏడవకండి మనోజ్‌గారూ! అనేసి వెళ్ళిపోయింది తన సీట్లోకి వైజయంతి కాల్చేసేరా? పాపం! మనోజ్ ప్రేమ ఆ విధంగా కాలిపోయిందా?! బగ్వాన్! దేవదాసు పాటెత్తుకున్నాడో యువకుడు

హుష్! ఇదాఫీసా? మార్కెట్టా? ఎవయ్యేళ్ళ క్లర్కు కసిరాడు

పాపం ఆయనకన్నీ తీరిపోయాయండి! వయసయిపోయిందనీ ఆ కోపం మీన మిదా మధ్యన? ఇల్లాలిమిదో అప్పులాళ్ళ మిదో తీర్చుకోమనండి! బగ్వాన్! చెలియలేదూ! చెలిమి

యూ! షట్టప్ప్!!

ఆఫీసర్ రావడంతో అంతా నిశ్శబ్దం అయిపోయింది

## 4

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది వెనుక గదిలో నవారు మంచం మీద స్వరూప

చెల్లికింతలా పడుకొంది ఆమె గుండెల మీద క్లాసు పుస్తకం వుఛ్వాస నిశ్వాసాలకి పైకి లేస్తూ దిగుతోంది ఆమె ప్రక్కన మరికొన్ని పుస్తకాలు పడివున్నాయి పక్కనే టేబిలు ఫాను ఫుల్ స్పీడులో తిరుగుతోంది ఆదమరిచి నిద్రపోతున్న స్వరూప తలుపుకొడ్తున్న చప్పుడు నెమ్మదిగా ఎక్కడో ఆలకించినట్లయీ అది క్రమంగా దగ్గరయినట్లయీ వులిక్కిపడి కళ్ళిప్పింది అరె! తను యింతసేపూ నిద్రపోతూందా? గుండెల మీద పుస్తకం అలాగే వుండిపోయింది చేతుల్లోంచి జారి"

తలుపు కొట్టడం ఇంకా ఎక్కువయితే మంచమ్మీంచి లేచింది స్వరూప ఫాను గాలికి నిద్రలో చీర లంగా తొలగిపోయినాయి జుత్తు ఎచ్చిగా రేగింది సర్దుకొని వెళ్ళి తలుపు గడియ తీసింది

వైజయంతి తన చేతులు చూపించింది

అవి ఎర్రగా వున్నాయి!

తలుపులు కొట్టి కొట్టి చూడు! ఎలా చేతులు అయ్యాయో? అయినా అంత నిద్రేవిటే నీకూ? ఇక్కడికి వచ్చిం దగ్గర్నించి చూస్తున్నాను! రాత్రి పగలూ ఒకటే నిద్ర! నిద్ర! కుంబకర్ణుడికి చెల్లెల్లాగ! వూర్మిళాదేవి అక్కలాగా!

కోపంతో గబగబా లోపలికి వచ్చింది వైజయంతి బట్టలు మార్చుకుని వెళ్ళి కాళ్ళు మొహం కడుక్కు వచ్చింది కాపి యిస్తోంటే స్వరూప చెయ్యి వణికింది

ఎందుకా వొణుకూ? ఈ అక్కకి పేద్ద ఏదో బయపడిపోతూన్నట్టూ పోజూ!

చదువుతూంటే నిద్రొచ్చేస్తోందే!

వస్తే ఆపుకోవాలి! చేసే పని మీద ఎకాగ్రతా గురి శ్రద్ధా పట్టుదలా వుండాలే! ఏం పదేళ్ళ చిన్న పిల్లవా? యింతకంటే ఎం చెప్తాను నీకూ? దగ్గర దగ్గర యిరవయ్యేళ్లొస్తున్నాయి గద? యింటరు ఎన్నేళ్ళు దంతయాత్రలు చేస్తావు?కొంచెం సిగ్గుండాలే! అందులో పరిస్థితులు చూసి మనం మరి మెలకువతో నడుచుకోవాలి!

అటుప్రక్క తిరిగిపోయి వుంది స్వరూప

వెక్కిళ్ళు విని దగ్గరికెళ్ళింది వైజయంతి

ఛా! చా! ఏమిటిది? వూర్కో! నాకు ఏడ్చేవాళ్ళంటే చెడ్డ అసహ్యం! చేసేవెమో తెలివి తక్కువ పన్లు! ఏమైనా అంటే ఏడుపూ! అంతే చేతనవును!

అవాళ చెల్లెల్ని మంచినీళ్ళతో మరి కడిగేసింది వైజయంతి తిడదామని కోపంతో కాదు మందలిద్దామని ఆవేశంతో కాదు ఆ విదంగానయినా నాలుగు ఝూడించితే దారికి వచ్చి బుద్ధిగా చదువుతుందని

రాత్రి చాలాసేపు బోదపరచింది కూడా

చూడు స్వరూ! మన జీవితాల్ని సాద్యమైనంత వరకూ మనమే మలచుకోవాలమ్మా! ఆ శక్తి యుక్తి మన మనుషులికి యిచ్చేడు దేవుడనేవాడు!

చూడు! ఆవూ గేదె మేకా పులీ యివి ఆలోచించలేవు! వాటికా శక్తిలేదు! మనకా శక్తి వుంది! కనుక మనం వాటిని లొంగదిసుకునీ వాటి మీద ఆదిపత్యం సాగిస్తున్నాము! పులిని మనిషి లొంగదిసుకున్నట్టే పులిలాంటి పరిస్థితుల్ని లొంగదిసుకోవాలి!! అది మన క్రెడిట్!! లే! లే! బాగా చదువు! నిద్ర ఒస్తే నీళ్ళతో మొహం కడుక్కో! టీ తాగు! రాత్రి నిద్ర చాలు! పగలు పడుకొందిక్కాదు! బాగుపడడానికి! మనం నిర్దేశించుకున్న లక్ష్యాన్ని గమ్యాన్నీ చేరడానికి!

ఆ మర్నాడు వైజయంతి ఆపీసు నించి యింటికి వచ్చింది తన మాటలు చెల్లెలిమీద ఎంతో ప్రబావం చేస్తాయని అది పట్టుదలగ చదివేస్తూంటుందనుకొంది కాని యదాప్రకారమే!! తలుపులు నిన్నటిలాగే చాలాసేపు బాదవల్సి వచ్చింది! నిస్త్రాణ వచ్చేసింది వైజయంతికి

ఛీ! ఛీ! ఇదేం పిల్ల బాబూ! అనుకొంది విసుగుతో

రేగిపోయిన జుత్తూ అస్తవ్యస్తంగా బట్టలూ నిద్ర కళ్ళతో తలుపులు తీసింది స్వరూప

అక్కా! ఎం చెయ్యనే? ఎంతాపుకుందామన్నా అక్క ముఖం చూసి మాట మింగేసి లోపలి కెళ్ళిపోయింది

వైజయంతి గమనిస్తోంది ట్రాన్సిస్టరు పక్కన వుంచుకొని పాటలు వింటూంటే స్వరూప కళ్ళు మూతలు పడటంలేదు! కాళ్ళతో చేతుల్తో లయవేస్తూ వింటోంది! పక్కింట్లో టి వి చూద్దామంటూ లేచి వెళ్తోంది! దీని గురించి ఎమనుకోవాలింక తను??

ఆ రోజు వైజయంతి తాము అద్దెకి వుంటోన్న యింటిగలావిడతో మాట్లాడింది ఆవిడ చాలా మంచిమనిషి ఎదుటి వారిని అర్థం చేసుకోగల వివేచన వున్నది పైకి కొంచెం రిజర్వుడుగా వున్నా మాట్లాడితే మట్టుకు చాలా ఆప్యాయతతో మాటలాడుతుందామె

వైజయంతి చెల్లెలి గురించి చెప్పిందామెతో పెళ్ళి సంబందాలు తెలిసి వుంటే చెప్పమంది ఒక వారం రోజుల్లో ఇంటావిడ పారిజాతం ఒక సమ్మందం చెప్పింది పెళ్ళికొడుకు పారిజాతానికి కొంచెం దూరం వరసతో మేనల్లుడవుతాడు అబ్బాయి కలకత్తాలో ఏదో కంపెనీలో మేనేజరుద్యోగం చేస్తున్నాడు బాగా చదివాడు వాళ్ళ తల్లి తండ్రి ఈ వూర్లోనే వుంటున్నారు కుర్రాడికి అనేకమంది పిల్లల్ని చూపిస్తున్నారు కాని ఎవరూ అతడికి నచ్చటంలేదు అది పరిస్థితి

మీ చెల్లెలు మా వాడికి నచ్చితే నచ్చవచ్చుమ్మా! స్వరూప లక్షణంగా వుంటుంది నేను వాళ్ళకి చెప్పాను ఎల్లుండి వాడొస్తున్నాడు ఆ మర్నాడు మా ఇంట్లో చూపులు ఎర్పాటుచేద్దాం! అని చెప్పింది పారిజాతం

ఈ విషయం వైజయంతి పెదనాన్నకి వ్రాసింది మొదట చూపులవనీయి! మాటలు నేను మాట్లాడతానులే! ఎలాగో పెళ్ళి అవడం కావలసింది! స్వరూపకి ఆ ముచ్చట తీరితే కాని లేకపోతే దానికి ఏ పనిమిదా కుదురులేదు! ఎమైనా అంటే ఏడుస్తుంది దాంతో నా గుండె తల్లడిల్లి పోతుంది దాని పరిస్థితి అంత సున్నితంగా వుంది! అంటూ వ్రాసింది

అవాళ ఆ అబ్బాయి అతని తల్లి తండ్రి వచ్చారు పారిజాతం ఇంటిలో చూపులయినాయి అబ్బాయి ఎమీ అడగలేదు స్వరూపని సంతృప్తి అతని వదనంలో ద్యోతకమైంది! మావగారు బుద్ధుడిలా కూచున్నాడు! అత్తగారు మాత్రం అందరి తరఫునా గడగడా మాట్లాడింది ఎన్నో ప్రశ్నలడిగింది అవి కోర్టులో లాయర్ అడిగినట్లున్నాయి!! క్రాస్ ఎగ్జామిన్ కూడాను! వైజయంతి హడలిపోయింది యిబ్బందిపడింది అత్తగారు స్వరూప నీకేమవుతుందంది వైజయంతిని కజిన్ సిస్టరైతే ఇక్కడెందుకుంది? అంది!

నీ మీద వాళ్ళు పెళ్ళి బాద్యత పెట్టారెందుకని? అడిగింది!!

అసలు ఆ పిల్ల తల్లితండ్రులు వుండాలి ఇటువంటప్పుడు అంది!

వాళ్ళు లేకుండా పిల్లలే మాట్లాడ్డం నాకేం బాగో లేదమ్మాయ్! అంటే వైజయంతి గొంతు పెకల్చుకొని

మా పెద్దమ్మ ఆరోగ్యం బాగోక రాలేదు పెదనాన్న ఆవిడని కనిపెట్టుకుని

## ఇది నా కోసం కాదు

భక్తితో పూజించే భక్తకోటి కోరే
కోరికల కూరిమితో కరుణించే ఓ వినాయకా
కోరను నిన్ను కోరిన తావుకు తృటిలో
తీసుకుపోయే పుష్పక విమానాలను
కోరను నిన్ను కొప్పున దరించగనె జగదేక
సౌందర్యము నిచ్చు పారిజాత కుసుమాన్ని
కోరను నిన్ను మనషికి మనిషికి నడుమ అసూయాగ్నిని
రగిలించే మణి మయ భూషణ జాలాన్ని
కోరను నిన్ను మనుషుల మద్య అంతస్తుల
బేదాన్ని సృష్టించే రత్నస్వగిత బవనాలను
కానీ నేను కోరేది ఒక్కటే
నాదేశానికి పగతుర నెదిరించే
విశేష సామర్ధ్యాన్ని కలిగించు
నా కోరికను కూరిమితో కరుణించు
ఓ భక్త జన పాలకా వినాయకా!

—ఇసుకపల్లి సుజాత



# అక్షింతలు

వుండిపోయేరు! అదిగాక ఆయన టీచరు యిప్పుడు శెలవులివ్వరండీ! ఒక్క రోజు శెలవ దొరకదు! స్కూల్లో ఎగ్జామిన్స్ అంటూంటే

అయ్యేసీ అలాక్కాదు! మేం వెళతాం ఆ వూరు! వెళ్ళి మీ వాళ్ళతో మాట్లాడాలి! అందావిడ!

అవాళే భైల్దేరి ఆ భార్యాభర్తలు వెళ్ళారు

ఆ తర్వాత—

ఒక రోజు పారిజాతం ఒక పోస్టు కార్డు తీసుకువచ్చి వైజయంతికిచ్చింది అందులో ఇలా వుంది

అమ్మాయ్! మీ వూరెళ్ళాము మీ వాళ్ళతో మాట్లాడాము పెళ్ళంటే నూరేళ్ళ పంట! ఒకరి గురించి ఒకరు మంచి చెడ్డా అన్నీ తెలుసుకోవాలి గదా? మేం వాళ్ళనీ వీళ్ళనీ కనుక్కుంటే మీ చెల్లాయి గురించి చాలా చెడ్డగా బోగట్టా తెల్సింది! అదంతా నువ్వు దాచిపెట్టి మా అబ్బాయి జీవితం నాశనం చేద్దామని చూశావ్!! అది చాలా తప్పమ్మా! ఇంతకంటే ఎక్కువ రాయడం నాకిష్టంలేదు!

మా పారిజాతం మాటలు నమ్ముకుని మేం వచ్చాం! పారిజాతం చాలా అమాయకురాలు కాబట్టి మీరు వాళ్ళింట్లో వుండగల్గారు! పోన్లే! ఎవరి ఖర్మ వాళ్ళది! మీ ప్రారబ్ధం మాలాంటి వాళ్ళకి తగిలించవద్దు! – కాంతం

అక్కా! ఏవిటే కార్డు? ఎవర్రాశారు? నాన్నా? ఏదీ? అడిగింది స్వరూప

వైజయంతి వులిక్కిపడింది కార్డు స్వరూపకి చూపిస్తే అది బాధపడుతుందని దాచేద్దామనుకుంటూంటే స్వరూప చూసింది గబాల్న లాగేసుకుంది!

తరువాత స్వరూప ఘొల్లుమంటూ మంచమ్మీద పడిపోయింది ఆ రాత్రి స్వరూపకి ఫిట్ వచ్చింది! దగ్గర్లో వున్న డాక్టర్ని తీసుకువచ్చింది వైజయంతి మందులు యిచ్చేక కోలుకుంది స్వరూప కాని మళ్ళా పూర్వంలాగా అయిపోయింది!! చలనరహితంగా

వైజయంతికి మతిస్థిమితం తప్పుతున్నట్టుయింది ఆఫీసులో ఎలా పనిచేస్తోందో తనకే తెలీదు! రాత్రి పడుకున్నా ఈ నగ్నసత్యం కనుల ముందు కరాళ నృత్యం చేస్తోంటే గుండెని స్థిమితపర్చుకోలేక సతమతమవుతోంది

## 5

తనని ఎవరో అనుసరిస్తున్నట్టు అనుమానంవచ్చి వెనుతిరిగిచూసింది వైజయంతి అతనే! మనోజ్!!

ఆగిపోయింది ఏమిటి విశేషం? అంది ముఖంలో ఏ భావం వ్యక్తమవనీకుండా

మనోజ్ గెడ్డం పెంచేశాడు! పూర్వంలాగా ట్రిమ్ముగా ముస్తాబులో లేడు!!

అఁహ అదే అదే నేను నేను తడబడ్డాడు వైజయంతి అటు ఇటు చూసింది అప్పుడే రోడ్డు మీద అనేకమంది కళ్ళకి ఇటు పనిబడింది!! వైజయంతికి అసహనంగా అనిపించింది

చూడండి మిస్టర్ మనోజ్! మీకు చదువు వుద్యోగమూ అన్నీ ఎక్కువే అన్నారు! అన్ని ఎక్కువయినప్పుడు మరి అది కూడా కొంచెం ఎక్కువే వుండాలి! అంది

అసరికి వాళ్ళు యిద్దరు ఆ రోడ్డుదాటేసి పేవుమెంటు మీదకి వచ్చేశారు

ఏది? అడిగాడు మనోజ్

అదే బుద్ధి బుద్ధి!!

అతను నాలికతో పెదివుల్ని తడుపుకున్నాడు

నిజమే నిజమే ఇలా రోడ్డుమీద ఒక అమ్మాయితో మాట్లాడ్డం నాది బుద్ధి పొరపాటే! ఒకాఫీసు వాళ్ళం అని మాట్లాడాను అసలు లెటర్రాయడం చాలా బుద్ధి పొరపాటు! అసలదేమిటో గానీ నేనన్నీ బుద్ధి పొరపాటు పనులే చేస్తూంటానండీ! అందుకే మా మదరు గ్రాండ్ మదరూ నన్ను బుద్ధిలేని గాడిదా అంటుంటారు!

ఛీ! అంది వైజయంతి అలా చెప్పడానికి మీకు సిగ్గెయ్యడం లేదూ?

# టాన్‌టెక్స్®

# ఎకానమి

నాణ్యత... ఇప్పుడు అందుబాటులో

Imageads M 1797 Tel



# అక్షింతలు

"నిజమే సుమండీ! చూశారా? అందుకే నన్ను మా వాళ్ళు అట్లా

చీ! చాల్లేండి! వెళ్ళండింక! నా పరువు తియ్యకండి! బుద్ధి పొరపాటుగారూ!

యింటివరకూ వచ్చేశాడు మనోజ్!

చూడండి నాకంటె ఎన్నో అధిక్యతలున్నాయి మీకు! అవన్నీ మర్చిపోయి, ఇలా ప్రవర్తించకండి! మీ ఎక్కువకి నాకంటె ఎక్కువైన అమ్మాయే దొరుకుతుంది మీకు! దయచేయండి!

మిమ్మల్ని నేను మరిచిపోలేక పోతున్నాను. వైజయంతిగారూ! నా ప్రేమ మీకు చాలా చీప్‌గా కన్పిస్తుందేమో! కదూ? మిమ్మల్ని మరిచిపోవడం నాకు అసాధ్యంగా వుంది!

నిజంగానా? కళ్ళింతలు చేసి, ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది వైజయంతి

'ఒట్టు! నామీదా! మీ మీదా! ఈ భూమ్మీదా! అదిగో! మీ సిస్టర్లా వున్నారావిడ మీదా!

బావుంది బావుందిగాని నిజంగా మీకు నా మీదంత కాన్ఫిడెన్సుంటే, నేను చెప్పినట్టు వినండి!

అలాగే

ఇలా రండి ఇంట్లోకి! అరుబయట మాటలు ఆడపిల్లకి అనర్థదాయకం! వొసే!స్వరూ! కుర్చీ వెయ్యిలా! ఇది మా చెల్లాయి! పేరు స్వరూప! ఇంటర్ చదూతోంది ఈయన పేరు మనోజ్! మా ఆఫీసులో నాకంటే పెద్ద పోస్టు! నేను మామూలు క్లర్కు అయితే, ఈయనేమో ఎకవుంటెంటు! సినియారిటీ వుంది! బోలెడు జీతం!బోలెడు చదువూ! బోలెడు ప్రేమా కూడా వుంది, అందరి మీదాను!

మనోజ్ సిగ్గుపడిపోతూ, వులిక్కిపడి,

అందరి మీదానా? అందర్నీ నేను ప్రేమించనండోయ్' అన్నాడు స్వరూప నిమిషంసేపు మనోజ్‌ని కనురెప్పలార్చక చూసింది. ఆ వెంటనే ఎరుపెక్కిన మొహంతో, లోపలికెళ్ళింది అయిదు నిమిషాల్లో కాఫీ కప్పుతో వచ్చి, కప్పు మనోజ్‌కిచ్చి, 'తీసుకోండి" అంది వైజయంతి తనూ కాఫీ కప్పు తెచ్చుకుని, మరో కుర్చీలో కూచుని, కాఫీ ఒక్కో గుటకేస్తూ అంది

"మీరు నేను చెప్పినట్టు వింటానని ప్రామిస్ చేశారు కనుక చెబుతున్నాను! మీ ప్రేమ భావాన్ని ప్రజోపయోగకరంగా మలుచుకోమని నా సలహా! అంటే చూడండి! ప్రేమని పెళ్ళికి ముడిపెట్టకూడదు కేవలం! మీ 'విద్యని, విద్యలేని వాళ్ళకి దానం చేయండి! మీరు మా చెల్లాయికి చదువు చెప్పండి! మా చెల్లాయి మీ వలన బాగా చదువుకొని, పాసయితే, నాకు మీరెంతో హెల్ప్ చేశారని సంతోషిస్తాను! సహాయం కూడా ప్రేమలో ఒక భాగమే! ఏమంటారు?'

అతను నెమ్మదిగా 'అవును' అన్నాడు. యిబ్బందిగా కుర్చీలో కదిలాడు అది గమనించి నవ్వుకొంది వైజయంతి లేచి నించుంది ఓ కే అలా చేయండి! అర్థమైంది కదూ" సహాయపడడం ప్రేమలో ఒక భాగం'' అంది ముగింపుగా

'మీరు నన్ను మరిచిపోతున్నారు

నెవర్! యింత పర్సనాలిటీని ఎలా మరిచిపోతాను? ఒక మాట! ఇందులో మీకేమైనా అభ్యంతరం వున్నదా? చెప్పేయండి! మొహమాటం పడవద్దు! నాకూ మొహమాటానికి పడదు!

'అబ్బే! అదేం లేదండి'

'ఓ! నేను సహాయం కోరితే, మీకు ఎక్కువ ఆనందం అనుకుంటాను! ఏం? మా చెల్లాయికి చదువు చెబుదురూ? వున్నవాళ్ళకి దానం చేయడంలో గొపతనం లేదు! లేనివారికి ఇవ్వడమే గొప్పదనం!

తల గోక్కుంటూ, మనోజ్ నెమ్మదిగ వస్తానండీ" అని వెళ్ళిపోయాడు

'మళ్ళా అతను వస్తాడంటావా? దవుటే!" అంది వైజయంతి నవ్వుతూ అదేమో! నువ్వోటి కూడా చెప్పడం మర్చిపోయేవే!' అంది స్వరూప నవ్వుతూ

'ఏమిటే ఆ ఇంకోటి?

'ఆ మాట కూడా చెప్పేస్తే, ఇంక మరి నీకతని పోరుండదు! ఈ ఇంటి చాయలక్కూడా రాడు!













ఏంటదంటే?

అదే మొన్న ఆ పెళ్ళివారికి తెల్సిన భోగట్టా! వాళ్ళని ఎగరగొట్టేసిన వార్త!"

అంటూంటే, స్వరూప కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి! అయిదు నిమిషాలు అక్కడ నిశ్శబ్దం మూలిగింది గోడలు ఆ అక్కచెల్లెళ్ళని జాలిగా చూశాయి

స్వరూ! ఏడవకే నీకు నేను వున్నానే! ఈ అక్కయ్య వున్నంతదాకా నీకు ఏ భయమూ లేదు!' అంది వైజయంతి స్వరూపని దగ్గరికి లాక్కుని, కళ్ళు తుడిచింది

మనిద్దరి పేర్లు చాలా బాగున్నాయే, అక్కా! నా పేరు భయం! నీ పేరు అభయం!' అని నవ్వింది స్వరూప గలగలా, ఏడుపుని బలవంతాన వెనక్కి తోస్తూ సంతోషాన్ని వ్యక్తపరిచే ఆ ప్రయత్నంలో స్వరూప పడే యిబ్బందిని గమనించి, వైజయంతి లోపలే నిట్టూర్చింది

ఆ మరునాడు మనోజ్ రాలేదు రాడని స్వరూప అనుకొంది వైజయంతి అలా అనుకొంది గాని, మళ్ళా అటు ఇటు అయింది అతన్ది ఆదర్శం ప్రేమా? అవసరం ప్రేమా? అర్హతల ప్రేమా? అనుకొంది

స్వరూ అందంలో తనకేమి తీసిపోదు కాకపోతే, తనదో రకం అందం! ఆ అమ్మాయిదో రకం అందం"

ఆ మూడో రోజున, మనోజ్ వచ్చాడు!

అక్కచెల్లెళ్ళు విస్తుపోయారు

గబగబ స్వరూప ఆ ముందు గదిలో కుర్చీలవి సర్దేసింది అటు ఇటూ తిరిగి హడావుడి పడిపోయింది సర్దివున్న పమిటే తిరిగి సర్దుకుంది 'అక్కా' అంటూ లోపలికి పరుగెత్తింది మళ్ళా పరుగుతో ఇవతలికొచ్చింది

వైజయంతి చెల్లెల్ని చూస్తోంది నిశ్చయంగా దీనికి పెళ్ళి కావాలి" అనుకొంది

మనోజ్ నడిగితే? ఏం చెప్తాడు? చదువు చెప్తాడు గాని, దాన్ని పెళ్ళి చేసుకుంటానని చెప్పడు

ఏమో? ఆ మాట అడిగితే, చెప్పే చదువుక్కూడా ముప్పు వస్తుంది" దీని సంగతి చూస్తే ఇలా వుంది" తెగ సిగ్గు పడిపోతోంది పిల్ల" నేరకపోయి వీళ్ళిద్దర్నీ కలిపేనా? దేవుడా! రక్షించు! మనోజ్ నడిగి, అతనికంతా తెల్సి, అతను కాస్తా రిజెక్ట్ చేస్తే ? ఈ పిచ్చి పిల్ల గుండె పగలదూ?

తల పట్టుకొంది వైజయంతి

అతను రావడం, తనకోసం!

ఇది చదవడం, అతని కోసం"

వాళ్ళని గమనిస్తోంది వైజయంతి తను వాళ్ళ దగ్గర కూర్చుంటేనే, అతను స్వరూపకి పాఠాలు చెబుతున్నాడు" తను అక్కడ వుండకపోతే? లోనికి వచ్చి, రహస్యంగా పొంచి చూసింది మనోజ్ దిక్కులు చూస్తున్నాడు" తడబడుతున్నాడు" దేవుడా! ఇదేం బాధ" తలపట్టుకొంది వైజయంతి తన పీక మీదికి, ఇంత ప్రేమేమిటి తనికి? అదేమిటో? తనకి మనసులో ఆ ప్రేమ భావనే వుదయించదేం? అసలీ ప్రేమే ఒట్టిదన్పిస్తుంది"

ప్రేమించుకున్నామని చెప్పుకుని, పెళ్ళయ్యాక తిట్టుకుని, కొట్టుకుంటున్న వాళ్ళని చూసింది తను! చంపుకొన్న వాళ్ళనీ చూసింది! ప్రేమ పేరుతో, కామం తీర్చుకొని, తర్వాత ఎవరికి వారు పెళ్ళిళ్ళు చేసుకున్న వాళ్ళని చూసింది! ఇలా ఎన్నెన్నో ఇన్సిడెంట్స్" అందువల్లనే కాబోలు! తనలో 'ప్రేమ' వుదయించదు కాబోలు అనుకొంది వైజయంతి

స్వరూప మనోజ్ మీద ఆశలు పెట్టుకుంటే, అవి పెరిగితే ఏది దారి??

ఆలోచనల మధ్య, కాలం ఆగటంలేదు 'దానికి' ఏ అనుభూతులతోనూ పనిలేదు! నడిచిపోవడమే కాలం లక్ష్యం"

# 6

చూశారా, మీరు?

అంటూ, ఆ రోజు ఒక దినపత్రిక మనోజ్ చేతికిచ్చింది వైజయంతి అతనది చూసి 'ఏంటి? ఏంటుంది?" అడిగి, ఆమె వేలు పెట్టి ఒక ప్రకటనని చూపితే, ఆత్రంగా ఒంగి ఆ ప్రకటనను చదివాడు

సౌదామిని పేరుగల ఒక అమ్మాయి, అమానుష పరిస్థితిలో రేప్ చేయబడింది నేరం ఆమెది కాకపోయినా, ఆమె పరిస్థితి దయనీయమైనది ఆమె పరిస్థితిని అర్థం చేసుకునే ఆదర్శ భావాలు గల పురుషుడు, వివాహం చేసుకోదలచిన వారు, ఈ దిగువ చిరునామాకు వచ్చి, సంప్రదించవచ్చును

చిరునామా ఇంకా చూడలేదు మనోజ్ అది చూడబోతూంటే, పేపరు తీసేసుకుంది వైజయంతి అతనూ అడ్రసు గురించి పట్టించుకోలేదు. "ఎవరో? ప్చ్! చాలా బాధగా వుంది! అన్నాడు

'ఎవరికి బాధ?"

'నాకు! చాలా బాధపడుతున్నానండి! ఎంత పనయిందండి! పాపం!

నిజంగా విచారిస్తున్నారా?

అదేంటి? అబద్ధంగా విచారిస్తారా ఎవరేనా?

చాలామంది!

'అదేమో! నేను మాత్రం నిజంగానే విచారిస్తున్నానండి!"

ఆ పిల్లని పెళ్ళి చేసుకొందుకి ఏ అబ్బాయేనా వెళతాడంటారా?"

మనోజ్ నోరు తెరిచేశాడు! వెళితే వెళ్ళచ్చు! దానికేముంది?" అన్నాడు

"మీ అభిప్రాయం ఏమిటి?

ఏమిటి? దేనికి? తడబడ్డాడు

'అదే! ఒకమ్మాయి ప్రకటన మీరూ చదివారు గదా? ఆదర్శ భావాలు, విశాల

# అక్షింతలు

హృదయమూ అంటారుగదా చాలామంది కవులూ, కళాకారులూ వాళ్ళూనూ? అవి మీకున్నాయా? ప్రేమించే మంచి రసహృదయం వున్నవారు మీరు! అలాంటి అమ్మాయిని చేపట్టలేరూ?

మనోజ్ వైజయంతిని కనురెప్పలార్పకుండా, చూశాడు తరువాత తల ఒంచుకున్నాడు

అగ్ని పరీక్ష యాసిడ్ టెస్ట్ అంటారు చూశారా" అలాంటివి నాకు పెడుతున్నారు మీరు? అన్నాడు, ముఖం ఆముదం తాగినట్టు పెట్టి

అవాళ, మరి చదువు సాగలేదు

మనోజ్ త్వరగా వెళ్ళిపోయాడు

వైజయంతి చేతిలోని పేపరు స్వరూప లాక్కుని చదివింది ఆమె వదనం ఎర్రబడింది

వ్వాట్"! అచ్చం ఇదే ఇన్సిడెంట్"! అనరిచింది ఇందాక అక్కా, మనోజ్ మాట్లాడుకుంటుంటే, ఏదో ఏదో అనుకుని, అంతగా పట్టించుకోలేదు లోపలికెళ్ళి కాఫీలు కలపడంలో మునిగింది తరువాతేదో అనుమానం వచ్చింది వాళ్ళ మాటలు తన గురించా" అనిపించింది మనోజ్ వెళ్ళాక పేపరు చూస్తే

అక్కా! ఈ ప్రకటన" అంటి తడబడుతూ అలా అంటూనే, ఆ దిగువన చిరునామా చదివింది అక్కా! అంటి ఆఁసరికా అమ్మాయి శరీరం వొణుకుతోంది

అవునే! భయపడుతున్నావా" అడిగింది వైజయంతి 'పేరు మార్చేను! న క్షేమం కోసం! అంటి తాపిగా

'అక్కా! చాలా పొరబాటు చేశావు' అంది స్వరూప కన్నీళ్ళతో

"ఏ పొరబాటు చేయలేదు! అంతా అన్నీ ఆలోచించే ఆ పని చేశానే!

ఇలా చేస్తే, ఈ జన్మకింక నాకు పెళ్ళి అవదక్కా!

'చా! వూర్కో!

అవునక్కా! ఇప్పటికే మన వూర్లో అందరికీ తెలిసిపోయింది! ఇక్కడా ప్రాకిపోయింది" ఈ ప్రకటనతో దేశం అంతా తెల్సిపోతుంది!

స్వరూ! నీకేం తెలియదూరుకో! చెడ్డకి పవరు ఎక్కువ! నీకు పెళ్ళయిందనుకో, వాళ్ళకేమి తెలియకుండా! రేపు ఎప్పుడైనా మన వూరెళ్ళకుండా వుండగలరా? మొన్న ఏమైంది? వాళ్ళు ఆ వూరెళ్ళలేదూ? ఎవరయినా కాకులు కూస్తారు" నాన్నావాళ్ళూ అక్కడున్నించి యిప్పుడు ఎక్కడికి పోతారో? నాన్న వుద్యోగమో? నీకోసం వుద్యోగం వదిలేస్తాడా? వదిలేస్తే ఎలా బతుకుతారో? ఏ ఆస్తి మీకు వెనుక? ఎన్నో ఆలోచించి నేనీ పని చేశాను! కాకపోతే, పేరు మార్చేను బొత్తిగా, మరి నిన్ను అవమానపరచటం యిష్టంలేకో ఎప్పుడయినా ఇలాంటిది తెలిసేదే" ఇప్పుడే, మొదటే తేల్చి చేసుకుంటే మంచిదిగద? తర్వాత రభస జరగదు

ఒక ఎక్స్‌పెరిమెంటు చేశాను! ఫలితం చూద్దాం వుండు! అంది వైజయంతి

స్వరూప ఇంక ఏమీ ఆ విషయం ఎత్తలేదు

మనోజ్ రాలేదు వారం గడిచింది

రాలేదే అంది స్వరూప

యాసిడ్ టెస్ట్ పెట్టానుట, అతనికి నేను! భయంతో చస్తున్నాడు! ఎలా వస్తాడు?

అవాళ, పారిజాతం ఆ పేపరు తీసుకువచ్చి, వైజయంతికిచ్చింది ఇదేంటమ్మా? మన అడ్రసుంది? నువ్వేనా ఇచ్చేవు! అనడిగింది

తలూపింది వైజయంతి

ఇదేం బాగాలేదమ్మా, వైజయంతి అందామె విసుగ్గాచూసి

వైజయంతి గుటకలు మింగింది

మీరు మీ స్వంత ఇంటిలో వుంటే, ఆ ఎడ్రసిచ్చుకుంటే అదేమో? ఇలా, మా ఇంటిలో అద్దెకి వుంటూ, మా అడ్రసు పేపరుకి, దేశం అంతా చదివే పేపరుకి అందులో ఇదేమయినా మంచి కబురా? ఇలాంటి కబురు ఇవ్వడం

ఏమండీ! అంటి! ఇది మంచి కబురేనండీ! ఓ అభాగ్యురాలిని ఓ సహృదయుడు, మీ ఇంటి అడ్రసుకి వచ్చి, చేపడితే ఆ పిల్ల బ్రతుకు బావుంటే, ఆ వచ్చుదనం తాలూకు ఆధిక్యత మీది కాదా, అంటి? మీరెంతో వున్నత హృదయులనుకున్నాను అంటి! మీరూ అందర్లా మాట్లాడారు"!

అది కాదమ్మా! నాకు ఆడపిల్లలు లేరు గనుక సరిపోయింది! వుంటే, ఈ ప్రకటనా, ఈ అడ్రసుతో, వాళ్ళకి పెళ్ళిళ్ళు అవుతాయా? మన ఆవేశాలూ, సహృదయాలూ అటుంచు అవి మన సంతృప్తికి గాని బ్రతకడానిక్కావు! మా ఒక్క అబ్బాయీ, దూరంగా జాబ్ చేస్తున్నాడు, వాడెప్పుడూ ఇటు రాడు కనుక సరిపోయింది! ఇక్కడే వాడుంటే, ఇలాంటి వాళ్ళకి ఇల్లెందుకిచ్చావమ్మా? అని, అడగడూ? నా పరిస్థితి నేను చెప్పాను! అని గబగబ తమ వాటాలోకి నడిచిందామె

ఒళ్ళంతా నీర్సం క్రమ్ముకు వచ్చేసింది వైజయంతికి తను ఎందుకు స్వరూపని తీసుకువచ్చిం దిక్కడికి? వాళ్ళ ఖర్మం ఏదో వాళ్ళే ఏడుద్చురని దాన్నక్కడే వుంచేయవలసిందేమో"!

ఇంటాయన వచ్చి, తమ బంధువులెవరో వారం దినాల్లో వస్తున్నారనీ, ఆ వాటా వాళ్ళకివ్వటం తప్పనిసరి అని, కనుక, మరో ఇల్లు వెతుక్కోవలసిందని చెప్పాడా రోజు!

అక్క, చెల్లి మొహాలు చూసుకొన్నారు

ఆఫీసు అయినాక, ఇళ్ళ వేటకి బయల్దేరింది వైజయంతి






# జీవితం చాలా అపురూపమైనది జీవించండి దర్జాగా

బ్రిల్‌క్రీమ్, మీ వ్యక్తిత్వానికి కొత్త అందం తెచ్చేందుకు ప్రత్యేకంగా తయారు చేయబడింది. జిడ్డుగా ఉండని ఈ క్రీమ్, మీ జుట్టుకి కొత్త రూపు సమకూర్చి రోజంతా పొందికగా ఉండేలా చేస్తుంది.




**బ్రిల్‌క్రీమ్ హెయిర్ డ్రెసింగ్ మీ జీవనశైలికి వన్నె తెస్తుంది.**

OBM/9856/Tel

# అక్షింతలు

"మీకు తెలిస్తే, అద్దెకి చిన్న ఇల్లు చెప్పండి!" అడిగింది అవాళ, ఆఫీసులో, టైపిస్టు అమ్మాయిని

ఆ మాట మనోజ్ విన్నాడు "అద్దె ఇల్లా? ఎవరికి?" అడిగాడు మాకే

"అదేం? వాళ్ళూ. ?

'అద్దె ఇల్లు శాశ్వతం ఎలా అవుతుందండి? ఎప్పటికయినా ఖాళీ చేయాల్సిందే కదా?'

"సర్లెండి! మీక్కావల్సిన చిన్న ఇల్లు కద? నేను చూస్తానులెండి!

"మనోజ్ వుండగా, దేనికి మీకు సమస్య లేదండి! అన్నాడో క్లర్కు నవ్వుతూ

"పాపం, అతని సమస్యే తీరదు గానీ " అందుకొన్నాడు యువకుడు, అత్యుత్సాహవంతుడూ అయిన చలం.

వైజయంతి గబగబ తన సీట్లోకెళ్ళిపోయింది

మనోజా! భగ్వాన్! అంతా భ్రాంతియేనా?

"యూ! షటప్!!" ముసలి క్లర్కు అరిచాడు

"హుఁ! నీకేం తెల్సూ నిమ్మకాయ పుల్సూ ' మెల్లిగా గొంతు తగ్గించి తన పన్లో పడ్డాడు చెలం.

రెండే రెండు రోజుల్లో, మనోజ్ ఇల్లు చూపించాడు, వైజయంతికి ఇల్లు బావుంది. నచ్చింది దిగిపోయేరు కాని, ఇప్పుడో సమస్య వచ్చింది వాళ్ళకి ఆ ప్రకటనలో ఆ అడ్రసు ఇచ్చారే?! తీరా మారిపోతే, ఎలా? వచ్చే మనిషి ఎట్లా వెతుక్కొని వస్తాడూ? అతనా యింటికెళితే? వాళ్ళేం చెప్పకపోతే?!

ప్లీజ్! అంటీ! ఇంతకాలమూ మమ్మల్ని మీరు ఆదరించారు! చాలా థాంక్సు! ఈ ఒక్క హెల్ప్ చేసి పెట్టండి! ఎవరయినా ఆ ప్రకటన ప్రకారం, ఇటు వస్తే, ఇదిగో, ఈ అడ్రసుకి వాళ్ళని పంపడేం? ప్లీజ్!" అని, ఓ చిన్న కాగితంపై కొత్త అడ్రసు వివరంగా వ్రాసి ఇచ్చింది వైజయంతి

"ఎంత మాటా! తప్పకుండానమ్మా!"

"థాంక్సండీ!"

మనోజ్ దగ్గర వుండి, ఆ అక్కా చెల్లెళ్ళు ఇల్లు మారటంలో చాలా సహాయం చేశాడు సామాన్లు రిక్షాలో మోసి పెట్టాడు అవి, ఆ ఇంట్లో సర్దాడు

చాలా థాంక్సండీ! చాలా సాయం చేశారు మాకు! మీ రుణం తీర్చుకోలేం!"

మేమంటే మీకు చాలా అభిమానం '

మనోజ్ బిడియపడ్డాడు

"నో! నో! అదేంటో! మీరంటే ఎప్పుడూ నాకదో ఎఫెక్షనండి! మిమ్మల్ని చూస్తే మీకోసం ఎంత పనయినా చేయాలన్పిస్తుంది! మీ సిస్టర్‌కి చదవంటారా? అదొక్కటే . ఎక్స్‌క్యూజ్‌మీ! నేను ఎక్కువే చదివాను గానీ టీచరు పనికి పనికిరానండీ! . అంచేతా "

"ఫర్వాలేదు లెండి!" అనేసింది వైజయంతి

## 7

"మనుషులు చాలా తెలివయిన వాళ్ళక్కా!" అంది స్వరూప "పారిజాతంగారు ఎంత మాట, తప్పకుండా" అంటూ నిర్మొహమాటంగా వెళ్ళిపొమ్మన్నారు! మనోజ్ ఏమో, సాయం చేస్తూనే, వుపకారం అపకారంగా భావిస్తున్నాడు!

'నువ్వు కూడా అందర్లాగే తయారవాలి!' లౌక్యం గడుసుతనం, చేసేపన్లో పట్టుదలా, కృషి నేర్చుకో!' అంది వైజయంతి

స్వరూప మళ్ళా పుస్తకాలు తీసింది. నిద్రని బలవంతాన నెడుతూనే, ద్వారం వైపు ఒక కన్ను వేస్తూంది అవాళ తలుపు చప్పుడయితే, వెళ్ళి తీసి, విస్తుపోయింది

అతను తనంతే ఎత్తున్నాడు! చెవుల్దగ్గర మాత్రం నాలుగేసి వెంట్రుకలున్నాయి నిలచి" దళసరి కళ్ళద్దాలు! నీలిరంగు టెర్లిన్ షర్టు,

తెల్లప్యాంటులో టక్ చేశాడు! తోలు చెప్పులు తొడిగాడు!

"పేపర్లో ఒక ఎడ్రాసిచ్చి రమ్మారు! అక్కడికి పోతేనేమో, ఆమెగారు ఇక్కడికి పొమ్మన్నారు! సరిగ్గా చెప్పు! ఈ ఇల్లేనా?

"సరిగ్గానే చెప్తున్నానండి! ఈ ఇల్లే "

"చూడమ్మాయ్! నా పేరు బజగోవిందం నేను బ్యాంకిలో ఆఫీసులో ఆఫీసరు చేసే, రిటైరయ్యేను! ఎన్నాళ్లని  ఈ మధ్యనేనూ! ఇంకా వెధవది! నెలకూడా కాలేదు ."

స్వరూప, అతని వెనుక దృష్టి సారించింది. మరెవరూ లేరు! మా అక్కయ్యగారింట్లో లేరండి! ఆఫీసుకి వెళ్లింది! సాయంత్రం వస్తారు '

"అయితే నన్ను అప్పుడే రమ్మంటావేంటి? చచ్చి చెడి ఎడ్రసులు పట్టుకుంటూ, ఎండలో పడి, ఇంత దూరమూ ఒస్తేనూ? నేను కూచుంటానులే! ఈ ఇంట్లో ఎవరెవరున్నారు?'

"మేం ఇద్దరమేనండి! అక్కా, నేనే వున్నాం!'

'ఇంతకూ పెళ్లివరికి? ఆమెకా? నీకా?'

స్వరూపకి చాలా యిబ్బందిగ వుంది 'ఏం చెప్పాలి?" అనుకొంది "నాకే అంది మెల్లగా

అతను స్వరూపని పైనించి కిందిదాకా చూశాడు ఆ చూపులు స్వరూపకి బాగుండలేదు 'అవి' భారతంలో దుశ్శాసనుడి చేతుల్లా వున్నాయి! తనబట్టలు ఒలిచేస్తున్నాడతను" స్వరూప కంగారు, భయం, దడతో అస్థిమితంగా అటు యిటు చూసింది

"ఓహో" అని నవ్వాడతను "నీకేనన్న మాట? ఎన్నేళ్లమ్మాయ్ నీకూ?'

"మా అక్కయ్యగారొచ్చేకా '

'నీ వయసు, మధ్య ఆవిడొచ్చేదాకా, ఎందుకూ దాచడం? ఏజెంతో చెప్పమన్నానా? మరేమైనా అన్నానా? అతను దాదాపుగ స్వరూపనితోసుకుంటూ, ఇంట్లోకివచ్చి, ఓ కుర్చీలాక్కుని, వుస్సూ! ఏం ఎండ! ఏం ఎండ! దాని మొహం మండ! చచ్చేననుకో! తిరిగి! తిరిగి! అదా యింకా చచ్చూరుకోవడం కాదుగానీ, నాకు బ్రతికుండి చావొచ్చి పడింది! యిన్ని మంచినీళ్లియ్యి అమ్మాయీ! అన్నాడు

స్వరూప ద్వారం దగ్గరే ఇంకా నించునుంది. అక్కడనించి అటు తలెత్తి చూసింది ఆ ఇంటి గలవాళ్ల అబ్బాయి అతనివైపే నిశితంగా చూస్తున్నాడు రెండు వాటాలుగ వున్న ఇల్లది ఒక వాటా అద్దెకిచ్చారు మరో వాటాలో ఆ ఇంటివాళ్ళు ఆ అబ్బాయీ, అతని చెల్లెలు వుంటూన్నారు! తామి ఇంట్లోకి వచ్చిందగ్గర్నించి గమనించుతోంది! అతను, ఆ అమ్మాయి ఇద్దరికిద్దరే వాళ్లకింకెవరూ పెద్దవాళ్ళున్నట్టులేరు! ఆ అమ్మాయిపేరు రజని ఎమ్మే చదువుతోంది! అతని పేరు డాక్టర్ నాగేష్ అని బోర్డున్నది తగిలించి" అంటే 'రేటు డాక్టర'న్నమాట! డాక్టరేటు పొందాడతను! ఈ వూరేకాదు, ఈ జిల్లా మొత్తమ్మీద నాగేష్‌పేరు పొందిన కవి అని తెల్సింది! యూనివర్సిటీలో అతను తెలుగు ప్రొఫెసరు! తరచుగా ఎవరెవరో ఆడామగా, అన్ని వయసుల వాళ్ళూ, డాక్టర్ నాగేష్‌కోసం, వస్తూంటారు! అదంతా చూసి ఆశ్చర్య పోయింది స్వరూప

అప్పుడప్పుడూ, నాగేష్, తీరుబడిగ వున్నప్పుడు, వీదిలోకి అలా చూస్తూ నించుంటాడు ఆ అన్నా చెల్లెళ్లకి ఇద్దరికి ఇంకా పెళ్ళిళ్ళు అయినట్టు లేదనుకొంది స్వరూప

నాగేష్ తమ వాటాలోంచి వచ్చాడివతలికి గబగబ స్వరూప వాళ్ళు వున్న వేపొచ్చి "ఏంటండి? ఎవరాయన? మీకు బాగా తెల్సినతనేనా? లేక ఏదయినా గొడవమనిషా? ఈ టవున్లో ఇలాంటివి ఎక్కువ! అందుకని అడుగుతున్నాను! లేడీసు ఇద్దరో, ఒకరో ఒంటరిగ వుండడం కనిపెట్టి, ఇలా చొరవచేసి ప్రవేశించడం! ఏదో అఘాయిత్యం చేయడం ' అన్నాడు ఆ మాటలతో స్వరూపకి గొంతు పొడారిపోయింది మాట పెగలడం కష్టం అయింది ఏం చెబుతుంది?' చచ్చింది తను" బాబోయ్! ఇతగాడు నిజంగా ఆ ప్రకటన చూసిన మనిషేనా? లేక, ఈయనన్నట్టు దొంగాడా?"

నిజంగా, ప్రకటన మనిషి అయితే మాత్రం? అతను మరి అంత మొండిగా ఇంట్లోకి దూసుకు రావడం ఏమిటి? ఆ అసలు విషయం నాగేష్‌కెలా చెప్పాలి,












# అక్షింతలు

తను? చచ్చిందే!! చెబితే, ఈ ఇంట్లోంచి వుద్వాసన!!. ..

స్వరూప భయాన్ని కనిపెట్టి, నాగేష్, త్వర త్వరగా అటునడిచి, భజగోవిందాన్ని సమీపించాడు

"ఏంటి, సార్? ఏంటి సంగతి? తమరెవరు? ఏ పనిమీదొచ్చారు?"

కొంచెం గట్టిగానే అడిగాడు.

'ముందర యిన్ని మంచినీళ్లియ్యండి! ఛస్తున్నాను వెధవది! ఎండలో పడి రావడం కాకుండా, వచ్చిన వాడికి దాహం ఏదో యివ్వకుండా, ఇలా నిలదియ్యడం ఏమిటి? అన్నాడు బజగోవిందం రుసరుస లాడిపోతూ

మేం ఈ ఇల్లు గలవాళ్లం! ఆ పిల్ల ఒక్కతే వాళ్లవాటాలో వుంది! మీరు అట్లా ఆ పిల్లని దూసుకుని, లోపలికి ప్రవేశించటం చాలా తప్పండి!'

"ఓహో అదొటా? ఎండలో రావడం కాకుండానూ, నాకూ? ఏం నేనేం అంతలుచ్చా మనిషిననుకుంటున్నావేవిటి? నేను బ్యాంకి ఆఫీసరుచేసే రిటైరయ్యేను తెల్సా?"

"మీరు కలక్టరయినా, గవర్నరయినా సరే, మీరు ప్రవర్తించే తీరు అదికాదు!! కొంచెం మర్యాదా చూపాలి!!"

"ఏవిటయ్యా, నీ దబాయింపూ? వాళ్ళు పేపర్లో ప్రకటిస్తే, నేనది చూసే, ఎండలో పడి ఒచ్చేను! తెల్సా? ఏం సరదాకి రాలేదు! దొంగతనానికి రాలేదు!"

"ప్రకటనా?"

స్వరూపకి శరీరం అంతా చెమటతో ముద్దయింది. దేవుడా! ఇప్పుడెలా? వేగిరం అక్క ఒచ్చేస్తే బావుణ్ను' అనుకుంటోంది

"ఆ ప్రకటనే! ఇదిగో! కావలిస్తే చూడు!" అంటూ, బజగోవిందం, చొక్కాజేబులోంచి, ఆ ప్రకటన తాలూకు పేపర్‌కటింగ్ తీసి ఇచ్చాడు నాగేష్ చదివి, ఆశ్చర్యంతో స్వరూపని చూశాడు. "మీ పేరేమిటి?" అడిగాడు

'అదిగో! అదే ..." తడబడుతూ, పేపరులోకి వ్రేలుపెట్టి చూపించింది స్వరూప

నాగేష్ మొహం కొంచెం ఎర్రబడింది "ప్చ్!" అన్నాడు నిట్టూర్చి. 'అయితే, మీరందుకోసం ఒచ్చేరా, సార్?" అడిగాడు భజగోవిందాన్ని, నిలువునా చూస్తూ

"వూఁ.. చచ్చి చెడి.. ఎండలో ...."

"ఎందుకండీ? అంత ప్రయాస పడడడం? ఈ వయసులో? పాపం?"

"చాల్లేవయ్యా! నేనేం ముసలి-ముదివగ్గునా? ఏదీ? వెధవది? ఇంకా నెలవలేదూ, రిటైరయ్యీ!" అని చెబుతుంటే, వైజయంతి వచ్చేసింది స్వరూప గుండె కొంచెం కుదుట పడింది, అప్పటికి

'ఎక్స్‌క్యూజ్ మేడమ్! ఈయన మీ చెల్లాయిగారు చెప్తుంటే, అసభ్యంగా ఇంట్లోకి చొరవచేసి వెళ్తుంటే, నేనది చూసే ఇటొచ్చాను! నా పనయిపోయింది! వెళతాను... అన్నాడు నాగేష్ "ప్లీజ్! కాస్సేపు వుండండీ ! . అని చెబుతూ, వైజయంతి ఇంట్లోకి నాగేష్‌ని రమ్మంది.

"మీరు పెద్ద కవులు! లోకం రీతి మీకు తెలీనిదేముంటుంది? సరసతా, సహృదయతా చేరని చోటికి కవిత ప్రవేశించదని విన్నాను! ఆ ప్రకటన కాయితం మీ చేతిలో వున్నది.... అది మేమే ఇచ్చాము! మీకంతా ఈసరికి అవగతం అయినదనుకుంటాను .. మీ అమూల్యమైన కాలం వృధా అవుతుందంటే, మరోమారు మీతో పూర్తిగా మా సొద చెప్పుకుంటాను! లేకపోతే, కాస్సేపు వుండండి! ప్లీజ్!. .." అంది.

నాగేష్ చిరునవ్వుతో కుర్చీలో కూచున్నాడు

"ఎవరమ్మాయ్, నువ్వూ? నువ్వేనా పెళ్లికూతురికి అక్కగారివి?' అడిగాడు భజగోవిందం

ఆ మాటకి నవ్వొచ్చింది అక్క చెల్లెళ్లకి

గొంతెండిపోయి ఛస్తున్నాను! మంచినీళ్లియ్యమ్మా!' గబగబా వెళ్లి, ఒక చెంబుతో నీళ్ళు తెచ్చి ఇచ్చింది వైజయంతి

"ఈయనేనా, పెళ్లికొడుకుగారు?' అన్నాడు నాగేష్ నవ్వుతూ, వైజయంతిని, "ఏమో?" అంది.

"ఏమో ఏవిటి? నేనే! మరెందుకొచ్చాను? ఎండలో ..."

"ప్లీజ్! ఎండవూసు మరివద్దుగాని. . చెప్పండి?" అన్నాడు నాగేష్ 'మీకు మారేజ్ లేటా?" అడిగింది వైజయంతి, 'ఇంకా పెళ్లవలేదా?' అనడిగితే, బావుండదని.

"బావుంది! ఎందుకవదూ? మగాడికవదా? చచ్చినట్టెవరో ఒకరిస్తారు పిల్లని! పెళ్లవడం, ఆవిడగారు, ఏడాది తిరక్కుండానే హరిమనడం అన్నీ అయిపోయాయి!"

"పిల్లలు?"

"లేరు ."

"వాళ్లకోసమా, ఇంతెండలో పడి వచ్చేరు?

నాగేష్ మాటకి, అక్క చెల్లెళ్లకి నవ్వాగలేదు అయినా బలవంతానాపుకున్నారు

'అయితే, అప్పట్నుంచి, మళ్లా ప్రయత్నం చేయలేదా, మీరు? అడిగింది వైజయంతి.

'ఏమిటమ్మాయ్? అసలు, నేను మిమ్మల్ని అడగాల్సిందిపోయి, నన్ను మీరడుగుతున్నారేవిటి రకరకాలు ప్రశ్నలూ? మగాడికి ఆడదేదొరకదా? నేనా వూసెత్తుకోలేదంతే! నాకు దీనజనవుద్ధరణా, మహిళాభ్యుదయం అంటే మక్కువవుంది! మా వూర్లో అలాంటి సంస్థలు రెండింటికి నేనే ప్రెసిడెంట్ని! తెల్సా?'

ఏది? ఇప్పుడే తెలుస్తోంది

# అక్షింతలు

'ఆఁ అందుకే, పేపర్లో మి ప్రకటనన్చూసి ఒచ్చేను' ఈ విధంగా సమాజానికి నా సేవ నిరూపించుదామనీ . '

వైజయంతి నిట్టూర్చింది చెల్లెల్ని చూసింది భజగోవిందాన్ని చూసింది గుండె కెలికినట్లయింది

'బ్యాంకులో చేసే, రిటైరయ్యేరా?'

"ఆఁ మాకు సొంత ఇల్లుంది'

కాస్సేపు నిశ్శబ్దం

అతను మళ్లా స్వరూపని దుశ్శాసనుళ్లా చూశాడు' ఆడవాళ్లిద్దరు చాలా సిగ్గు పడిపోసాగారు నాగేష్ అసహ్యించుకున్నాడతన్ని

'నాకు, దేనికీ లోటులేదు . డబ్బుకిగానీ యింటికిగానీ

'ఒక్క సౌభాగ్యానికేతప్ప "

ఆయన, నాగేష్‌ని మింగేలా చూశాడు

నాకు నచ్చిందమ్మాయ్, మి పిల్ల!"

'సారి అండీ!" అంది వైజయంతి

"ఈ అమ్మాయికిలాంటి వరుడొస్తాడని అనుకొంటే, అసలా ప్రకటనే ఇవ్వం!!"

'ఓహో ఓహో అదోటా ఇంకానూ? నేనింకా విశాల హృదయంతో అంతదూరం ఎండలో చచ్చి ఒచ్చేను' అసలెవరొస్తారు చెడిపోయిదానికి?

"షటప్! గెటవుట్!!"

నాగేష్ అరిచాడు ఆగ్రహంతో భజగోవిందం వెళ్లిపోయిందాకా వెనకే వెళ్లి, గేటువేసి వచ్చాడు లోనికి

## 8

ఆ రోజు – నాగేష్ వాళ్లింట్లో, వాళ్ల మధ్య గదిలో, అటువైపు సోఫాలో, నాగేష్ అతని చెల్లెలు రజనీ, ఇటువైపు మరొక సోఫాలో వైజయంతి, స్వరూప కూర్చుని వున్నారు తమ ఇంటికి 'టీ'కి రమ్మని ఆహ్వానించాడు నాగేష్ టీ అని పిల్చారు టిఫిన్‌తో సహా కాఫీలు కూడా అందించారు' అంది వైజయంతి తమ ముందు బల్లమీద వుంచబడిన ఖాళీ ప్లేట్లు, ఖాళీ కప్పుల్ని చూస్తూ.

అన్నా చెల్లెళ్లు చిరునవ్వుతో చూశారు

"మితో కాస్సేపు మాకష్టం, సుఖం చెప్పుకొందామనీ . పిల్చేను..." అన్నాడు నాగేష్

యింత ఫ్రీగా మాట్లాడే మనుషులు ఎలా దొరుకుతారు ? చెప్పండి? అన్నది వైజయంతి

నాగేష్ వీధిద్వారంకేసి చూస్తూ అన్నాడు –

'మా సిస్టర్ గురించి మికు చెబితే, మిరాశ్చర్యపోతారెంతో' ఈ అమ్మాయి మిద అంటే, నాకంటే పెద్దది, మా అక్క యశోద అని వుండేది ఆమెకి పద్దెనిమిదో యేటే పెళ్లి చేశారు మా ఫాదర్. ఆ తర్వాత ఆయన మరణించేరు యశోద వివాహం, దాని జీవితం ఒక ట్రాజెడీ అనుకోండి! మా బావగారికిలేని దుర్గుణం అంటూ లేదని, ఆ పెళ్లయింతరువాత తెల్సింది మాకు' మొదట అతని గురించీ మధ్యవర్తి మంచే చెప్తే, నిజమే కాబోలని ఇచ్చేం పిల్లని. అతను పెద్ద రౌడిస్టు! అక్కని చిత్రహింసలు పెట్టేడు' యమలోకంలో కూడా అన్ని బాధల్ను పెట్టరేమో?' అతని దుర్మార్గానికది బలయిపోయింది' ఓ అర్ధరాత్రివేళ యశోదని, అతను నిలువునా కాల్చివేసాడు' మాక్కబురు తెల్సేసరికి, మేం బూడిద కూడా చూడలేదంటే మిరు నమ్ముతారా?

అన్నా చెల్లెళ్ల కళ్లల్లో నీళ్లని చూసి, వైజయంతి గుండె విలవిల్లాడింది

'అప్పట్నించి, మా చెల్లాయి రజనికి పెళ్లిఅన్నా, ఆ తంతు అన్నా భయమూ, అసహ్యమూ కూడా పట్టుకున్నాయి మగవాడంటేనే రజనికి అసహ్యం' అఫ్‌కోర్స్ . ఈ అన్నయ్య మగాడే అనుకోండి "

'అంతా నీలాగ వుంటారా? వుండరు. నాకా నమ్మకంలేదు" అంది రజని.

కాస్సేపు నిశ్శబ్దం వారిమధ్య బరువుగా నిలిచింది

మిరు?' అడిగింది వైజయంతి "మికూ వివాహం మిద వ్యామోహం

పోయిందా?

అలా అని కాదుగానీ   నాక్కొన్ని నిర్ణయాలు వున్నాయి  నన్ను పెళ్లి చేసుకునే అమ్మాయి, అన్ని రకాలుగా మాతో అడ్జెస్ట్ అయిపోవాలి! అంటే మా చెల్లాయి సామిప్యాన్ని, సాంగత్యాన్ని నిండు హృదయంతో స్వీకరిచాలి" వాళ్ల మధ్య ఏ విధమయిన అపార్థాలు, కలతలు రేపు ఏర్పడకూడదు! నాకొసం సంబంధం వస్తే, వాళ్లకి ఈ విషయం నేను చెపుతూ వస్తున్నాను  నమ్మండి! ఇప్పటికి ఆరుగురంటే ఆరుగురు వెనక్కెళ్లి పోయారు! వాళ్లకి ఒక్క అబ్బాయే కావాలిట! అతని చెల్లెలి పొరుగుని యిష్టపడరట! ఇది లోకం"

ఇదే మా కదండీ! అసలు ఇదంతా మికు చెప్పకపోదుననుకొండి! ఏదో, మనకి అనుకొకుండా స్నేహం ఏర్పడింది! మరొకటేమిటంటే, మి చెల్లాయిగారి కథ తెలిశాక, మా గుండెకాయలు ఎండిపోయాయి  ఆడదాని సమస్యలు ఎన్నెన్ని రకాలో? అన్పించింది

ఆ రాస్కెల్స్ కొసం మిరు గట్టిగా ప్రయత్నించాల్సిందండీ! వాళ్ల నెట్లా గయినా పట్టుకొని, తగిన శిక్ష విధించాలి!  అంది రజని  ఆమె కళ్లు ఆగ్రహంతో శివుడి మూడో కన్నులా మండిపడుతున్నవి"

దినితో  మేం ఎన్ని గొడవల్ని ఎదుర్కొంటున్నామో, మికు తెలీదు! రేప్ చేయబడిన ఆడపిల్ల భవిష్యత్తు చాలా నరకం అండీ! దానికి ఎక్కడా యింత సానుభూతి కూడా దొరకలేదు! ఒక బిచ్చగాడికి దొరికే సానుభూతి కూడా, దానిక లభ్యం అవదు! మొన్న వచ్చిన ఆయన మాటలు విన్నారుగదూ?

చాలాసేపు కూర్చుని, వైజయంతి చెల్లెలితో తమ ఇంట్లోకి వచ్చేసింది

అవాళ, చీకటి పడ్తొంటే, ఎవరో ఒకతనొచ్చాడు వైజయంతి ఇంటికి

ఎవరండీ?

ఈ అడ్రసు మిదేకదూ?  అంటూ చిన్న కాయితం ఇచ్చాడతను  చదివింది వైజయంతి  తరువాత అతన్ని చూసింది  యితను ఫర్వాలేదు అనుకుంది  బాగా నలుపుగా వున్నాడు గాని, పొడవుగ, మాంచి జబర్దస్తీగా, పర్సనాల్టీ బావుంది వయసులొనే వున్నట్టున్నాడు

ఆఁ   ఇదే అడ్రసు

లోనికి రమ్మని, కుర్చీ చూపిస్తే, అతను కూర్చుని, చుట్టూ పరికిస్తూ, ఎవరండీ?   'అని ఆగిపోయాడు  అతని ఆరాటం గ్రహించి, చెల్లెల్ని పిల్చింది వైజయంతి  స్వరూప వచ్చి, గభాల్న ఆగిపోయింది

చెప్పండి?  అన్నాడతను స్వరూపని చూసి  ఆ చూపులు అంత వికారంగా అన్పించలేదు అక్క చెల్లెళ్ళకి

"చెప్పండి?  అంది వైజయంతి

మిరిచ్చిన విషయం చదివానండీ! నాకు సమ్మతమే   కాకపోతే ఒక్క మాట చెప్పాలి!"

చెప్పండి?

"ఏంలేదూ   నాకు చదువుకి, వుద్యోగం సంపాయించడానికి లంచానికి వాటికి, ఇప్పటికి చాలా డబ్బయిందండీ! మిరు కనీసం ఒక నలభయి వేలయినా యిస్తే   నాకు ఏవిధమైన అభ్యంతరమూ లేదు! అ(లడీ"

నలభయి వేలిస్తే, మిరు విశాలహృదయాన్ని ఈ వివాహం ద్వారా నిరూపించుకొంటారన్న మాట? కదూ?

"ఆఁ   అట్లా గట్టిగా అనకండి! ఎవరయినా వింటే బాగుండదు! మనం మనం ఒక మాటకి రావడం మనకి ముఖ్యం! మి సిస్టర్‌కి పెళ్ళి కావాలి! నాకు ఓన్లీ ఫార్టీ తవుజెండ్ కావాలి! అంతే! ఇది అందరికీ అనవసరం!"

వైజయంతి, స్వరూప ముఖాలు చూచుకున్నారు  నలభయి వేలు"? ఒక వందా.. ఒకవెయ్యో కాదు" ఎక్కడనించి తీసుకు వస్తారు?? ఎవరిస్తారు??

వైజయంతి అతన్ని కూర్చొని వుండమని చెప్పి, పక్కనించీ తిరిగివెళ్ళి, నాగేష్‌ని పిల్చుకు వచ్చింది

"నలభయి వేలు కావాలండీ! ప్లీజ్! నలభయి వేలు సాయం చేయగల్రా? మా చెల్లాయి పెళ్ళయిపోతుంది!" అంది అర్థింపుగా

ఈయనెవరు?" అడిగాడతను కొంచెం తొట్రుపాటుతో  ' వీళ్ళ నైబర్ని! ఒక ఆడపిల్ల జీవితాన్ని మిరు వుద్ధరిస్తారా, నలభయి వేలు లంచంగా తీస్కుని? ఇదేం న్యాయంసార్? కొంచెం పట్టూ విడుపూ వుండాలి దేనికైనా? అంతలంచం అన్యాయం" మిరావిడని పోషించే డబ్బుకంటే, ఆవిడ మికు చేసేవే చాలా ఎక్కువ" మికు వంట వండాలి! యింటి పన్లు చేయాలి! మి ఎల్లలికి చాకరి! ఎంతకష్టం?

'నాకుమాత్రం అవన్నీ తెలియవూ? మిరేం చెప్పనక్కర్లేదు! నా గొడవ నేను చెప్పుకున్నాను! మికిష్టం అయితే ఇవ్వండి! లేకపోతే లేదు   పోతాను

మిరేం అనుకొకపోతే   ఒకమాట  అన్నాడు నాగేష్

ఏంటి?

'పేపర్లో ఒక అనవున్స్‌మెంటివ్వండి! ఇలా, నాకు ఎవరయితే నలబయి వేల రూపాయలు కట్నం ఇవ్వగలరో, ఆపిల్ల రేప్ చేయబడినా సరే, నేను స్వీకరిస్తానూ' అని   ఏం?

యూ! యూ"   పళ్ళు కొరుకుతూ, అతను దిగ్గున లేచి, వెళ్ళిపోయాడు


మూషిక వాహన దీరగణేశ
చిత్రకారుడు : బి. వెంకటేశ్వరరావు (విజయవాడ)

"నేనేం తప్పుగా అనలేదుకద?  అన్నాడు నాగేష్, వైజయంతితో

ఏం లేదు  బాగా చెప్పారు

అటుచూసి అతను షాక్‌తిన్నట్టయ్యాడు

స్వరూప ఏడుస్తోంది

# 9

స్వరూప ఒక నిశ్చయం గట్టిగా చేసుకొంది

పుస్తకాలు వదలడం లేదిప్పుడు.

మూడు సంవత్సరాలు గడిచిపోయాయి

స్వరూప డిగ్రీ చదువుతోంది ప్రయివేటుగా

మరోప్రక్కన, టైపు, షార్ట్‌హాండ్ నేర్చుకుంది  టైపు, షార్ట్‌హాండు లోవర్ పాసయింది

వైజయంతి,  వాళ్ళాఫీసులో  స్వరూపకి  జాబ్‌కోసం  తీవ్రంగా

# అక్షింతలు

ప్రయత్నిస్తోంది

వాళ్ళిద్దరూ వచ్చేరు వెళ్ళారు స్వరూప గురించి యిచ్చిన ఆ ప్రకటనకి జవాబుగ, అప్పుడు!

మళ్ళా మరెవ్వరూ రాలేదు

వస్తారని ఆశించలేదు వైజయంతి, స్వరూప రోజులు తిరిగిపోతున్నాయి వాటికెవరి సమస్యలు అక్కర్లేదు

అదే ఇంటిలో వున్నారు వైజయంతి, స్వరూప

ఈ మూడు సంవత్సరాల్లో చెప్పదగిన విశేషాలేమి జరగలేదు పెదనాన్న, పెద్దమ్మ రెండు తడవలు వచ్చి, పిల్లల్ని చూసి, వెళ్ళారు మునుపటి విచారం వాళ్ళలో అంతర్గతంగా మాత్రం వున్నాది పైకి నిబ్బరంగానే వున్నారు "ఎలాగూ పెళ్ళిళ్ళయ్యే యోగాలు లేవు, మీ ఇద్దరికీను! అదలాగా! ఇదలాగా!! పోనీ చదూకానీ, ఏదో వుద్యోగం ఒకటి చూస్కుని, నీ బతుకేనా నువ్వు బతకవే!"అని చెప్పింది, కూతురికావిడ

'జీవితానికి పెళ్ళే పరమార్థంకాదు, పెద్దమ్మా! అదో అవసరం మాత్రమే! ఆ అవసరం తీరడానికి అడ్డంకులు వస్తే ఏంచేస్తాం? లైఫ్‌ని ఒక ఛాలెంజ్‌గా తీస్కోవాలి!!" అంది వైజయంతి

"నీకేమైంది? పెళ్ళి చేసుకోందికి?"

దానికవకుండా, నేను చేసుకోను!

నిట్టూర్పులతో, పెద్ద వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు

వైజయంతి మనసులో ఒక మూలన కదులుతూంది, ఆమాట, కాని బైటికి రాలేకుండా వుంది, ఇంతకాలంగానూ ఆ గుంజాటనతోనే సతమతమవు-తోందామె

ఎలా అడగడం? ఎలా అడగడం?

అడిగితే, అతను ఏమనుకొంటాడు?

అన్ని కబుర్లు చెప్పిన వాడు? అంత విశాల హృదయం ప్రకటించిన మనిషి?

నాలుగుసార్లు అతను తమ ఇంటికి వచ్చినపుడు తాము వారింటికి వెళ్ళినపుడు, చెపుదామని విశ్వప్రయత్నం చేసింది

అక్క ఆరాటం స్వరూప గ్రహించింది ఎప్పుడో! కాని ఆవిషయం మీద ఇంక తను నోరుఎత్తడం, ఆ అమ్మాయికి అంతగా మనస్కరించలేదు పోతే పోనియ్యి! వెధవదిక్కుమాలిన పెళ్ళి!! ఏం నీలుగుతున్నారీ మగాళ్ళూ? తను, ఒక స్టేజిలో, తనని అఘాయిత్యం చేసిన వాళ్ళే దుష్టులూ, నీచులయిన పురుషులు అనుకొంది వాళ్ళు కాకుండా, ఇంకా కొందరు మంచి మగవాళ్ళుంటారనుకొంది కాని కాని మొత్తం పురుషులు తొంభయి తొమ్మిది పర్సెంట్ .. చాలా రకాలుగ, అనేక విధాలా దొంగలూ, కపటులూ, దగాకోరులూ, స్వార్థపరులూ, దురాశాపరులూ, నీచులని తెల్సుకొంది!!




యుద్ధరంగంలో అర్జునుడికి, శ్రీకృష్ణుడి ద్వారా గీతాపరమార్థం వెల్లడి అయినట్టూ, తనకీ పరిస్థితుల ద్వారా, కొంత సమయంతో, "జ్ఞానం వచ్చింది!!

"అక్కా! నేను థర్డ్ హయ్యర్ పాసయ్యాను!' అని చెప్పిందవాళ స్వరూప

వెంటనే యింత పంచదార తీసుకువచ్చి, చెల్లెలినోటిలో పోసేసింది వైజయంతి

మనోజ్ ఆరోజు వచ్చాడు అతను ప్రతీవారం వస్తున్నాడు వైజయంతి క్షేమ సమాచారాలు కనుక్కొంటూనే వున్నాడు

ఒకమారు అతను చాల హడావుడిగా వచ్చి, ఏమండోయ్ 'వైజయంతిగారు! మీకోవార్త చెప్పాలి!" అన్నాడు.

ఏదో అర్జెంటు కబురా? ఎవరయినా ప్రముఖులు పరమపదించేరా? యుద్ధం వస్తోందా? అనుకొంది వైజయంతి

"ఏమిటయిందో చెప్పేయండి? కబురు తీసుకు వచ్చిన వాళ్ళు మీరే?" అంది నవ్వుతూ

"నిన్న మాయింటికి పెళ్ళివారొచ్చేరండి! నన్ను, మా అమ్మగార్ని, మా ఫాదర్ని వాళ్ళింటికి తీసుకు వెళ్ళేరు అమ్మాయిని చూపించేరు '

"నచ్చేరా?"

"ఎవరికి? ఆవిడకు నేనా? నాకావిడా?"

నవ్వేస్తూ, "ఇద్దరూ ఇద్దరికీ అంది వైజయంతి మనోజ్ కొంచెం సీరియస్‌గ మొహంపెట్టాడు.

"అయితే కుదిరినట్టేనా?

"వుఁహుఁ "

'ఏం?"

'వాళ్ళ బలవంతంమ్మీద వెళ్ళాను చూసేనంతే నాకసలు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకొనే వుద్దేశమే కలగలేదు . '

'ఓహో! బావుంది! కాఫీ టిఫిన్లు కొట్టేసి వచ్చేసేరా? కబుర్లానూ? ఇలాంటి పెళ్ళికొడుకు లెంతమందో?"

మనోజ్ యిబ్బందిగ నవ్వాడు

'వైజయంతిగారూ నేను మావాళ్ళకి ఖచ్చితంగా చెప్పేశాను

"ఏమిటి?

నా మనసులో ఒకే ఒక అమ్మాయి నిలచివుంది! మరోపిల్లకి స్థానం లేదూ! నాకు పెళ్ళి సంబంధాలేమి తీసుకురాకండి! 'అని చెప్పేశాను .

వైజయంతి మౌనంగా వుండిపోయింది

కాస్సేపు కూర్చుని, స్వరూపకి థర్డ్ హయ్యర్ ప్యాసయినందుకు కంగ్రాట్స్ చెప్పి, వెళ్ళి పోయాడు మనోజ్.

వైజయంతి అవాళ నాగేష్ వాళ్ళింటికి వెళ్ళింది రజని సంతోషంతో , "రండి! రండి! మాకు వుబుసుపోవటంలేదు! ఎవరొస్తారా? హస్కు వేద్దామా? అని చూస్తున్నాం! ఇవాళ మా అన్నయ్య ఫ్రెండ్సు, ఫాన్స్ కూడా ఎవరూ రాలా! మీదే మొదటి దర్శనం! . 'అంది

కాస్సేపు మాటలు నాగేష్ కవిత్వం గురించి, నడిచాయి వైజయంతికి కవిత్వం మీద అంతగా కుతూహలం లేదు వింటే ఆనందిస్తుంది. అదయినా విన్నంతసేపే ఆ తరువాత అదేమిటో మరిచిపోతుంది ఒకసారి వీరాజీగారి విడివిడని చిక్కులు" నవల చదివింది చాలా బావుందానవల అనుకొంది గోపీచంద్‌గారి "అసమర్థుడి జీవయాత్ర,"ఇంకా, "చీకటి గదులు" చదివింది కొడవటి గంటి వారి "చదువు' 'అనుభవం" అనే పుస్తకాలు చదివింది రాచకొండవారి అల్పజీవి" చదివి నవ్వుకొంది అందులో వారి రచనా చమత్కారం ఆమెని తెగనవ్వించింది ఇదంతా నవలలు చదివిన అనుభవం ఆమెకి. కథా, నవలా వేరు! కవిత్వం, గేయం వేరు!! అది వ్యాకరణం, ఛందస్సులతో కూడిన అల్లికో అమరికో!! కవిత్వాన్ని ఆస్వాదించ గలిగే హృదయము, ఆ ఆసక్తి తనకంతగా లేవు! మరేమో ఈయన ఈ నాగేష్‌గారేమో పెద్ద కవిగారు!!

ఆ రోజు నాగేష్, రజనీ కవిత్వం గురించి మాట్లాడారు నాగేష్ వ్రాసిన కవితా కదంబం' , ఆ పుస్తకం టేబిలుమిదున్నది! అది పేజీలు త్రిప్పుతూ

వచ్చేసిందిక! భారతదేశపు మొట్టమొదటి
'మాయిశ్చర్ బ్యాలన్స్‌డ్' సబ్బు

# క్లియర్-టోన్
## చర్మ సంరక్షణ సబ్బు

అరచెట్టకుండా శుభ్రపరుస్తుంది. జిడ్డులేకుండా మృదువుగా చేస్తుంది



దీనికేగల ప్రత్యేకమైన ఫ్రెంచి సుగంధంతో




క్లియర్-టోన్ సబ్బులో ప్రత్యేకమైన పదార్థాలున్నాయి— అవి శాస్త్రీయంగా సరిసమానమైన తీరులో వున్నాయి. అవి మీ చర్మంలోకి చొచ్చుకుపోయి శుభ్రపరచి. దాంతోటే మీ చర్మాన్ని మృదువు పరచడం కోసం క్లియర్-టోన్‌లో గల పేరెన్నికగన్న "మాయిశ్చరైజర్" ముఖ్యమైన ద్రవ పదార్థాలతో మీ చర్మానికి పోషణనిస్తూంటే. మరి దీనిలో గల సౌందర్యం పెంచే నూనె మీ చర్మాన్ని శుభ్రపరుస్తూ, నున్నబరుస్తుంది. క్లియర్-టోన్‌తో కడుక్కోవడంతో మీ చర్మానికి హిమ బిందువు లాంటి తాజాదనపు స్వచ్ఛత. నిజంగా వుండే ఆ లక్షణమూ వస్తుంది—పొడిపొడిగా. జిడ్డుగా వేలా కాదు. మరి దాంతోటే క్లియర్-టోన్ సబ్బుకే ప్రత్యేకంగా గల, ఆంటిసెప్టిక్ నిండిన ఫ్రెంచి సుగంధం కూడాను. క్లియర్-టోన్ సబ్బు. దీంతో యిక మీ చర్మం మరింత తాజాగా, మృదువుగా, ఆరోగ్యవంతంగా రూపొందుతుంది.

## క్లియర్-టోన్
చర్మ సంరక్షణ సబ్బు
లండన్ • పారిస్ • న్యూయార్క్

# మొదలెట్టండి యివాళే- 6 వారాల్లో చూడండిక-

వంటిఛాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్-టోన్

మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**



కోమలమైన చర్మం కేవలం మూడు రోజుల్లో!

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి... అబ్బ ఎంత హాయి!

**3వ వారం**



చూసావా, మోచేతులు నిగనిగలాడుతున్నాయి అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి ఛాయవచ్చి మెరుస్తోంది. అంది ఓ మిత్రురాలు.

**5వ వారం**



ఎండలోకెళ్ళినా, వాడదిక చర్మం.

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్-టోన్ బృందంలో!

క్లియర్-టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ. మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన ఛాయతో రూపొందిస్తుంది. సున్నితంగా. అంతేకాదు. క్లియర్-టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం. అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది. దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ ఛాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ మృదుత్వాన్నీ యిస్తుంది.

ఇదంతా కేవలం 6 వారాల్లో!

చక్కని ఆ ఫలితాలు అలాగే వుండటానికోసం క్లియర్-టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి. యింట్లోనూ ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను.




## క్లియర్-టోన్
లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha/CLS/14/85/TEL

# అక్షింతలు

కూర్చుంది వైజయంతి. "చమాతారా? ఇంట్రిస్టుంటే తీసుకెళ్ళండి" అన్నాడు నాగేష్ నవ్వుతూ.

'చచ్చేను' అనుకొంది వైజయంతి.

ఆతరువాత నాగేష్ ఆమె యిబ్బందిని కనిబెట్టి, మాటమార్చేశాడు.

"చెప్పండి? ఏమిట విషయాలు? విశేషాలు?"

"చాలారోజుల్నించి ఒక మాట మిమ్మల్ని అడగాలనుకొంటున్నానండి" అన్నది వైజయంతి, లోపల ఇబ్బందిగా వున్నా, పైకి నిబ్బరంతో.

"అరెరే! మీకా మొహమాటం దేనికండి? అడగవచ్చుగా? చాలా రోజుల నించి వెనక వేస్తున్నారా? ఇంత కాలంనించీ మమ్మల్ని చూస్తున్నారా? మేం అంత యిబ్బంది కరమైన మనుషుల్లాగా కనిపించేమా?"

"లేదండీ..... లేదులేదు....." అంది వైజయంతి సిగ్గుగా నవ్వేస్తూ.

"అదే.... మా ....సిస్టర్ గురించి.... మి అభిప్రాయం....."

నాగేష్ చిత్రంగా చూశాడు. ఆమె వాలకం గమనించాడు. పరిశీలన అతని మెదడుకి పదును పెట్టింది. మనసు వేగాన్నందుకొంది.

"మా స్వరూపని..... మీరు....." మాటలు ఆతరువాత మింగేసింది వైజయంతి.

కాస్సేపు నిశ్శబ్దం.

రజని అన్నయ్య వేపు చూసింది.

"మీరు చెప్పకేంగానీ.... నాకూ ఆ వుద్దేశం వుంది.... వైజయంతిగారు!" అన్నది రజని.

"కాని..... ఇది వాడి స్వంత సమస్య. వాడి వ్యవహారంలో నేను కలుగజేసుకోవడం ఇష్టం లేక వూరుకొన్నాను....."అంది.

"మీ విశాలహృదయానికి , నా జోహార్లు" అంది వైజయంతి. "నేను సాటి ఆడదాన్నండీ" అంది రజని.

"కావచ్చు! ఆడదానికి మొదటి శత్రువు సాటి ఆడదే! మీకు తెలుసా?" అన్నాడు నాగేష్. "నాకెందుకు తెలీదూ? మా స్వరూపతో అన్నిరకాలా అనుభవాలూ ఆ విషయం చెప్పాయి....."

"నేను స్వరూపతో మాట్లాడాలి! ఇద్దరం మాట్లాడుకోవాలి!"

"అలాగే..... తప్పకుండా......"

## 10

ఆ గదిలో, ఎదురెదురుగా వాళ్ళిద్దరు కూర్చుని వున్నారు. పైన ఫాన్ చిన్న శబ్దంతో తిరుగుతూంది.

"అది జరిగిపోయి, కొన్ని సంవత్సరాలు అయిందికదూ?"

"అవును....."

"అంటే, మీ మనసులో ఆ విషయం పూర్తిగా లేకుండా పోవాలి, ఈ సరికి?"

"మనసు వస్తువుకాదు కదండీ!" అంది స్వరూప. "కాయితం మీద అక్షరాల్ని నీటితో చెరిపేయొచ్చును! నీటితోనో, మరే ద్రావకంతోనో కొన్ని రూపాల్ని నిర్మూలించగలం! నిప్పుతో ఎంత పెద్ద స్వరూపాన్నయినా తగలబెట్ట వచ్చును! కాని.... మనసుమీద జ్ఞాపకాల్ని అంత సులువుగా చెరపెయ్యలేం! కాలం గడుస్తోంటే కొంత మరచిపోవచ్చు! కాని, అపుడపుడూ, ఆ సంఘటనని గుర్తుచేసే, కెలికే మాటలుగానీ, సంఘటనలుగానీ ఆ మనిషిని చిత్రహింస పెడ్తాయి......" అని ఆవేశంగా చెప్పి, "క్షమించండి! ఎక్కువగా మాట్లాడేనా నేను?" అడిగింది.

అతను తమాయించుకున్నాడు.

"లేదులేదు...." అన్నాడు. "యదార్థమే చెప్పారు.... నే నెందుకి సమావేశాన్ని

ఏర్పాటు చేశానంటే పెళ్ళయ్యాకా, భవిష్యత్తులో, మన మీద, ఈ విషయం ఎటువంటి ప్రభావాన్నీ చూపకూడదనీ' ఎటువంటి చెడ్డపరిణామాలూ సంభవించకూడదనీ' కలతలు అవీ రాకూడదనీ' సాధారణంగా నాదీ. అవతలిమనిషిని రెచ్చకొట్టే తత్వంకాదు' అయినా పురుష అహంకారం ఎంతో కొంత నాలో వుంది' దాన్ని మీరు రెచ్చకొట్టవద్దు' పెళ్ళి అంటే మూడు కాదు ముప్పయి లక్షల ముళ్ళ బంధం'' అన్ని ముళ్ళు వేసుకుపోవాలి' స్నేహము, అనురాగం, ఆపేక్ష, మమకారం, మానవతా, ఆర్తి, కరుణా, చొరవా సమయస్ఫూర్తి, వివేచనా ఇంకా ఇలాంటి వెన్నెన్నో, వాళ్ళమధ్య అన్ని లక్షల ముళ్ళు వేస్తాయి'

స్వరూప వూపిరి బిగపట్టి వింటోంది. అతను చెప్పేది అతను ఒక మాస్టారులా, తనొక విద్యార్థినిలా అనిపించిందామెకు

మీరు చెప్పింది పూర్తిగా నాకు అర్థం అయింది నా వలన మీకేవిధమయిన మనస్తాపం వుండదు' ఇంతకంటే ఎలా చెప్పను'' అని బేలగా చూసింది

అతని ముఖం వెలిగింది

స్వరూపా' నేనూ అదే హామీ ఇస్తున్నాను, నీకు' భవిష్యత్తులో మన మధ్య ప్రేమ, అనురాగం తప్ప, ఎలాటి దుష్పరిణామాలకు తావుండదు''

ఇప్పుడు వాళ్ళిద్దరు ప్రక్కప్రక్కనే కూచున్నారు ఒకసోఫాలో అతని చేతిలో ఆమె చేయివుంది

ఇదంతా చూస్తుంటే నాకేమనిపిస్తోందో, తెల్సా'' అన్నాడు అతను నవ్వుతూ

చెప్పండి అతని చేతిలో నలుగుతూ, చెమర్చుతూ, చిరుకంపనంతో సంచలిస్తున్న తన చేతిని చూస్తూ పలికిందామె

ఎవరితో ఎవరికి బంధం పెనవేసి వుంటుందో'' అది ఎవరూ చెప్పలేరు సుమా' నీకొసమే నేనింత కాలంగా బ్రహ్మచారిగా వున్నానా'' అనుకొంటున్నాను అన్నాడతను

* * * * * *

కల్యాణమంటపం కనులవిందుగా అలంకరింపబడి వున్నది కొద్ది సమయం తేడాతో, రెండు జంటల వివాహాలు ఆరోజు, అక్కడ జరిగాయి

ఒకజంట

స్వరూప, నాగేష్

మరొకజంట

వైజయంతి, మనోజ్

నాగేష్, స్వరూప వివాహం అతని ఇష్టం మీద కొంచెం నిరాడంబరంగానే జరిగింది

మనోజ్, వైజయంతిల వివాహం ఆడంబరంగా జరిగింది, మనోజ్ పట్టుదలమీద

పెద్దల చేతులు అక్షింతల ఆశీర్వాదాలను కురిపించేయి స్వరూప లోపల చిన్నగ నిట్టూర్చి అనుకొంది 'అవమానాల అక్షింతలు ఒకప్పుడు' ఆశీర్వాదాల అక్షింతలు ఇప్పుడు''

''వైజయంతి మాటలు వింటే, అసలు పెళ్ళే చేసుకోదేమో'' అలా బ్రహ్మచారిణిగ వుండిపోతుందేమో అని ఎంతో భయపడ్డాము అన్నారు దక్షిణామూర్తి, పూర్ణ

'అట్లా ఎలా వుండిపోతుందండి ఆవిడ? ఆవిడకోసం నేను పుట్టి సిద్ధంగా వున్నానుకదా?

మనోజ్ మాటలకంతా నవ్వారు

అతను మళ్ళా ఇన్ని అక్షింతలు తీసుకువచ్చి, అందరిచేతుల్లో పోసి, మీ అందరి మనసులు, ఆలోచనలు, అభిప్రాయాలే మాకు అక్షింతలు' మరోమారు వేయండి' అని, ఒంగాడు దండంపెట్టి

రెండు జంటలపైనా, అక్షింతల జల్లు కురిసింది

**(అయిపోయింది)**

# సుభాషితాలు

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్
ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివాంభో
లోకస్తథాప్యహిత మాచరతీతి చిత్రమ్




ముసలితనం పెద్దపులి వలె [illegible] కూర్చొని యున్నది (మింగేస్తానన్నట్లు) రోగాలు శత్రువుల వలె శరీరాన్ని చావకొడుతున్నాయి పగులు విడచిన కుండ నుండి నీరు కారిపోవునట్లు ఆయుస్సు క్షీణిస్తున్నది ఇట్టి పరిస్థితిలో గూడా మనిషి అహితాన్నే చేస్తున్నాడంటే ఆశ్చర్యం కదా!

జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాపమపాకరోతి
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్




సత్సాంగత్యం [illegible] పోగొడుతుంది. మాటలలో నిజాన్ని నిలుపుతుంది. గౌరవాన్ని కలిగిస్తుంది, పాపాన్ని హరిస్తుంది, మనస్సుకు ఆహ్లాదాన్నిస్తుంది, నలుదిక్కులలో కీర్తిని వ్యాపింపజేస్తుంది, మరి సత్సాంగత్యం చేయనిదేముంది? (సత్సాంగత్యం సకల సత్ఫల ప్రదమని భావం)

-ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ




సి కె ఎల్ హైద్రాబాదు

★ 'అడగండి చెపుతా' అనే ప్రశ్నావళిలో బాగున్న ప్రశ్నకి బహుమతి వుంటుంది మరి ఆంధ్రపత్రికలో మి ప్రశ్నావళి కెందుకు లేదు?

● ఇది ఆంధ్రపత్రిక-మరిచి పోయారా ఇది నిన్నా మొన్నా పుట్టినది కాదు గిమిక్స్ చేసుకుని పైకి పోడానికి తాపత్రయ పడడానికి?

ఎమ్ ఎస్ పి కాచిగూడ

★ నేటి సమాజంలో మగాడు తెంచుకొన్నంత త్వరగా ఆడది తన బంధాన్ని తెంచుకోలేదెందుకు?

● ఇది పురుషాధిక్యత గల సమాజం ఇందులో మగవాడి తప్పులు చూసి చూడనట్టు వూరుకోవడం ఆడదాని తప్పుని భూతద్దంలోంచి చూసి నిలదీస్తారు! ఇక తెంచుకుపోడం వారికే సులభం కదా ఆడది కంటుంది పెంచుతుంది బాంధవ్యం పెంచుకుంటుంది మగవాడికా బాధ లేదుకదా ఇష్టమైనన్నాళ్ళు భరిస్తాడు లేకుంటే లేదు!

ఎ. ఎస్ చీరాల

★ 'నాకు ఆలోచించుకోవలసిన పనివుంది నేను రాలేను అని లలిత పాత్రద్వారా వెల్లడించిన మి వ్యక్తిత్వం నన్ను ముగ్ధుణ్ని చేసింది సూటిగా నిర్మొహమాటంగా మనసులో మాట చెప్పిందా పాత్ర. ఈ నవలను సినిమా తీయించండి

● పాత్రల గొప్పతనం- కాదు సినిమా వారికి కావలసినది వారికేం కావాలో చివరిదాకా వారికే తెలియదు! మనం చెప్పడం కూడా దండగ

పి కె దర్శి

★ మనిషి దేనికి బానిస అవుతాడు?

● అలవాటుకి.

★ భూమిలో అందమైనది ఏమిటి అన్న ప్రశ్నకి 'నేను' అన్నమాట అని సమాధానం యిచ్చారు నిజం-

● నేను అన్నది మహదొడ్డది మహ చెడ్డది కూడా

బి.బి ఆర్ నారాయణపేట

★ అక్కా వరకట్నం పోవాలంటే?

● కట్నం ఇవ్వకుండా ఉండడం అలా కట్నం అడిగిన ప్రబుద్ధుడిని అమ్మాయి చేసుకోననడం అత పిల్లలు డబ్బు పోసైనా ఎవరినో ఒకరిని పెళ్ళాడాలని డెస్పరేట్‌గా తయారు కాకుండా వుండడం-కాస్తైనా పౌరుషం లేకపోతే- ఇది సాధ్యంకాదు

బి ఎన్ బొబ్బిలి

★ పత్రికలో ఎన్నేళ్ళ నుంచి జవాబు లిస్తున్నారు? స్వంత వూరు మద్రాసేనా?లేక ఇంకో వూరుందా? ఆరుద్ర గార్కి ఎప్పుడు పెళ్ళయింది? మి స్వంత ఎడ్రస్ ఇవ్వరా?

● 1 జ్ఞాపకం లేదు 2 మద్రాసే- కాని పుట్టినూరు కోటనందూరు 3 మా ఇద్దరికీ ఒకేసారి అయింది పెళ్ళి! 1955 ఏప్రెల్‌లో 4 ఎందుకు పత్రిక్కి రాస్తే చాలు

వై కె దరిశి

★ ఆపదలో ఆదుకునేది ఎవరు?

● మనం చేసిన మంచి

★ మనిషికీ డబ్బుకీ సంబంధం ఏమిటి?

● మనిషి లేకుండా డబ్బుండ కలదు డబ్బు లేకుండా మనిషి ఉండలేడు

డి ఎన్ ఆర్ హైదరాబాదు

★ స్వేచ్ఛ అంటే నిర్వచనం?

● కటకటాల నుంచి చూడడం- అదే -వాటికి బయట నిలబడి" లో పలినుంచి కాదు

పి ఎన్ వి శృంగవరపుకోట

★ నల్ల బల్ల మిద రంగురంగు సుద్ద ముక్కలతో గిచిన గీతలు దేనికవే 'అందంగా' కనబడ్డట్టు మి జవాబులు ఒకదాని కొకటి తీసి పోనట్టు బాగుంటున్నాయి మరి కొందరు ఏం చదువుకుని జవాబులిస్తున్నారని అడుగుతా రెందుకు ప్రశ్న చదివేగద జవాబు రాసేది?

● వారి ఉద్దేశ్యం- అది కాదు చిట్టి తల్లీ- వీళ్ళకి చదువంటే – ఎన్ని డిగ్రీలు? ఎంతెంత పెద్దవి? అనే గాని యింగితం అని కాదు

ఎమ్ ఎమ్ జి అనంతపురం

★ మి ప్రశ్నావళికై మూడు క్వొచ్చన్ మార్కులు పెడతా రెందుకు– గాందిగారి కోతుల్లా ఏమైనా?

● ఏం లేదు చిత్రకారుడి సరదా!

వి ఎస్ ఆర్ ఎమ్ గుంటూరు

★ ప్రేమలో ఓడిపోయిన వారేం చేయాలి?

● కల చెదిరిందను కుని ముందుకి సాగాలి

పి ఎమ్ నందిగామ

★ తను ప్రేమించిన స్త్రీ తనను ప్రేమించక పోయినా సుఖసంతో షాలతో ఆనందంగా వుండాలని కోరుకుంటాడు ఆమె అతన్ని కాదన్నా నువ్వే నాకు కావాలి అన్నట్టు తన ప్రాణం అన్నట్టు ఫీలవుతాడు ఎందు కండీ మనిషి కింతప్రేమ?

● ఇదిగో – యిలా కోత పెట్టడానికి మాదవి! ప్ప!

ఆర్ సిహెచ్ పి శ్రీకాకుళం

★ మి ప్రశ్నావళి నాకిష్టం ఎందుకంటే మిరు ప్రేమ సలహాలు ఎక్కువగా యిస్తూవుంటారు నాకు ఎప్పటికైనా లౌ మేరేజి చేసుకోవాలని వుంది

● చేసుకోండి– చదువు పూర్తి చేసి సంపాదన చేతికి రావడం ప్రారంబించాకే! నేను ప్రేమ సలహాలివ్వడం ఏమిటి? అది కనిపించేటంత, వినిపించేటంత– అనుబవించేటంత– సింపుల్ విషయం కాదని– హెచ్చరిస్తూన్నా నంటే– బాగుంటుంది

జి కె పి బల్లిగూడ

★ మంగళ సూత్రం సిందూరం చేతికి గాజులు వుంటే పెళ్ళి అయిన స్త్రీగా పోల్చబడుతూంది అయితే పెళ్ళయిన మగాడుగా గుర్తింప బడాలంటే–

● ఈ దేశంలో మగాడి కాబాద లేదు కనుకనే గుర్తింపు విషయం పెద్దలు ఆలోచించలేదు నాకు పెళ్ళయిందని' పైబడ వచ్చిన స్త్రీకి చెప్పకలడు చెప్పకుండా వుండనూ కలడు– అతన్ని తప్పు పట్టరు □



# గణపతి గడప దాటితే...

## మంత్రవాది మహేశ్వర్

అప్పటికి చాలా సేపట్నుంచీ వాదన జరుగుతోంది

హైదరాబాదులో అల్లర్లు చాలాసార్లు నీ చవితి రోజునే జరిగాయి భక్తులు ఎంతో ఆనందోత్సాహాలతో భక్తి శ్రద్ధలతో నిన్ను కొలుస్తుంటే నువ్వు వారికి ఏ విధంగా సహాయపడ గలుగుతున్నావు కనీసం ఆ గొడవలు కర్ఫ్యూలు, కత్తిపోటు సంఘటనలూ ఏ రకంగా జరుగుతున్నాయో అసైనా తెలుసుకున్నావా అది నీ బాధ్యత కాదనా ఏం మాట్లాడవు ఒక సామాన్య మానవుడు భూలోకంలో వద్దులే హైదరాబాదులో ఎలా బ్రతుకుతున్నాడో అక్కడ బ్రతకడం ఎంత గొప్పో ఆలోచించు

కుమారస్వామి అన్నమాటలు భరించలేక పోయాడు వినాయకుడు

చిన్నవాడిని నీకు చెప్పగలిగే టంతటివాడిని కాను ఆవేశంతో మాట్లాడివుంటే క్షమించునన్ను అనేసి కుమారస్వామి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు

ఆలోచనల్లో పడిపోయాడు మూషికవాహనుడు

చివరికి – హైదరాబాదు వెళ్ళి వినాయక చవితి రోజున అల్లర్లు జరిగితే అదేమిటో ప్రత్యక్షంగా తెలుసుకోవాలి అనుకుని తన మూషికాన్ని సలహా అడిగాడు ఈ విషయంలో

ఒంట్లో బావుండకో ఏమో ప్రయాణానికి అంత ఆసక్తి చూపలేదు

అంతదూరం మూషికానికి ట్రబుల్ యివ్వడం యిష్టం లేక పరిస్థితులు వివరించి చెప్పి తను కూడా వుండకపోతే లోకల్‌గా ట్రాన్స్‌పోర్ట్ ప్రాబ్లమ్ వ్లస్ కంపెనీ కూడా వుండదని బ్రతిమాలాడు రమ్మని

మొత్తానికి కాదనలేక అలాగే స్వామి అని ఒప్పుకుంది

హైదరాబాదు వెళ్ళాక అంతెందుకు ఈ కైలాసం వదిలాక స్వామి గిమి అంటే బావుండదు అలాగే నిన్ను నేను జూలీ అని పిలుస్తుంటాను నువ్వు నన్ను వినాయక్ అని పిలువు

వద్దు స్వామి

అదిగో అదిగో

అబ్బే అలాకాదు మిమ్మల్ని అలా పిలవాలంటే ఎలాగో అనిపిస్తోంది

మరేం పరవాలేదు ఇది మరో అవతారమనుకో మనం అక్కడ చాలా రోజులు మకాం పెట్టాల్సి వుంటుందేమో కాస్త నాలుగు జతల మంచి బట్టలు సర్దివుంచు బావున్నాయి కదా అని సర్దేటప్పుడు నోట్లో వేసుకోకు

నేనెప్పుడు చేశానలాగ తను చేసింది తనే మరచిపోయి అంది జూలీ

వినాయకచవితి యింకా పది రోజు లుండనగా విమానంలో బయలుదేరడానికి సిద్ధమయ్యారు

అవును యిప్పుడు బయలుదేరిపోతే ఎలాగ మీ పేరెంట్స్‌కి చెప్పకుండా అన్న సందేహాన్ని వెలిబుచ్చింది జూలీ

నిజమే అనుకో చవితి ముందుగానే వెళ్ళాలని కదా చెప్పి వెడితే చవితయ్యాక వెళ్ళొచ్చు అని అబ్జక్షన్ రైజ్ చేస్తే

మరేం పరవాలేదు ఎలాగో ఒకలా సర్ది చెప్పుకుందాం మన ప్రయాణాన్ని ఒక్క రోజేకదా వాయిదా వేస్తున్నాం రేపుదయం మీ వాళ్ళకి చెప్పి బయలు దేరదాం

సరే అలాగే చేద్దాం

* * * *

ముందురోజు బయలుదేరనందుకు మహా ఆనందంగా వున్నా ఆ రోజు ప్రయాణం అన్నా భయం పోలేదు ఎందుకంటే ముందురోజు బయలుదేరిన విమానం పేలి సముద్రంలో కూలిపడిందనే వార్త తెలిసింది

అసలు ప్రయాణం కేన్సిల్ చేసుకుందామని బ్రతుకుమీద తీపి ప్రకటించింది జూలి

ఎప్పుడూ అలా జరుగుతుందని ఎందుకు అనుకోవడం గ్రహచారం అనుకోవచ్చుగా

అదే మన గ్రహచారం ఎలావుందో అందులోనూ మీకుండే పవర్స్ యిక్కడే తప్ప అక్కడ పనిచేయవంటున్నారు

నీకెందుకు పేరెంట్స్ పర్మిషన్ లభించింది పద బయలుదేరదాం

* * * *

వినాయక్‌ను విమానాధికారులు కాస్త అనుమానంగానే చూశారు చెక్ చేసేటప్పుడు పొట్టను పదే పదే తడిమారు

జూలీని చూసి మరి సందేహించారు

అందులోనూ ఘోరమైన విమాన ప్రమాదం సంభవించిందేమో ముందు చాలా జాగ్రత్తగా వున్నారు అధికారులు

మొత్తానికి వినాయక్ జూలీలు విమానం ఎక్కారు






హైదరాబాద్ చేరాక ఏ లాడ్జిలో వుండాలి. తన కిష్టమైన పదార్థాలు అక్కడ ఏమేం దొరుకుతాయి... మమ్మీకి, డాడికి ఏమేం పట్టుకెళ్లాలి అక్కడేదో త్రి-డి సినిమాలుంటే ఎలా

వుంటాయి అన్న ఆలోచనల్లో వుండగానే- ఒక్కసారి కూర్చున్న వాళ్ళందరిలోనూ అ...ల...జ డి...

నలుగురు పిస్తోళ్ళున్న వ్యక్తులు... భయపెట్టి విమానాన్ని దారి మళ్ళించారు

ఏదో దేశంలో దింపేశారు

వాళ్ళసలు ఏం ఆశించి ఆ పని చేశారో ఏమిటో వినాయక్‌కి అర్థం కాలేదు. గాభరాగా వుంది. ఎవరికి వాళ్ళు తమని ప్రాణాలతో వదిలేస్తే చాలు అని తన తల్లిని, తండ్రిని యింకా తమ బంధువర్గాన్ని తలుచుకుంటున్నారు... దానినే 'హైజాక్' అంటారని- యిటువంటివి తరచు జరుగుతున్నాయని- ఏ విమానాన్ని అలా చేస్తారో తెలియదని .. అందులోని రాజకీయాలు వినాయక్‌కు

విడమరచి చెప్పేవాళ్ళు ఎవరూ లేరు.

"హైజాక్" చేసిన వాళ్ళు పరారీ కావడం...

మరో విమానంలో వీళ్ళందరినీ బొంబాయి తీసుకురావడం జరిగింది అయితే విషాద వార్త ఏమిటంటే తనతో బాటుండే తన జూలీ ఏమైందో, ఎలా మాయమైందో అర్థం కాలేదు వినాయక్‌కు చాలా విలవిల్లాడి పోయాడు ఒంటరిగా అది అసలు బ్రతకలేదు కానీ అనుకున్న పని నెరవేరడానికి అంతా తనని పూజిస్తారు ముందు అలాంటప్పుడు జూలీకోసం బాధపడిపోతూ తన ప్రయాణాన్ని మానుకుని వెనక్కి తిరిగి వెళ్ళిపోవడం మంచిపని కాదు!" అనుకుని అలాగే ముందుకెళ్ళాడు

* * * *

లకిడికాపూల్‌లో వున్న ఓ లాడ్జ్‌లో దిగాడు

మరో రెండు రోజులేవుంది "వినాయక చవితి"

ఖైరతాబాద్, చిక్కడపల్లి, బడిచౌడి, అమీర్‌పేట, గుడిమల్కాపురం అనేక చోట్ల పెద్ద పెద్ద విఘ్నేశ్వరుడి విగ్రహాలు పెట్టి వున్నాయి

ఎంతమందో చందాలు వసూలు చేసుకుని, నానా శ్రమపడి ఎంతో గొప్పగా పూజా కార్యక్రమాలు, రాత్రి పూట సాంస్కృతిక కార్యక్రమాల కోసం ఏర్పాట్లు చేస్తున్నారు

ఎంతో ఆనందం కలిగింది వినాయక్‌కి

అయితే ఆ ఆనందం ఎంతసేపో నిలవలేదు దాని క్కారణం పేపర్లో వార్త భలే మంచి చలె రుచి' హెడ్‌లైను క్రింద – 'చైనా దేశస్థులు ఓ అతి రుచికరమైన వంటను కనుక్కున్నారు అదేమిటంటే ఎలుకలను పట్టి వాటి చర్మం ఒలిచి ఉడికించి, వేయించి . వగైరా వగైరాలు చేసి తయారు చేస్తున్నారు. దాంతో దేశంలో ఎలుకల గిరాకీ పెరిగింది. పట్టి పెంచడం చాలా మందికి వృత్తి అయింది అంతేకాదు ఎలుకలు చెతవగా భావిస్తున్న యితర దేశస్థులు వాటిని ఎగుమతి చేసి విదేశీమారక ద్రవ్యం సంపాదించుకుంటున్నాయి

'యింకా చాలా వుంది గానీ చదవ బుద్ధికాలేదు

తన జూలీ గురించి విలవిల్లాడి పోయాడు. ఎవరిచేత చిక్కిందో... ఏం చేసేశారో..."

బాయ్ బజ్జర్ నొక్కి లోపలికొచ్చి "ఏమైనా కావాలా సార్–" అనడిగాడు.

"అమృతాంజనం పట్రా" అన్నాడు.

మందో, అమ్మాయో అడుగుతాడనుకుంటే యిదేమిటన్న ఆశ్చర్యంతో ఓ చిన్న నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు.

ఈ మనుషులకిదేం పోయే కాలమో. ఎలుకల్ని పట్టించారు.. అసలు అన్నింటికీ మూలం ఆకలి... జీవహింస మహా పాపమే. కానీ ఒకవేళ అంతా వెజిటేరియన్సే అయితే వాళ్ళకి సరిపడే ఆహారం ఈ భూమ్మీద దొరుకుతుందా? రాను రాను ప్రపంచం ఎలా మారిపోతోందో కదా.. ఏ క్షణం ఎలా వుంటుందో తెలియని పరిస్థితులు పరిష్కారం–? ఎందుకులే మనకివన్నీ– యిలాంటి విషయాలు



"గణపతి పూజ"

ఛాయా చిత్ర కారుడు: వెల్లటూరి పూర్ణానంద శర్మ

# గణపతి గడపదాటితే....

చూసుకోవడానికి పెద్దవాళ్ళున్నారు. వాళ్ళ విషయాల్లో మనం తలదూర్చకూడదు– అనుకుని లేచి నిలబడి నిలువుటద్దంలో చూసుకున్నాడు.

ఇంతలో తలుపు తోసుకుని వచ్చిందో అమ్మాయి. పాతికేళ్ళలోపే వుంటుంది వయస్సు–

"ఏమండీ మీరు మరోలా భావించకండి. నన్ను ఈ రాత్రి ఇక్కడ వుండనీయండి. ఉదయం కాగానే వెళ్ళిపోతాను . ప్లీజ్ . కాదనకండి."

అమ్మాయి అందంగానే వుంది.

కానీ, ఆమె వేసుకున్న పల్చటి దుస్తులు, కట్టుకున్న తీరు అది చూసేసరికి చాలా యిబ్బందిగా ఫీలయ్యాడు వినాయక్.

'నేను ఒక్కడ్నే వుంటున్నాను యిక్కడ" అన్నాడు తడబడుతూ.

"అబద్ధం!'

"కాదు. నిజం.'

"కాదు కాదు .. ఎలాగో చెప్పనా మీరు ఒక్కరు అంటున్నారు నేను మీరూ వుంటున్నాం. ." నవ్వేసి "మీరే కరక్ట్ లేండి. నేనింకా అంత దూరం ఆలోచించ లేదు ఇద్దర్నీ ఒకటిగా లెక్క కట్టేశారు అప్పుడే" గట్టిగా నవ్వింది.

మాటల చమత్కారం గ్రహించినా అదోలా ఫీలయ్యాడు.

"ప్లీజ్ మీకు ఒకవేళ డబ్బు అవసరమైతే చెప్పండి. యిస్తాను. మరో రూమ్ తీసుకోవచ్చు. .."

"నో... యిక్కడే మీ ముందే వుంటాను... ఒంటరిగా వుండాలంటే నాకు చచ్చేంత భయం."

కాసేపటికి– చలించని వినాయక్‌ని చూసేసరికి ఆ అమ్మాయి తన దీనగాథ వివరించింది. తను అలా శరీరాన్ని అమ్ముకునే పరిస్థితులకు సిగ్గుపడింది. సిగ్గొదిలేసిన ఆడది అని జనం చేత అనిపించుకుంటున్న తన దగ్గరికి సుఖం కొనుక్కోవడానికి ఎంత మంది పెద్ద మనుషు లొస్తారో, చెప్పింది. చావనైనా చావాలి గానీ ఈ వృత్తిలోకి అడుగుపెట్ట కూడదు అనుకున్న తనకి తల్లి మందులకి డబ్బు కావల్సొచ్చి– మళ్ళీ అదే బురదలో అడుగేయాల్సొచ్చింది' కన్నీరు కార్చింది..

'ఒంటరి ఆడది ఎప్పుడు కనిపిస్తుందా అని ఆవురావురని చూసే ఈ లోకంలో మీలాంటి వాళ్ళుంటారని ఇప్పుడే తెలిసింది. నా ప్రవర్తన మీకు యిబ్బందిని కలిగించివుంటే క్షమించండి. వస్తాను– అంటూ బయలుదేర బోయింది

ఒక్క క్షణం– వుండమని చెప్పి తన దగ్గరున్న డబ్బులోంచి అయిదొందలు తీసిచ్చాడు

'మీ అమ్మగారికి మందులు కొనివ్వు" అన్నాడు

"ఇంతవద్దు ఇది చాలండి అని వంద రూపాయల నోటు తీసుకుని చీర కొంగుతో కళ్ళొత్తుకుని రెండు చేతులూ పెట్టి నమస్కరించింది వెనక్కి తిరిగిందో లేదో – పోలీసులు తోసుకొచ్చారు

'ఏయ్ మిస్టర్ నువ్వు కూడా కమాన్"

వినాయక్‌కు ముందు అర్థం కాలేదు .. తర్వాత తెలిసింది ఎంతో కొంత ముట్టజెబితే వాళ్ళు స్టేషన్ దాకా తీసికెళ్ళరని అక్కడే వదిలేస్తారని, ఇదిక్కడ మామూలేనని నలుగురి దృష్టిలోనూ పడి అప్రతిష్టపాలు కావడం యిష్టంలేక ఓ రెండొందలు ముట్టజెప్పాడు

నమస్కారం పెట్టి మరీ వెళ్ళిపోయారు పోలీసులు

వాళ్ళసలు పోలీసులు కారనే నిజం డబ్బుగలవాళ్ళు ఎక్కువ మంది లాడ్జ్‌లో వున్నారని తెలిసినప్పుడు ఈ విధమైన రైడ్స్ హోటల్ వాళ్ళే చేయిస్తుంటారని అమ్మాయిల్ని అమ్మడాలు, కొనడాలు లాంటివి జరిగే పాపకూపమని తెలిసిన తర్వాత అక్కడుండ బుద్ధికాక బయటి కొచ్చేశాడు వినాయక్

* * * *

మరుసటి రోజే "వినాయక చవితి

ఉత్సవం జరిగే ప్రాంతంలోనే వుండే ఓ మంచి పేరుందని తెలుసుకున్న లాడ్జ్‌లో దిగాడు

ఎంతో మంది భక్తులు.

'దైవభక్తి మనుషుల్లో కరువైపోయిందంటారు కానీ అలాగనిపించటం లేదు వినాయక్‌కు అయితే ఆ పూజలు చేయిస్తున్న వారిలో పాత లాడ్జి ఓనరు, దొంగ పోలీసులు యింకా చాలా మంది వున్నారు.

"బాల్కనీ' మీద నుంచి చూసి ఒకసారి నవ్వు కున్నాడు మళ్ళీ తన జూలీ గుర్తొచ్చింది

మనసు అదోలా అయిపోయింది.

తనతో బాటు ఎంతకాలం నుంచో.. నిజం చెప్పాలంటే దేహంలో ఒక భాగంలా అయిపోయింది

చాలా బాధేసింది.

అలాగే అదే లాడ్జ్‌లో వున్నాడు. చాలా

యిబ్బందులు పడ్డాడు.

–హోటల్లో భోజనం.

–ఎ.సి. హాళ్ళలో త్రి–డి సినిమాలు.

–హైదరాబాదులో మాట్లాడేది హిందియో, ఉర్దూయో, తెలుగో, తెలంగాణానో ఏదో తెలియక అర్థంకాక ఎన్నో చోట్ల డబ్బులు నష్టపోవడాలు.

–ఆర్టీసీ బస్సులో కిటికీ ఊసల్ని పట్టుకుని పడ్డ అవస్థలు.

–ఉపాధ్యాయులు పిల్లలకి పాఠాలు చెప్పడం మానేసి, ఉద్యోగులు ఆఫీసు ల్నొదిలేసి "సచివాలయం" ముందు "జీతాలు పెంచాలి" అని బోర్డులు కట్టుకుని, టెంట్లు వేసుకుని కూర్చున్న దృశ్యాలు.

–మధ్యలో ఇళ్ళలో పడి ప్రాణాలు తీసేసి, డబ్బులు దోచుకుని పారిపోయే ముసుగు ముఠాల ఆగడాలు.

–పోలీస్ స్టేషన్లలో బలాత్కారాలు

–ఏళ్ళకొద్దీ చదివి పొట్ట కూడు పెట్టలేని డిగ్రీలను సంపాదించుకున్న యువతరం నిట్టూర్పులు -బస్టాండ్లలో అయిదు నిముషాల్లో అరవై మంది చేతులు చాచే ముష్టివాళ్ళు

-డబ్బుకి లొంగిపోయిన డాక్టర్లు, ప్రాణాలు పోయలేని ప్రభుత్వాసుపత్రులు.

అన్నీ ఎంత మరచిపోదామనుకున్నా మరవలేక పోతున్నాడు.

ఇంతలో అరుపులు.... కేకలు. .

పోలీసుల లాఠీ చార్జ్....

కొట్టేసుకుంటున్నారు..

జనం పరుగులు....

ఏమిటాని బాల్కనీలో కొచ్చి చూశాడు వినాయక్.

నిమజ్జనం కోసం "ట్యాంక్‌బండ్"కి తీసికెడుతున్న వినాయకుడి విగ్రహం మీదకు రాళ్ళు విసిరారట ఎవరో...

ఎవరో తెలియదు.... కానీ అందరికీ తెలిసిం దేమిటంటే హిందూ ముస్లిముల పోట్లాట ... ఏం రాజకీయమో... ఏమో....

ఆశ్చర్యం ఏమిటంటే గొడవ అక్కడ జరిగితే మరెక్కడో కత్తిపోటు సంఘటనలు....

నగరంలో చాలా ప్రదేశాల్లో దోపిడీలు, హత్యలు...

అంతా కర్ఫ్యూ –

ఇదంతా చూసిన వినాయక్‌కి అక్కడుండ బుద్ధికాలేదు

అసలు పాపుల్ని శిక్షించడానికి విడిగా నరకమెందుకు? అన్న అనుమానమొచ్చింది.

"అమాయకులైన ప్రజలు యిక్కడ ఎలాగ బ్రతుకుతారో" అమ్మ నడిగి తెలుసుకోవాలను కున్నాడు.

న్యాయం ధర్మంగా మనిషి బ్రతకాలి. కానీ యిటువంటి వాతావరణంలో అసలు బ్రతకడమే ఒక సాహసం, గొప్ప... అనిపించింది

వెంటనే వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు ..

* * * *

కైలాసం చేరగానే అక్కడ తనకోసం ఎదురుచూస్తూ కూర్చున్న జూలీని చూసి పొంగిపోయాడు వినాయక్.

కానీ, జూలీ వినాయక్‌ను గుర్తుపట్ట లేదు.

– బక్కచిక్కిన శరీరం. బాగా నల్లబడిపోయాడు కూడా

–కళ్ళజోడు....

చాలా మార్పు వచ్చేసింది వినాయక్‌లో.

"ఎలా వచ్చావు. ఎప్పుడొచ్చావు" అని ప్రశ్నల వర్షం కురిపించేశాడు.

"చైనా వాళ్ళు పట్టుకుపోయారని, బంధించారని– ఓ ఫైవ్ స్టార్ హోటల్లో నన్ను వండేసి "స్పెషల్" చేసేసుకోవాలని అనుకున్నాక రాత్రికి రాత్రి తలుపుని బద్దలు చేసేసుకుని పారిపోయి.... దారి తెలియక, మీరెక్కడుంటారో తెలియక చాలా దూరం వెళ్ళిపోయి "హైదరాబాద్" ఎక్కడ అని ఒకతన్ని అడిగితే "పాకిస్తాన్"లో వుందన్నాడు... వెంటనే అక్కడికి బయలు దేరాను. అక్కడ నన్ను కొంత మంది వెంబడించారు. వాళ్ళనుంచి తప్పించుకుని యింక యిలాగొచ్చేశాను...."

"పోన్లే మనం మళ్ళీ యిలా కలుసుకుంటా మనుకోలేదు.' అన్నాడు వినాయక్.

నీ పరిస్థితేమిటండి– జూలీ.

"బాబోయ్ అది భాగ్యనగరం కాదు. బాధల నగరం. దినదిన గండం నూరేళ్ళాయుష్షులా వుంది అక్కడి ప్రజల పరిస్థితి అక్కడి విషయాలు ముందు నాన్నకి చెప్పాలి పద...." అంటూ లోపలి కెళ్ళారు.

"ఈ విషయాలన్నీ నాన్నకి తెలియవను కుంటున్నాడు పిచ్చున్నయ్య" అనుకుని లోలోపలే నవ్వుకుని వెనకాలే వెళ్ళాడు కుమారస్వామి. □





# చవితి రోజు

- BANNU



పొరపాటున చంద్రుణ్ణి చూస్తానేమోనని
మావిడ ఇలా కట్టిందోయ్!!




నువ్వు కొనమన్న పట్టుచీర కొంటాను!
కానీ నువ్వు చేసిన ఉండ్రాళ్లు తినమని
బలవంతం పెట్టకు కాంతం!!




చవితిరోజు చంద్రుణ్ణి చూడకూడదనే
కంగారులో కళ్ళు మూసుకుని ఓ అమ్మాయి
మీద పడ్డాను గురూ!!




బాబ్బాబు ఈ ఉండ్రాళ్లను కాస్త
పగలకొట్టివ్వు!!
కరాటే ఫైటర్




నిన్న చవితినాడు ఉండ్రాళ్లు తిని
పళ్లు విరగ్గొట్టుకున్న వారి సంఖ్య
పదివేలకు పెరిగింది......!!




ఈసారి చవితికి నన్ను విమర్శిస్తూ
గీసిన కార్టూన్లేస్తే ఊరుకోను జాగ్రత్త!!
ఎడిటర్
BANNU

# చూపులకు సొగసైనది.
# పనితనంలో సాటిలేనిది.




# మౌలిమెక్స్
## కెన్‌మోర్
## మిక్సర్-కమ్-గ్రైండర్



ఇదే మీరెంతోకాలంగా ఎదురుచూస్తున్న అన్ని మంచి లక్షణాలతో ఉన్న మిక్సర్-కమ్-గ్రైండర్.

- రుబ్బటానికి, చిలకటానికి, ముక్కలు తరగటానికి పొడిచెయ్యటానికి అనువైన నాలుగు బ్లేడ్‌లు.
- సొంపైన ఎ.బి.ఎస్. ఆకృతి - కలకాలం మన్నేది.
- మూడు స్పీడ్‌లు గల స్విచ్.
- జీవితాంతపు సర్వీసుతో పాటు, 18 నెలల గ్యారంటీగల హెవీడ్యూటీ మోటార్ కలది.
- మీరు కావాలనుకుంటే జ్యూసర్ కోసం మరో అదనపు అమరిక.

ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య గృహోపకరణముల డీలర్లందరి వద్ద లభించును.

మార్కెట్ చేయువారు :-

బొలాకీ ట్రేడింగ్ కంపెనీ (ప్రై) లి.,

నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్ - 500 001 ఫోన్: 223206.

TARA/BTC/40/85/TEL.

సీరియల్

# అంతరాలు-అంతర్యాలు

బోసుబాబు

(గత సంచిక తరువాయి)

మరునాటి రోజు ఉదయాన్నే ఊరుకు ప్రయాణమయ్యారు.

రైలుస్టేషన్‌లో బండి కదిలేముందు భార్యకు, పిల్లలకు ముత్యాలరావు జాగ్రత్తలు చెప్పి, మామగారి దగ్గర సెలవు తీసుకుని, ఊరు చేరగానే ఉత్తరం వ్రాయమని చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

రైలు కదిలి సాగిపోతోంది శాంత, పిల్లలు ఒకచోట కూర్చున్నారు. సీటులేక సుబ్బారావుగారు నిలబడే వున్నారు. వయస్సు మళ్ళినవారు కాబట్టి అప్పుడప్పుడు ఉస్సురనుకుంటున్నారు. ఆయన నిలబడిన చోటుకు ప్రక్కగా ఓ యువకుడు కూర్చుని, దినపత్రిక తీక్షణంగా చదువుతున్నాడు. అతడి దుస్తులు నిరాడంబరంగా వున్నాయి వయస్సు సుమారు పాతికేళ్ళు వుండవచ్చు అతడి నడతను బట్టి, చూచినవారు, విద్యావంతుడై వుంటాడని భావిస్తారు పత్రికను చదువుతూ, ఉస్సురన్న శబ్దం విని తలయెత్తి ప్రక్కకు చూచాడు. సుబ్బారావుగారి పరిస్థితిని గమనించాడు.

కొద్దిసేపు ఆగి ఆ యువకుడు–

"ఏమండోయ్. మీరు నిలబడలేక శ్రమపడుతున్నట్లుగా వుంది నేను లేచి కొద్దిసేపు నిలబడతాను నా సీట్లో మీరు కూర్చోండి..' అంటూనే లేచి నిలబడ్డాడు

సుబ్బారావుగారు ఆ యువకుడిని చూచి, మొదట కృతజ్ఞతాపూర్వకంగా నవ్వి చూసి, ఆటు తర్వాత కొంత తటపటాయిస్తూనే, ఆ యువకుడు లేచిన సీట్లో కూర్చున్నారు అలా కూర్చుని, అపరచిత యువకుని ఓ సారి తేరిపార చూశారు ఈయనెవరో సుగుణవంతుడై వుండాలి, అని మనసులో అనుకున్నారు రెండు, మూడు స్టేషన్లు దాటగానే ఆ పెట్టెలో రద్దీ తగ్గింది. సుబ్బారావుగారి ప్రక్కన సీటు ఖాళీ కాగా, ఆ యువకుడు కూర్చున్నాడు. మరలా ఓసారి కించిత్తు పరిశీలనగా ఇద్దరూ చూచుకున్నారు. వారి పరిచయానికి, సాన్నిహిత్యానికి ఆ చూపులే నాంది పలికాయనవచ్చు.

'ఏమండి' ఎందాక మీ ప్రయాణం?"– మొదట పలకరించింది సుబ్బారావుగారే

"విజయవాడ వరకు..." యువకుని సమాధానం.

"మేమూ బెజవాడకే లెండి. చదువుకుంటున్నారా, లేక ఏదైనా ఉద్యోగం....?"

"లేదండీ. చదువు ముగించాను ఉద్యోగమేమి లేదు కాని, ఏదో వృత్తి చేస్తున్నాను లెండి.'

"మీపేరు?"

"నాపేరు శ్యామసుందర రావు మిత్రులు "శ్యామం" అని పిలుస్తారు. మీరు ఎలా పిలిచినా అభ్యంతరం లేదు. అన్నట్లు మీపేరు చెప్పారు కాదు," తిరిగి శ్యామం ప్రశ్నించాడు.

"నన్ను సుబ్బారావు అంటారు. ఆ కాలంలో, మా రోజుల్లో, దేశం కోసం ఏమేమో చేశాము. ఎందుకు లెండి అవన్నీ ఇప్పుడు. నా జీవితం ఇంతవరకు స్వార్థమనేది లేకుండానే గడిచి పోయింది. గతంలో ఏం చేసినా, వర్తమానంలో మాత్రం నేనేమి చేయలేను. ఏదో క్రిష్ణా రామా అంటూ కాలం గడపడమే చివరకి మిగిలిన కార్యక్రమం."

అవున్లెండి, పెద్ద వయసొచ్చాక ఏం చేయగలరు."

"బాగా చెప్పారు మీరన్నది నిజమే మరి. జరుగుతున్నది చూడలేక బాధపడటం తప్ప ఏం చేయగలం. అసలు, నన్నడిగితే లోసుగంతా ప్రజల్లోనే వుందంటాను ప్రజలు చైతన్యవంతులుగా వుంటేనే ప్రజాస్వామ్యం నిలుస్తుందంటాను... అవునా...."

"కాదామరి "

'అంతేగాదు ఇటు వినండి. గాంధీగారు ఏం చెప్పాడు. కల్లు మానండ్రా అన్నాడు. మా రోజుల్లో పాట కూడా వచ్చింది మీకు తెలీదేమో... 'కల్లు మానండోయ్ బాబు, కళ్ళు తెరవండోయ్..' అని గాంధీగారి సిద్ధాంతాలను పాటిస్తున్నామని చెప్పేసి, మద్య నిషేధం తెచ్చారు. ప్రభుత్వానికి డబ్బు గిట్టుబాటు కావడం లేదని మళ్ళీ తీసేశారు. ఇదే బాబు, గాంధీజీ వారసుల నిజ స్వరూపం. నిజానికి నన్నడిగితే ఈ త్రాగుడు అలవాటు పోవాలంటాను. లేకుంటే దేశం బాగుపడదు... అ. గ్యారంటీ గాను." అన్నారు సుబ్బారావుగారు కించిత్తు ఆవేశంగాను, ఆందోళనతోను. శ్యామం అందుకున్నాడు.

**'మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. కాని ఈ మద్య నిషేధాన్ని తొలగించడానికి గల కారణాలు మరికొన్ని వున్నాయని మీకు తెలుసా?'**

**'ఏమిటంటారు?'**

**'ప్రజల్ని మత్తులో పడేసి వుంచడమే. అదేమరి ఇప్పటి మన 'ప్రజాస్వామ్యం' లోని కీలకం. అయిదేళ్ళకోసారి ఓట్లు కావాలికదా. ఆ ఓట్లకోసం ఉపయోగించే చిట్కాల్లో ఇదొకటి. అయినా, ఓట్లకోసం, సీట్లకోసం, పార్టీల మనుగడకోసం, ఈ క్షుద్రమైన పద్ధతిని అవలంబించడం మహాదారుణమంటాను. ఇందువల్లనే మనదేశంలో ఓటుకు విలువ లేకుండా పోయిందేమో!'**

జరిగినకథ – 2: సుబ్బారావుగారు వ్యక్తిత్వం గల వారు, పరోపకారి. ఆయన సతీమణి సుబ్బమ్మగారు. ఎదిగిన కొడుకులు డబ్బు సహాయం చేయడంలేదే అని, చిన్న కూతురు సరోజ చిన్న చిన్న సరదాలు కూడా తీర్చలేక పోతున్నామే అని ఆమె బాధ. పెద్ద కూతురు శాంతను పురిటికి తీసుకు రావడానికి పైకం అవసరమై పరంధామయ్య దగ్గర ఇంటికి సంబంధించిన ఖాతాలో రాయించి అప్పు తీసుకు వచ్చి, శాంతను తీసుకు రావడానికి వెళ్ళారు సుబ్బారావుగారు.

'మీరు చిన్నవారైనా భేషుగ్గా చెప్పారు. వెనకెప్పుడో అనుకునే వాళ్లం. స్వరాజ్యం వస్తుంది. దేశం సుభిక్ష మవుతుంది అని. కాని, అనుకున్నది కాస్త తలక్రిందులై చివరికి కష్టకాలం దాపురించింది. అవునూ మనం చాలా సేపు మాట్లాడామనుకుంటాను'.

'ఏదో, లోకాభిరామాయణం'..శ్యామం నవ్వుతూ అన్నాడు.

'అన్నట్లు మీరు బెజవాడలో కాపురముంటున్నారా?'

'అవునండీ, రెండేళ్లనాడు ఓ చిన్న వారపత్రిక ప్రారంభించాము. పత్రికపేరు 'చైతన్య'.

'అలానా.... మీరు కూడా ఉత్సాహ వంతులే నన్నమాట. రావాలండీ, రావాలి. చిన్నదైనా పెద్దదైనా ప్రజల్ని చైతన్యవంతం చేసే పత్రికలు రావాలి.' సుబ్బారావుగారి వ్యాఖ్య.

'మీబోటి పెద్దల ఆశీర్వాదం లభిస్తే, అదే పదివేలు. మీరు కూడా మా కార్యాలయానికి వచ్చి సలహాలు ఇస్తూవుండాలి. అదే మా కోరిక.'

'శ్యామంగారు ఒకమాట. నేను కూడా వెనక, ఈ పాలిటిక్స్‌లో తిరిగిన వాడినే. కాని చివరికి విసుగెత్తి నిష్క్రమించాను. నేనిప్పుడు అనామకుడిని. కేవలం బ్రతకడం కోసమే కాలం గడుపు తున్నవాడిని'.

ఈ మాటలు వినగానే శ్యామం గుండె నీరైంది. అతడి వదనంలో సానుభూతి, చూపుల్లో వాత్సల్యం వ్యక్తమైనాయి.

'సుబ్బారావుగారూ! ఇటు చూడండి. నేనూ లక్షాధికారినేమి కాదు. అయితే తిండికి, బట్టకు లోటులేదు. ఎందుకో గాని మీతో సాన్నిహిత్యం పెంచుకోవాలని కుతూహల పడుతున్నాను.

'అలాగేనండి, తప్పకుండాను. నాకూ అదేకోరిక'.

రైలు విజయవాడ స్టేషన్ చేరుకునేసరికి పదకొండు గంటలు దాటింది. శ్యామం తన అడ్రసు చెప్పి, సుబ్బారావుగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోయాడు.సుబ్బారావుగారు కూడా, కూతురు, పిల్లలతో పాటు రైలుదిగి ఇంటికి వెళ్లిపోయారు.

* * * * * * *

## 3

సరోజ కుర్చీలో కూర్చుని వారపత్రిక చదువుతోంది. ఇంతలో తలుపు తట్టిన శబ్దం వినబడగానే లేచి వెళ్లి తలుపు తెరచింది. ఎదురుగా నాన్న, అక్కయ్య, రఘు, రాణి ప్రత్యక్షం.

'అమ్మా, అమ్మా, అక్కాయొచ్చిందే.' అంటూ సంబరపడుతూ తల్లిని పిలిచింది.

'హమ్మయ్య, పాడు ఎండలు ప్రాణాలు తోడేస్తున్నాయి.' అంటూ సుబ్బారావు గారు లోపలికి అడుగు పెట్టారు. సుబ్బమ్మ గారు ముందు గదిలో కొచ్చింది. కాంతను చూడగానే, 'ఏవేఁ, అమ్మాయ్, అల్లా చిక్కిపోయావేమ



# అంతరాలు – అంతర్యాలు

చొత్తిగా... అయ్యో.. పిల్లలు కూడా బాగా నలిగిపోయారు!'

'ఎండలు కదమ్మా..'

'అక్కా, నేను పాసయ్యాను. మా రిజల్ట్స్ నిన్ననే వచ్చాయి.'

'ఏవిటీ!, సరోజ పాసయిందా. నాకు ముందే తెలుసు. మనమ్మాయి పాసుకాకపోతే మరెవరు పాసవుతారు...' అంటూ సుబ్బారావుగారు కూతురు ప్రతిభను ప్రశంసించారు.

'నిన్నటి నుంచి ఒకటేగోల. పై చదువుకు పంపండే అని....' సుబ్బమ్మ గారు అప్పుడే రిపోర్టు.

'అవును నాన్నా, మా క్లాసమేట్సంతా డిగ్రీ కోర్సులో చేరుతున్నారు. నన్ను కూడా చేర్పించరూ?' సరోజ అడిగింది.

'ఈ ఇంటర్ మీడియట్ గట్టెక్కించడానికే తల ప్రాణం తోకకొచ్చింది. ఇంకా పై చదువంటే మనకు సాధ్యమా తల్లీ. దేవుడు మేలు చేస్తే ఆ శుభ కార్యం కూడా ఏదో విధంగా ముగించేద్దామనుకుంటున్నాను'. అని సుబ్బారావుగారు అంటుండగా-

'ఉండత్రా అన్ని సమస్యలు ఇప్పుడే తేల్చేస్తున్నారు. తర్వాత నింపాదిగా మాట్లాడుకోవచ్చులే.' సుబ్బమ్మ గారు చర్రున అందించింది.

'అదిగో చూశారా మీ అమ్మ కర్రపెత్తనం. నోరు కదపనివ్వదు. వినకనించి ధాధాధో అంటూ కర్రపెట్టి పొడుస్తూంటుందంతే....'

తండ్రి మాటలకు కూతుళ్ళిద్దరు పకాలున నవ్వారు.

'విన్నారే ఆయన గారి మాటలు. నాదే పెత్తన మంతా అన్నట్లు మాట్లాడుతున్నారు. అయ్యో రామా, నామాట వింటే ఇలా ఎందుకుండేదీ సంసారం.'

'ఊరుకోవే అమ్మా, అక్కొచ్చి అయిదు నిముషాలు కాలేదు. అప్పుడే మొదలా... ఎప్పుడూ వుండే భాగోతమేగా మనింట్లో.'

రఘు, రాణి నరాసరి పెరట్లోకి పరుగెత్తి జామ చెట్టు క్రింద చేరారు. గంటసేపట్లో అందరి భోజనాలు ముగిశాక మళ్ళీ ముందుగదిలో చేరారు.

ఎండ తీక్షణమైంది.

'ఏమేవ్, నేనొక కునుకు తీద్దామనుకున్నాను గాని, ఊళ్ళోకి వెళ్ళి రావాలి. భోంచేసి వస్తానని ఓ స్నేహితుడికి మాటిచ్చాను. వెళ్ళిరానా?'

'ఇంత ఎండలోనా ప్రయాణం . ఏమంత ముంచుకుపోయిందని'. భార్య అంది.

'నేను వస్తానని మాట ఇచ్చాను. అంతే. వెళ్ళి తీరవలసిందే. ఎండేగాని, వానే రానీ.'

'సరే మీ యిష్టం.'

'సరేగాని, ఎందుకైనా మంచిది, ఆ గొడుగిటువ్వు...'

భార్య గొడుగు తెచ్చి ఇచ్చింది.

'బాగానే వుంది. దీనికి కూడా నాతో పాటు జవసత్వాలు ఉడికి పోయాయి. చూడు. రెండుచువ్వలు ఊడిపోయి వ్రేలాడు తున్నాయి.'

'నాన్నా, పైన కూడా చినిగి పెద్ద కన్నం పడింది. బజారు వెడుతున్నారుగా, బాగుచేయించండి.' చిన్న కూతురు సలహా యిచ్చింది.

'సరేలేమ్మా, ఏదో ఓటి చేస్తాలే... ' అంటూ బట్టలు వేసుకుని, గొడుగు చేతబట్టి, బట్టతల సవరించుకుంటూ బయటకు నడిచారు సుబ్బారావుగారు.

'అక్కా, నువ్వయినా నాన్నకు చెప్పి ఒప్పించవే...' సరోజ బ్రతిమిలాడుతున్న ధోరణిలో అంది.

'ఏమిటే, నీ చదువు సంగతేనా. చదువుకుంటే బాగానే వుంటుందిమరి. కాని డబ్బు లేదంటున్నారుగా నాన్న.'

'అలా అయితే ఈ ఇంటర్ మాత్రం దేనికి చదివించినట్లు....' సరోజ కన్నుమంది.

'కుమార్తెు నెత్తిన ఒరగ బెడతారని గంపెడాశ పెట్టుకుని, సర్వం

ధారపోశారు మీ నాన్న. ఇప్పుడు తెలిసొచ్చిందా అని.

రాజకీయాలని జెప్పి ఆస్తిలో మూడు వంతులు కర్పూరంలా హరించుకు పోయింది. మిగిలిన దేమైనా వుంటే కుమారుళ్ల చదువు సంధ్యలకి స్వాహా అయింది. ఇంకా ఏముందని.... అంతా గుండమై ఎందుకట్టిలం మిగిలాము....' సుబ్బమ్మగారు ఆవేదన, దెప్పుళ్లు కలగలిపిన ప్రసంగం చేశారు.

'ఏం జరిగితేనేం, అంతాగట్టెక్కి దర్జాగా వుంటున్నారు. చిన్నదాన్ని నేనేగా, అన్ని విధాల అన్యాయమై పోయింది. అక్కా! ఇటు వినవే.... మొన్న నేమో, నేను మా ఫ్రెండ్స్‌తో కలసి పిక్నిక్‌కి వెడదామనుకున్నాను. వీళ్లేమో డబ్బు లేదు పొమ్మన్నారు.'

'అవునే తల్లీ. ప్రతి కుటుంబంలోను ఇంతే. కడగొట్టు వాళ్లకే అన్యాయం జరుగుతోంది. అన్నదమ్ములు సద్బుద్ధి గలవాళ్లయితే తోబుట్టువులను కూడా పైకి తేవడానికి ప్రయత్నిస్తారు. కాని ఈ రోజులు వేరు. స్వార్థం పెరిగిపోయె. పెళ్లాలొచ్చిన మరుక్షణమే వేరు కాపురం పెట్టి ఉడాయిస్తున్నారు. తల్లిదండ్రులు ఎలా వున్నారో పట్టించుకోరు కదా. ఇప్పుడు చూడు. మీ అక్కాయొచ్చిందా. ఎంత ఖర్చోమరి. మనకొచ్చే ఆదాయం ఏపాటిదో తెలియందేముంది. అమ్మాయ్ సరోజా ఇటువిను. నీవు పిక్నిక్ అంటే జ్ఞాపకం వచ్చింది. మీ పెద్దన్నయ్య కాలేజిలో చదివేప్పుడు ఓ సారి, తోటి కుర్రాళ్లతో కలసి దూర ప్రయాణం చేయవలసొచ్చింది......."

'అది ఎక్స్‌కర్షనమ్మా....' అంటూ పెద్దకూతురు తల్లికి జ్ఞాపకం చేసింది.

'ఏమో , అదే కాబోలు మరి.... అప్పుడు సమయానికి డబ్బులేదు. నేనన్నాను– ఎందుకులే మానుకోమనండి– అని. అప్పుడు మీ నాన్న బరాటాలు విసురుతూ 'నీకసలు చదువు– విజ్ఞానం అంటే తెలుసా అని. వాడు దేశం తిరిగితే ఎన్నో కొత్త విషయాలు తెలుస్తాయే. వెళ్లనీ' అని. పోనీలే, అన్నయ్య దేశం తిరిగొస్తాడు గదా సంతోషించి మీ అక్కయ్య గొలుసు, గాజులు తీసిచ్చింది. ఆ రోజుల్లో బంగారానికి ఇంత రేటెక్కడిది. అయినా చూడుమరి, మీ అన్నగారికి ఇప్పుడు ఏకోశానయినా విశ్వాసం వున్నదా అని. జాబు రాస్తే జవాబు కూడా ఇవ్వడా... అఁ.... అంతగా అహం పెరిగిపోయిందన్నమాట....' ఈ మాటలు అంటూనే, సుబ్బమ్మగారు, శాంత చేతిగాజులు చూచి.....

'ఏమే, గాజులు అలా వెల వెలపోతున్నాయేఁ...' అని అడిగారు. శాంత సమాధానం చెప్పలేదు. తల్లికి అనుమానం ఎక్కువైంది. కూతురును సమీపించి గాజులు పరీక్షగా చూసి, 'ఏమిటే, ఇవి గిల్టువా....' అని అనుమాన నివృత్తి కోసం అడిగింది.

శాంత తడబడుతూ, 'కాదులేవే ఊరుకో....'అంది కాని, తల్లి కళ్లలోకి సూటిగా చూడలేక పోయింది.

'అవునే అమ్మా, అక్కాయి దాస్తోంది. దీంట్లో ఏదో రహస్యం వుంది....' సరోజ రెట్టించింది.

'పెద్దమ్మాయ్ , ఇటుచూడు. చిన్నది చెబుతోంది నిజమేనా. గాజులేం చేశారు. అవసరానికెక్కడైనా తాకట్టుగానీ పెట్టారా?' తల్లి నిగ్గదీసింది. ఇక దాచడం వల్ల ప్రయోజనం లేదని శాంత నిజం చెప్పింది.

'అదికాదే. ఈ మధ్య పిల్లలకు సుస్తీలు చేశాయి. ఇంటి ఖర్చులు పెరిగాయి. ముఖ్యంగా, మా మరది వేణు చదువుకు డబ్బు కావలసొచ్చింది. డబ్బు సమయానికి అందలేదు. మీ అల్లుడు గారు, మామయ్య గారికి రెండు ఉత్తరాలు కూడా రాశారు. డబ్బు దొరకలేదని జవాబొచ్చింది. ఇక అద్దద్దా అంటి ఎవరిస్తారు. తర్వాత సర్దుకోవచ్చని గాజులు తీసి ఇమ్మన్నారు.'

'అయితే తాకట్టు పెట్టారా?' తల్లి ప్రశ్న.

'లేదు, అమ్మేశారు.'

'గొప్పపని చేశారు. ఏమో లేవే, అంతా మనఖర్మం. ఎదుగు బొదుగు లేని ఈ సంసారాలు ఎప్పుడు బాగుపడతాయో ఏమో. అయినా ఈ రోజుల్లో నీలాంటి వెర్రిమాలోకం ఎక్కడైనా వుంటుందా అని. ఎంత మరదైతే మాత్రం , వున్న కొద్ది పాటి బంగారాన్ని ఊడగొట్టు కుంటారా. పోనీలేవే....వ్రతం చెడ్డా ఫలం దక్కాలన్నట్టు మనమ్మాయి వారింటి కోడలైతే....'

'అమ్మా, అమాట మరోసారి అనకు...' కస్సుమంటూ లేచింది సరోజ.

'ఏమే, అంతకన్నా మంచి సంబంధం తెస్తారా మీ నాన్న. ఆ అబ్బాయి సలక్షణంగా చదువుకుంటున్నాడు. రేపో మాపో డిగ్రీ చేతిలో కొస్తే ఉద్యోగంలో ప్రవేశిస్తాడు. ఇక మేము కట్నాలు తెచ్చిపోయలేం తల్లీ.'

'అమ్మా, ఊరుకోండే... అన్ని మాటలు మీరే మాట్లాడుకుంటారేఁ, అవతలి వాళ్ల ఉద్దేశం తెలుసుకోకుండా....' శాంత ప్రశాంతంగా అంది.

'మీరు లక్ష అనుకోండి. నాకీసంబంధం యిష్టంలేదు. పెళ్లి కాకపోయినా పరవాలేదు. ఇలాగే వుంటాను.'

'సరోజా, తప్పు. అలా అనకూడదమ్మా. నీవు చిన్నదానివి. తెలీదు ఊరుకో..' మృదువుగా మందలించింది అక్కయ్య.

'అవునే, ఈ రోజుల్లో ఆడపిల్లలకి ఇదో ఫ్యాషనై పోయింది. సంబంధం ఇష్టం లేకపోతే అసలు పెళ్లే చేసుకోనని చెప్పడం.....' తల్లి ఖస్సుమంటూ లేచింది.

సరోజ ముఖం చిట్లించుకొని, అక్కడ నుంచి లేచి గదిలోకి వెళ్లి పోయింది. మంచం వాల్చి పడుకుంది. దీర్ఘమైన ఆలోచనలో పడింది ....

కనీసం డిగ్రీ కోర్సయినా పూర్తి చెయ్యాలనుకుంది. ఆ దీక్షతోనే శ్రద్ధగా చదివింది. కాని ఏం లాభం. చదువుకు 'స్వస్తి' చెప్పమంటున్నారు. పెద్దవాళ్లనే దేమున్నది. ఆర్థిక స్తోమతు లేకపోవడమే కారణం. ఖరీదైన దుస్తులు వేసుకోవాలని, నగలు పెట్టుకోవాలని, తనతో పాటు చదువుతున్న కొందరు అమ్మాయిల్లా అప్‌టు డేట్‌గా అలంకరించుకుని, టాయిలెట్స్‌లోను, ఫ్యాషన్స్‌లోను మునిగి తేలాలని ఎన్నడూ ఆశించలేదు. చేతిగాజులు మామూలువే. బట్టలు కూడా అతి సామాన్యమైనవి. మెడ బోసిగా లేకుండా ఓ పూసలదండ మాత్రం వేసుకుంది.

కోర్కెలనేవి ఎవరికి వుండవు. కాని ఆ కోర్కెలు వాస్తవ పరిస్థితులకు






# అంతరాలు – అంతర్యాలు

లొంగిపోతాయి.

జీవితంలో ఒక్కో అనుభవాన్ని పొందే కొలది. ఒక్కో కోర్కె దానంతట అదే నశించి పోతుంది.

కోర్కెల్ని చంపుకుంటే, అదే సుఖమయ జీవితమన్నాడు బుద్ధుడు. నిజమే– అసలు కోర్కెలంటూ లేకపోతే జీవితమే లేదేమో!?– బుద్ధుడు దేనికోసం చెప్పినప్పటికీ, ఆ సూక్తి ఈనాడు అసలు వర్తించదు. బుద్ధుని కాలంలో మనిషికి హృదయం అనేది వుండేదేమో! కాని ఈనాడు మాత్రం, మనిషికి హృదయం స్థానంలో వున్నది స్వార్థమే. ఇది అంతులేని స్వార్థం. దీన్ని అలంబనంగా చేసుకుని తీరని కోరికలు జిగిబిగిగా అల్లుకుపోయి, వాస్తవ పరిస్థితులనే ముళ్ళకంపలను, అగాధాలను, సుడిగుండాలను అధిగమించలేక, దగా–మోసం– కుట్ర– అవినీతి– దోపిడి– వంటి చీడపురుగులు చేరి మానవ హృదయాన్ని, మొత్తం సమాజాన్ని కుళ్ళుతో నింపేస్తున్నాయి. ఇలా– సవాలక్ష కోర్కెలున్న మనుష్యుల క్షుద్రమైన చర్యలు, నేరాలు, ఘోరాలు జరుగుతున్న ఈ విషవలయంలో కించిత్తు అనుభవమైనా లేని సరోజ కోర్కెలు ఏపాటివి?

సరోజ ఇంతవరకు చదువు గురించి ఆలోచించింది. ఇకమీదట వివాహం ఒక సమస్య కాబోతోంది. మళ్ళీ ఆలోచన. ... ఆలోచనలో ఆత్మ సంఘర్షణ....

'సరోజా! పెళ్ళంటే సంబరపడుతున్నావా? పొరపాటు. నిన్ను ముడిపెట్టేది బాధ్యతలతో .... కన్నీళ్ళతో .... తెలిసిందా!?' సరోజ మనసు హెచ్చరించింది.

'నేనేం తప్పు చేశానని కన్నీళ్ళు. నాకు స్వేచ్ఛ ఎందుకువుండదు?' సరోజ ఎదురు ప్రశ్న.

'అనుభవాలే అన్నీ చెబుతాయి ఇప్పుడు ఎంత తర్కించుకున్నా సమాధానాలు రావు...'

'నలకూబరుడు కావాలని కోరుకోనడం లేదు. ఐశ్వర్య వంతుడు రావాలన్న ఆశలేదు. సహధర్మ చారిణిగా, నాపట్ల సదా సానుభూతి చూపితే, అతడు సామాన్యుడైనా, నాకు పూజనీయుడే'. సరోజ అనుకుంది

'అలాజరగక పోతే....' మనసు మళ్ళీ ప్రశ్నించింది.

'ఎందుకు జరగదు?'

'అంతా అనుభవమే చెబుతుంది'.

'పోనీ, చెప్పనీ, ఆ అనుభవాలు అంత కర్కశంగా వుంటాయా. జీవితం దుర్భరం, దుస్సహం అవుతుందా. ఏమిటి నాకీ భయం. ఇప్పటి నుంచే ఈ ఆందోళన దేనికి? నా జీవితం నాకేబరువుగా వున్ననాడు నేను మాత్రం దేనికి?'

సరోజ కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి. పెదవులు కంపించాయి. అభం శుభం ఎరుగని, ఆ పిల్ల రాబోయే కష్టాల గురించి ఇప్పటి నుంచే ఆలోచిస్తోంది. ఎంత చిన్న వాళ్ళయినా, పరిస్థితులే అలా ఆలోచించేటట్లు చేస్తాయి కాబోలు.

కన్నీళ్ళు తుడుచుకుంది. తోబుట్టువులు. దీన వదనులైన తల్లిదండ్రులు తన కనుల ఎదుట కనిపించారు. అన్నీ విషయాలు తెలుసు కాబట్టి మరో సారి




ఆమె మనసు క్రుంగి పోయింది. భారంగా నిట్టూర్చింది.

ముందు గదిలో నుంచి అమ్మ, అక్కయ్యల సంభాషణ వినబడుతోంది.

'ఏమే, పెద్దమ్మాయి! మీ మరది ఉద్దేశం నీకేమైనా తెలుసా?' సుబ్బమ్మగారు సూటిగా ప్రశ్నించింది.

'నేను ముందే చెప్పానా.... వాళ్ళ ఉద్దేశమేమిటో తెలీదని. అయినా అతగాడి చూపులన్నీ నేలమీద వుండవు. గాలిలో మేడలు కడుతుంటాడు. ఎవరైనా సరే పది వేల కట్నమిస్తే చాలు చేసుకుంటాట్ట. అమ్మాయి అందంగా, నాజూగ్గా, తనకన్నా ఛాయగా వుండాలిట. ఇవన్నీ జరిగేదెప్పుడని అడగవే.... ఆ అబ్బి ఈ డిగ్రీ కోర్సు గడిచి గట్టెక్కి పై చదువులకు గాను, తల్లిదండ్రులు అంగీకరించినప్పుడు....'

'ఏదైతేనేంలే, మన సరోజ విషయం ఆ అబ్బాయి దగ్గర ఓ సారి ప్రస్తావించి చూడక పోయావూ....?'

'వృధాశ్రమ. నాకు తెలిసినంత వరకు అతడి నడిగినా, వాళ్ళ పెద్దవాళ్ల నడిగినా ప్రయోజనం వుండదనే.'

'అది సరేగాని, చిన్నది ఎందుకు వద్దంటున్నది. ఆ అబ్బాయి కురూపి కాదే.'

'అదేమి కాదు. దానికి మొదట్నించి అతనంటే ఏవగింపే. నిజానికి అతని బుద్ధులు కూడా సవ్యమైనవి కావు. మీ అల్లుడు గారు కూడా అప్పుడప్పుడు అంటుంటారు.... 'నంగనాచి వెధవ....' అని. అయినా, నాక్కూడా ఆ సంబంధం ఎందుకో ఇష్టం లేదమ్మా. ఆ తర్వాత మీ యిష్టం.

'ఆవిషయం అలావుంచు. మీ అన్నయ్యలు చూశావా ఎంత ఘటికులో.... ఇలా, శాంతని పురుడుకు తీసుకొస్తున్నాము. డబ్బు తప్పకుండా సర్దాలి, అని చెప్పి, మీ నాన్న ఉత్తరాలు రాశారు. ఇంత వరకు జవాబులేదు. ఊఁ.... వీళ్ళని గురించి ఏమనుకోవాలిట. అద్దాల్లో వుండగా బిడ్డలు గాని, గద్దాలొచ్చాకనా అన్నారు. ఎవరు చెబుతారమ్మా– బుద్ధనేది వాళ్ళ కుండాలిగాని. ఆడపిల్ల ఇంటికొచ్చినదంటే, కొందరిళ్ళలో ఎంత ఇదిగా చూసి పంపుతారు.'

'పోనీ లేవే, ఊరుకో. కొడుకుల సొమ్ము తినే ప్రాప్తి మీకూ లేదు. అన్నయ్యల అభిమానం పొందే అదృష్టం నాకూ లేదు. లోకం మారిపోయింది. ఏం చేస్తాం.'

'ఇప్పుడేమనుకుంటే ఏం లాభం తల్లీ, అంతా గుండమై పోయిన తర్వాత. సుక్షేత్రం లాంటి భూమి, దాన్నలా ధారాగతం చేశారు. పార్టీలని తిర్పుసి పనీ పాటు లేకుండా ఊళ్ళు తిరగడానికి డబ్బు చాలక, ఆ కాస్త భూమిని అమ్మేశారు. ఆ వచ్చే పంట కాస్తా సున్న చుట్టుకుంది. పోనీ ఆ ఇల్లయినా నిలబెట్టారా అంటే అదీలేదు. నిరక్షరాస్యతా నిర్మూలన అని తిర్పుసి, ఆయన గురువుగారు ప్రచారం చేసి, ఊరూరా బడి పెట్టాలని చెప్పారట. గురువుగారి ఆదేశం ప్రకారం, మన ఊళ్ళో బడి పెట్టడానికని, వున్న ఇంటిని కాస్త దానం చేశారు. అప్పుడే మొత్తుకున్నాను, ఇంత పిచ్చిపని చేయకండి, పిల్లలు ఎదిగొస్తారు, జాగ్రత్త పడక పోతే ఎలా అని. ఎంత చెప్పినా వింటేనా. తనమాటే తనది.'

'ఏమే పోయే నాడిదంతా కట్టుకు పోతామా. గాంధీగారి ధర్మ కర్తృత్వ సిద్ధాంతం నీకు తెలిసుండదులే. వూరుకో.... ' అంటూ ఇంట్లో రంకెలు వేసేవారు.

ఈ లోగా ఏమైంది.... మీ నాన్నను దత్తు చేసుకున్న గోవిందయ్య గారు హరి అన్నాతని బాబొచ్చింది. ఇక నేమి, అదో ఛాన్సు. వెంటనే బండెక్కారు మీనాన్న. గోవిందయ్య గారి ఆస్తి తాలూకు క్యాష్ పదివేలు. ఈ ఇల్లు వచ్చాయి. డబ్బు నిలుస్తుందా అదీ ఈ సంసారానికే ఖర్చయిపోయింది. ఇప్పుడు చూస్తే ఈ ఇల్లు తాకట్టులో వుంది.... అలాగని చెప్పి, మీ అన్నయ్యలను అనుకుంటే ఏం ప్రయోజనం. చేజేతులా చేసుకున్న తర్వాత.....'

'అవునమ్మా, మరి . ఎవరెవరో పెద్దనాయకులు మనింటికి వచ్చేవారటగా.... నిజమేనా?'

'అయ్యో తల్లీ, అదంతా ఓ భాగవతంలే. మనప్రాంతంలో మన ఊరుకోపెద్ద పేరు. ఏ నాయకుడు వచ్చినా మన ఇంట్లోనే మకాం. వారి అనుస్తలేవీ చెక్కు చెదరలేదుట. మనం మాత్రం ఇలాగుండమై పోయాము. ఇప్పుడేమో వాళ్ళు నాయకులయ్యారు. మీనాన్నగారిలా వున్నారు.'

'అదుగో, ఊరుకోవే.... నాన్నొస్తున్నారు....' అంది శాంత, తండ్రి రావడం చూచి.

(ఇంకా ఉంది)

# వాగ్గేయకారుల రచనలలో విఘ్నేశ్వరుడు

విఘ్న నాయకుడైన వినాయకుని పూజిస్తారు బక్తులు కార్యార్థం వెళ్ళేవారు విఘ్నాలు రాకూడదని గణేశుని ప్రార్థిస్తారు గణేశ చతుర్థినాడు కడవింటే చంద్రుని చూసిన దోషం పోతుందంటారు ప్రమద గణాలకి అదిపతియైన వినాయకునిసంగీత విద్వాంసులు కూడా ముందు **ఆయనపై రచనపాడి కచేరీ ప్రారంబిస్తారు**

**అందుకు అనుకూలంగా గణేశునిపై వివిద వాగ్గేయకారులు వివిధరచనలు చేశారు**

ముందు వాగ్గేయ**కారులలో** గుర్తుపెట్టుకొవలసిన వారు శ్రీ పురందరదాసు గారు ఆయన **నా**రదాంశం వలన జన్మించా రంటారు సంగీత విద్యార్థులకు ప్రాదమిక దశలో నేర్చుకోవడానికి అనువుగా సులబ శైలిలో రచనలు చేశారు అందులో బక్తిరస ప్రదానములైన గీతాలు ముఖ్యమైనవి ఆరంబ గీతాన్ని గణేశస్తుతితోనే రచించారు శ్రీ గణనాద సింధూరవర్ణ అని సిందూర వర్ణంలో విఘ్నేశ్వరుని స్తోత్రించారు ఇవి నిరాడంబరమైన రాగమాదుర్యంతో ఉండి పాడటానికి వినడానికి చక్కగా ఉంటాయి

దేవతా మూర్తులను కీర్తనలలో, కృతులలో స్తుతించిన వారిలో ప్రదమ స్థానం దీక్షితరు (ముత్తుస్వామి) వారిదే వీరు మధ్యమకాల సాహిత్యంలో రచనలు చెశారు సంగీతంలో పాండిత్యము గడించిన వారు తప్ప వీరి కీర్తనలను పాడలేరు దేవతామూర్తుల వర్ణన, పదముల కూర్పు పరిపుష్టిగా ఉండటంచే గాత్ర శుద్ధిగలవారే వానిని పాడగలరు గౌళ రాగంలో శ్రీ మహాగణపతి రవతు అనే కీర్తనలో సువర్ణాకర్షక విఘ్నరాజుని వర్ణించారు మధ్య మధ్య జతులు చేర్చారు ఇంక బహుళ ప్రజాదరణ పొందిన వాతాపి గణపతిం బజేహం అన్న కీర్తనలో వాతాపి గణపతిని వర్ణించారు ఈ రాగం హంసధ్వని శ్రీ దీక్షితరు తండ్రి రామస్వామి దీక్షితులవారు స్వయముగా రూపొందించారు విఘ్నేశ్వరునే కాదు కామాక్షిని, గ్రహములను (నవ) స్తోత్రిస్తూ కీర్తనలను రచించారు ఈయన రచనలు దేవతామూర్తులకే పరిమితం అందుకే సంగీతజ్ఞులు ముత్తుస్వామి దీక్షితరు గారి కీర్తనలతో సాదారణముగా గణేశ స్తోత్రం చేస్తారు

పల్లవి పాడటంలో వర్ణ రచనలో దిట్ట పల్లవి గోపాలయ్యరు వీరు వినాయకా నిను వినా బ్రోచుటకు అని హంసధ్వని రాగంలో (కృతి) రచించారు ఇది మంచి సంగతులతో ఉండి కచేరికి ముందు పాడటానికి వీలుగా ఉంటుంది రాగాలాపనకు నెరవుకు స్వరకల్పనకు అనువుగా రచింపబడింది ఇందులో చరణం సరసిరుహాస నాయుగ చరణా సవతం శ్రీ తజన సంకటహరణా అని అన్ని ఆటంకములను (ఆశ్రితులకు) తీర్చుమని వేడుకొన్నట్టుగా రచించారు గాయకుల బావప్రకటనా సామర్థ్యానికి పరీక్ష వంటిది రచన ఎన్ని కీర్తనలున్నా వినాయకుని వేడుకొనడానికి ఈ కీర్తనలో ఉన్నన్ని చక్కని పదములు సాహిత్యము వేరొక కీర్తనలో లేవు

శ్రీ త్యాగరాజుల వారు సంగీత త్రిమూర్తులలో ప్రత్యేకత కల్గిన వారు. నిధి చాలా సుఖమా అని పాడి. నిరాడంబర జీవనమంటే తన కిష్టమని వెల్లడించిన మహావ్యక్తి. పండితపామరులు ఆనందించడానికి వీలుగా వీరు కీర్తనలు రచించారు. జన్మత రామభక్తులైన వీరు కూడా గణేశుని తన రచనతో, గానంతో, వీణా వాయిద్యంతో సౌరాష్ట్ర రాగంలో కీర్తించారు. "శ్రీ గణపతిని సేవింపరారే" అన్న కీర్తనలో ఓ శ్రిత మానవులారా వాగాధిపతియైన గణపతి సుపూజలు చేకొని బాగా నటింపుచు వెడలినా" అని అర్థంతో కీర్తనరచించారు. ఇంక చరణం త్యాగరాజుగారు ఎంతటి వాగ్గేయకారులో చెబుతుంది. ఈ కీర్తన విళంబ కాలంలో రాగా, భావములను వ్యక్తం చేయడానికి రచించారు. చరణంలో ఎంత చక్కగా వర్ణించారో చూడండి.

"పనస నారికేళాది జంబూఫలము లారగించి,
ఘనతరంబుగను మహిపై పదములు ఘల్లుఘల్లున
నుంచి, అనయము హరిచరణ యుగములను హృద
యాంబుజమున నుంచి, వినయముగను త్యాగరాజ

"వాతాపి గణపతిం భజేహం"
ఫొటో ఎస్ తిరుమల రావు, హైదరాబాదు



# ధర్మపథం బ్రహ్మచర్యం




చతురాశ్రమాలలోనూ బ్రహ్మచర్యం మొదటిది ఆదివిద్యనభ్యసించే టప్పటిది వటువు గురువు వద్దకు వెళ్లి విద్యను అభ్యసించి, అది పూర్తి కాగానే గురువుగారి అనుమతిని పొంది రెండవదైన గృహస్థాశ్రమాన్ని స్వీకరించడం సంప్రదాయం అతడు వివాహం చేసుకుని సంసారాన్ని సాగిస్తూ అతిథులను, అభ్యాగతులను ఆదరించవలసి వుంది తాను విద్యను అభ్యసించే టప్పుడు విద్య పైనే గాని ఆహారాదులపై దృష్టి ఉంచడం ఉత్తమ శిష్యుని ధర్మం కాదు ఒక చిన్న ఉదాహరణ – గురువుగారి ఇంటిలోనే పుత్రుని వలె ఉండి విద్య నేర్చుకొంటున్న ఒక వటువు, గురువు గారి భార్య ఏది పెట్టినా తినేవాడు అతనికి తిండి మీద ధ్యాసంత లేదు ఆమె ప్రతిదినం నేతికి బదులుగా కొంచెం ఆముదమే వడ్డించేది ఆమె ఏమి వేసినదీ అతడు గమనించేవాడుకాడు ఇలా కొన్నేళ్ళు గడిచాయి ఒకనాడు అతడు గురుపత్ని ఆముదం అన్నంపై వెయ్యడం చూచి "నెయ్యి వెయ్యకుండా ఆముదమా వేస్తున్నారు?" అని ప్రశ్నించాడు గురువుగారికి ఆ సంగతి తెలిసి నాయనా! నీకు విద్య పూర్తి అయింది ఇక వెళ్లవచ్చు' అని పంపి వేశాడు ఆహారం బాగోగులు విచారించేవారికి విద్య మీద ఆసక్తి తగ్గిపోతుందని అంటారు విద్యార్థికి విద్య పైనే దృష్టి ఉండాలి అందులోనూ ఆత్మను గూర్చినదే అసలు విద్య అని మన ప్రాచీనుల అభిప్రాయం ఆ విద్యను అభ్యసిస్తేనే బ్రహ్మచర్యానికి సార్థకత్వం కలుగుతుంది

వివాహం చేసుకోకుండా ఉన్నవాడే బ్రహ్మచారి అనీ, వివాహానంతరం, అతనికి ఆ పేరుతో సంబంధం వుండదనీ చాలామంది అభిప్రాయం వివాహితులయినప్పటికీ, ఇంద్రియ సుఖాలకు లోనుగాకుండా, గృహస్థ ధర్మానికి దూరంగా ఉండి బ్రహ్మజిజ్ఞాస కోసమే తమ కాలం యావత్తూ ఉపయోగించేవారు బ్రహ్మచారులుగానే పరిగణింపబడతారు శ్రీరామకృష్ణ పరమహంస దీనికి దృష్టాంతం ప్రాచీన కాలంలో మహర్షులు సహధర్మచారిణిని స్వీకరించినా, బ్రహ్మచర్య నియమాలను అనుష్ఠించేవారు వారికి ఎన్నడూ ఇంద్రియ సుఖాల పయి ఆసక్తి ఉండేదికాదు

ఆత్మతత్త్వ విచారం పయి ఆసక్తి లేనివాడు వివాహం చేసుకోకపోయినా సరియైన బ్రహ్మచారికాడు అవివాహితునికి బ్రహ్మచారి అనే పేరు లోకంలోని వాడుకను బట్టి వచ్చినది మాత్రమే! బ్రహ్మచర్య వ్రతాన్ని ఆచరించేవారు, ఆధ్యాత్మికతత్త్వ జిజ్ఞాసువులు వివాహితు లయినా బ్రహ్మచారులనడం సముచితంగానే ఉంటుంది

— బులుసు వేంకటరమణయ్య

---

వినుతుడు వివిదగతుల దిత్తళంగుదికతొమని వెడితిన్

ఇలా శ్రీ త్యాగరాజుల వారు నాట్య గణపతిని మన కనులముందుంచారు గణేశునిపై ఇంత చక్కని రచన అరుదు ఇది పాడటం కూడా కష్టం

విఘరాజుని విద్యార్థులు, వ్యాపారులు, గృహస్థులు అందరూ ప్రతీ పనికీ ముందు పూజిస్తే నిరాటంకంగా ఆ పని జరుగుతుందని నమ్మకం ఇది ఎన్ని శతాబ్దముల నుండి అమలులో ఉందో పధ్నాలుగవ శతాబ్దములోని పురందరదాసు గారి గీత రచన మొదలు నేడు (సమకాలీన సంగీత సాహిత్యము) శ్రీ పి బి శ్రీనివాస్, శ్రీ రాజా సాయికృష్ణ యాచేంద్ర మొదలగు వారి రచనలలో కూడా చూడవచ్చును గాయకులే గాక దేమునిపై చక్కని రచనలు చేశారు శ్రీ పి బి శ్రీనివాస్, శ్రీమతి జానకి గానం చేయగా, శ్రీ యం రంగారావు స్వరపరచగా వీరి రచన ఎలుకపైన ఊరేగి ఎల్ల లోకముల తిరిగి అన్న విఘ్నేశ్వరునిపై వర్ణన, అది మధ్యమావతి రాగంలో కూర్చబడింది మధ్యమావతి పాడడం వలన అపస్వరాలు, తప్పులు క్షమింపబడతాయి అందుకే ఈనాటి గాయనీ గాయకులు, మధ్యమావతిలో, విఘ్నేశ్వరుని లలిత భక్తిభావంతో పైపాట పాడుకో వచ్చును

అలాగే రాజా శ్రీ సాయి కృష్ణయాచేంద్ర ఉదయ వేళలనిన్ను చేరితి సదయ హృదయ వినాయకా,

మధురగీతము ఆలపించెద నిదుర చాలు గణాధిపా

అని భూపాల రాగంతో యం రంగారావు స్వరపరచగా, శ్రీమతి సుశీల చక్కని గాత్రంలో శృతి పక్వంగా గానం చేయగా రచించారు

ఇలా విఘ్నేశ్వరుని ఆదునిక కాలంలో, నేటి నవీన నాగరిక యుగంలో కూడా ముందు పూజించి, గాయకులైతే గానం చేసి ప్రారంభిస్తున్నారు

ఏ దేవతా పూజకైనా, వ్రతానికైనా ముందు, పసుపుతో విఘ్నేశ్వరుని చేసి ఆవాహన చేసి పూజించిన పిమ్మటే, ఏదైనా చేస్తారు

వక్రతుండము, లంబోదరము, గజకర్ణములు, ఏకదంతము, విద్యకు, వివాహానికి, సర్వ కార్యములకు జయము కలుగ జేస్తాయి

– కె నాగేశ్వరి

# అత్తగారూ-శకునం

భానుమతీ రామకృష్ణ

సాధారణంగా ప్రతి మనిషికీ శకునం అనేది చాలా పట్టింపుతో కూడినవిషయం! పైకి బుకాయించినా లోలోపల నమ్మే శకున పక్షులున్నారు యీ కాలంలో గూడా!

పెద్దవాళ్ల పట్టింపు చూసిన అనుభవం వల్లగానీ, పాతకాలం వాళ్ల శకునాల పట్టింపుల కథలు వినడం వల్లగానీ, మోడరన్ జనరేషన్‌లో గూడా శకునాల ప్రభావం అక్కడక్కడా పని చేస్తూంటుందని నా నమ్మకం!



## యిక మరీ శకునానికే ప్రాముఖ్యం యిచ్చి చాదస్తంగా వుండడం మా అత్తగారి లాంటివాళ్లకు ఆదినుంచీ అలవాటు!

**మా అత్తగారు ఏ పనిమీదైనా, ఎవరింటి కెళ్లాలన్నా యింట్లోంచి కార్లో బయటికి బయలుదేరుతూ గేటు దాటకుండానే నన్ను ఒకసారి ఎదురుగా రమ్మనేవారు, కార్లో కూర్చుంటూ!**

అడిగి ఎదురు రమ్మన్నంత మాత్రాన అది శకునం ఎలా అవుతుందత్తా అంటే దానికి ఆమె మనసుకు తృప్తిగా వుంటుందే కాస్త సుమంగళి ఎదురుగా వచ్చిందని! అనేవారు! మరి కారు గేటు దాటి రోడ్డుమీద కెళ్లి మీరు ఏవైపు వెళతారో అటుగదా శకునం చూడాలి! అని మళ్లీ నేనంటే దానికామె

అదేం అడుగుతావు! యీ మద్రాసులో రోడ్డుమీద కెళ్లాక ఎదురుగా ఆడది కనిపిస్తే, అది దగ్గర కొచ్చిందాకా సుమంగళో కాదో గుర్తుపట్టి చావడం కష్టం! కాస్త శుభ్రంగా వుండేవాళ్లని కనుక్కోవచ్చు గాని మరి పనీ పాటా చేసుకొనే ఆడవాళ్ల మొఖాన లక్షణంగా యింత కుంకం వుండదు! అటువంటి వాళ్లు ఎదురొస్తే గుండె గతుక్కు మంటుంది! బాగా దగ్గర కొచ్చాక పరకాయించి చూస్తే మెళ్లో ఒక మురికితాడు కనిపిస్తుంది! హమ్మయ్య సుమంగళే మెళ్లో పుస్తెలాడుతుంది అని మనసు కుదటపడుతుంది! కాని ఈ తాడుకి పసుపు పండక్కి రాస్తారో ఏంపాడో నల్లగా, వాళ్ల ఒంటి రంగులో ఆ పుస్తెలితాడు రంగూ కలిసిపోయి వాళ్లు కారు పక్క కొచ్చిందాకా, కనిపించక గుండె దడదడలాడి పోతుందనుకో!అయినా సుమంగళి అనేది మొఖాన యింత బొట్టు పెట్టుకొని బయటికి అఘోరించ గూడదూ! అని మా అత్తగా రంటూంటే నేను నవ్వేదాన్ని!

కాని కాలక్రమేణా నాకు తెలీకుండానే మా అత్తగారి శకునాల చాదస్తం నాలో చాలా బలంగా నాటుకు పోయింది! యీ కాలం పిల్లలు నా చాదస్తానికి నవ్వేంతవరకూ నాకూ తెలీదు నేనెంత శకునపక్షినయ్యానో!

మొన్న నేను చాలా ముఖ్యమైన పనిమీద బయల్దేరాను హడావిడిగా కార్లో! తెలుగు దేశంలో వర్జ్యం చూస్తే మద్రాసులో తమిళుల యిన్ఫ్లుయన్స్‌వల్ల రాహుకాలం చూడడం అలవాటయి పోయింది! ఒకవైపు రాహుకాలం వచ్చేస్తోందనే భయంతో త్వరగా బయల్దేరడం, మరో వైపు గేటుదాటితే శకునం బెడద రెండు చాదస్తాల మధ్య ప్రతిరోజూ ఒకవిధమైన టెన్షన్ బిల్డప్ అయి ఒళ్లంతా కాస్త చెమటలు పట్టి మొఖం అంతా అదోలా అయిపోతుంది యిది బయటివాళ్ల కర్థంకాక 'ఏమిటండీ' ఏదో ఖంగారుగా వున్నారు! అంటూ మరి కాస్త ఇబ్బంది పెట్టడం లేని నవ్వు తెచ్చుకుని అబ్బే ఏం లేదు అర్జంట్‌గా వెళ్లాల్సి వుంది అని అసలు విషయం చెప్తే హాస్యాస్పదంగా వుంటుందనే భావనతో కప్పి పుచ్చడం వల్ల, మరి కాస్త టెన్షన్ ఎక్కువ కావడం, ఆ వచ్చినవాళ్లు ఎక్కడి కెళుతున్నారు!- అడగడం అది గూడా శకునానికి మంచిదికాదని మా అత్తగారు చెప్పేది అది విని ఒక్కసారి నీళ్లు కారిపోయి కుర్చీలో చతికిలపడి అడిగిన వాళ్లని నమిలి మింగేట్లు చూసి ఎక్కడికి లేదండి అలా బయటికి వెళ్లి రావాలని! అని కోపం దిగమింగుకుని చెప్పడం అలాగా! పదండి నేనూ వస్తాను అని ఆ వచ్చిన మనిషి అనడం అది శకునానికి మంచి మాట కాదని మా అత్తగారు చెప్పేవారు అది విని మరి దిగజారిపోయి సోఫాలో చేరబడడం, రాహుకాలం రానే రావడం!!- అది వెళ్లిందాకా కారువైపు పోకుండా కూర్చొనుండడం చూసి వచ్చిన గెస్టులు అదేమిటండీ అర్జంట్‌గా వెళ్లాలన్నారు అని అడగడం, అబ్బే రాహుకాలం గదండి మెల్లిగా వెళ్తాను అని వాళ్లతో స్వీట్ గా జవాబు చెప్పి ఆ అపశకున పక్షులకు కాఫీ గ్లాసు యిచ్చి బయల్దేరేసరికి మా వంటవాడు (వాడో శకునపక్షి) అమ్మా యిప్పుడు బయల్దేరారే యమగండం టైములో అనడం అది విని మళ్లీ



# అత్తగారూ – శకునం

ఒక్కసారి చప్పగా చల్లబడిపోయి రాహువుగాణ్ని తప్పించు కొన్నా యముడుగాడు వెంటపడకుండా మరొక ఒకటిన్నర గంట ఆగి బయల్దేరబోతే మళ్లీ ఎవరో గెస్టుతో టిలిపోన్లు రావడం, యివన్నీ అయ్యాక కార్లో కూర్చున్న తర్వాత డ్రైవర్ కోసం (టీ అంగడి నుండి అతను రావాలి') కాసేపు ఆగి అతను వచ్చాక కారు స్టార్ట్ చేస్తాడు' అసలు– మామూలుగా నేను కార్లో కూర్చుని డ్రైవర్‌తో స్ట్రిక్ట్‌గా చెప్తాను కారు గేటుదాటగానే నీ యిష్టం వచ్చినట్లు లెఫ్ట్ కో రైట్ కో తిప్పకో గేట్లోంచి నేరుగా కారు రోడ్డుమీదికి పోని ఎటు మంచిశకునం వుంటే ఆ వైపు తిప్పపో అని' పాపం డ్రైవర్ ముసలివాడు ముప్పయి ఏళ్లపైగా మా కార్ను నడుపుతున్నవాడు ' వెయ్యి దేవుళ్లకి మొక్కుకునే కార్లో కూర్చుంటాడు పాపం' మా గేటు కాస్త రోడ్డుమీది నుంచి లోపలి కుండడం వల్ల సగం కారు బయటికి పోతేనేగాని డ్రైవర్‌కి వీదిలో అటూ యిటూ వచ్చేవాళ్లు కనిపించరు' యీలోగా ఏ కారో, స్కూటరో సడన్ గా వస్తే మా కారు ముందుభాగానికి దెబ్బే' అదొక భయం డ్రైవర్‌కి'

ఒక్కోసారి నేను చెప్పినట్లు గేటుదాటి కారు నేరుగా రోడ్డు మీద ఆపుతాడు' అటూ యిటూ గూడా పిట్ట పురుగు కనిపించరు వీదిలో' ఏవైనా ఆవులూ, గేదెలూ, మేకలూ, కనిపిస్తాయి ఒక్కోసారి' అవి ఆవులైతే పర్వాలేదు శకునానికి కాని గేదెలూ దున్నపోతుల్లో గేదైనా కాస్త సర్దుకు పోవచ్చు కాని దున్నపోతు శకునానికి మంచిది కాదనేవారు మా అత్తగారు' ఎదురుగా వచ్చే గేదెల్లో ఏవి దున్నపోతులో ఎలా తెలుస్తుంది' అటువంటప్పుడు అవన్నీ మెల్లిగా 'మరో వైపుకి పోయిందాకా కారు ఆపి వెళ్లడమే'

నా శకునం చాదస్తానికి నాకే నవ్వొస్తుంటుంది' మా అత్తగారు నాకిచ్చి వెళ్లిన అమూల్యమైన కానుక' మా అత్తగారూ యిలాగే చేసేవారు' యివన్నీ ఆమె నుండి సంక్రమించినవే'

ఒకసారి మా ఆడబిడ్డ కూతురు పెళ్లికి గుడ్డలు కొంటానికి ఆడవాళ్లం అందరం కార్లో బయల్దేరాం' మామూలు ప్రకారం మా అత్తగారు కార్ను గేటుదాటి నేరుగా కాస్త ఆపమనేవారు' ఏవైపు శకునం బాగుంటే అటు తిప్పమనేవారు కారు' తను వెళ్లాల్సిన చోటు ఎడం పక్కవున్నా కుడి పక్కనుంచి కాస్త దూరం అయినా చుట్టు తిరిగి వెళ్లేవారు' ఆ రోజు పెళ్లి పని మీద బయల్దేరాం గనక కారు గేటుదాటి మామూలు ప్రకారం నేరుగా ఆగింది వీదిలో ఎడం పక్క యింటి గేట్లోంచి ఒక సుమంగళి రావడం కనిపించింది' మా అత్తగారు బ్రహ్మానందపడిపోయి కారు ఆ వైపుకి తిప్పమన్నారు' డ్రైవర్ కారు ఎడం పక్కకి తిప్పేయగా ఆ సుమంగళి ఏం మర్చిపోయిందో చటుక్కున వెనక్కి తిరిగి మళ్లీ

లోపలి కెళ్ళి పోయింది! అది చూసి మా అత్తగారి మనసు కాస్త చివుక్కుమన్నది! అయినా కార్లో మిగతా వాళ్ళందరూ ఎడం పక్కనుంచి వెళ్తే చాలా చుట్టు తిరిగి వెళ్ళాలి రైట్లో వెడదాం అన్నారు! సరే రైటుకి తిప్పరా కారు! అన్నారు మా అత్తగారు! యీలోగా నేను రైట్లో ఎవరొస్తున్నారో చూద్దామని వెనక్కి తిరిగి చూశాను! మా అత్తగారి వంటవాడు తిరువెంగళం పట్టె నామాల్తో చేతిలో కూరగాయల సంచి అరిటాకుల కట్టతో హడావిడిగా వస్తున్నాడు! నా గుండె ఆగినంత పనైంది! డ్రైవర్ కారు రివర్స్ చేసి తిప్పడంలో కారుకు వెనక వైపు వస్తున్న తిరువెంగళం మా అత్తగారి కంట పడలా! కాని అతను మా కారు గుర్తుపట్టి ముందు సీట్లో కూర్చున్న నన్ను చూశాడు! నేను నవ్వు ఆపుకొంటూ నా చేత్తో తిరువెంగళాన్ని పక్కకి వెళ్ళమని సౌంజ్ఞ చేశాను కనిపించకుండా! పక్కన మా కాంపౌండు గోడ తప్ప వాడు కనిపించకుండా తప్పుకోడానికి వేరే దారి లేదు! మా అత్తగారి శకునం చాదస్తం వాడికి బాగా తెలుసు! తను ఆమె కంటబడితే ఒంటి బ్రాహ్మడివి ఎదురుగా ఎట్లా వచ్చావురా! బుద్ధిలేదా! అంటూ చచ్చేట్లు చివాట్లు పెట్టి వాడి ప్రాణాలు తోడేస్తుంది! గాబరాలో వాడికి ముచ్చెమటలు పోసి ఏమి తోచక చటుక్కున మా కాంపౌండు గోడ చివర్లో మా ఇళ్ళల్లో చెత్తంతాపోసే కార్పొరేషన్ చెత్త డ్రమ్ములోకి కూరల సంచితో సహా ఒక్క దూకు దూకాడు! కారు రైటుకి తిరిగింది నాకు నవ్వాగలేదు డ్రైవర్‌కి నవ్వొచ్చి ఆపుకొన్నాడు!

ఆ సమయానికి వీధిలో రైటు సైడు శకునం ఎవ్వరూ కనిపించనందుకు అసంతృప్తి గలిగిన మా అత్తగారు నిట్టూరుస్తూ పోనీవయ్యా కారు ఏ శకునమూ లేదు నా తలకాయ అంటూ విసుక్కున్నారు! కారు పది అడుగులు పోయిందో లేదో మా ఆఫీసులో పని చేసే వైద్యనాద అయ్యరు ముచ్చటగా మూడు విభూతి పట్టెలు నుదిటి మీద తళతళలాడుతూంటే గొడుగు వేసుకొని దర్జాగా నడిచి రావడం నా కంటపడ్డాది! కొంప మునిగింది! డ్రైవర్‌కి గుండె గతుక్కుమని నా వైపు చూశాడు నా తల అడ్డంగా వున్నందువల్ల వెనక సీట్లోవున్న మా అత్తగారికి దూరంగా వస్తున్న వైద్యనాద అయ్యరు కనిపించ లేదు! పైగా ఏదో మాట్లాడుతూంది కొనబోయే వస్తువుల్ని గురించి! బ్రతికిపోయాననుకుని కారు కాస్త ముందుకు పోతూనే నేను తలకాస్త బయట పెట్టి వైద్యనాదయ్యర్ని ఆ పక్కనే వున్న యింటి గేట్లోకి పొమ్మని సైగ చేశాను మా కార్నీ నన్నూ చూసిన అయ్యరు చటుక్కున గ్రహించి తక్షణం పక్కనేవున్న మార్వాడీవాళ్ళ గేట్లోకి ఒక్క లాంగ్ జంప్ చేసి మాయమైనాడు!

ఆ గేటుమీద బివేర్ ఆఫ్ డాగ్స్ అని బోర్డు కనిపించింది వెంటనే ఆ యింట్లో గోలగోలగా కుక్కలు రెండు అరవడం వినిపించింది! పాపం అయ్యరు ఏమైనాడో అని ఒకవైపు మనసులో బాధ.



బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రోటీన్లు కలిగియుండి క్రొవ్వు పదార్థములు లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని ముద్దగా కాకపోవటమే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన, నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.

## బాంబినో హల్వా

1 కప్పు బాంబినోని నేతిలో ముదుర రంగు వచ్చేదాక వేయించి, ప్రక్కన పెట్టుకోండి. మూడు కప్పుల నీళ్ళను మరగించి, బాంబినో కలిపి మూత పెట్టండి. దీనిని తక్కువ మంట మీద నీరు పూర్తిగా ఇంకేదాక ఉంచండి. మూడు చంచాల పంచదార కలిపి 2 నిమిషాలు కలపండి. రుచికి పిస్తా, జీడిపప్పు చేర్చి వేడిగా వడ్డించండి. ఇది నలుగురికి సరిపోతుంది.

# రుచిలో కమ్మదనం
# ఖర్చులో పొదుపుతనం
# అదే బాంబినో గొప్పతనం

**ఉచితం**

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం, ప్రతి బాంబినో డీలరు వద్ద.




## వెర్మిసెల్లిని




తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!

associated/85-1

# ఇ'వేమన'పద్యాలు







## అత్తగారూ – శకునం

అతను బంగారుగా గొడుగు ముఖానికి అడ్డు పెట్టుకొని పక్కగేట్లోకి ఒక్క లాంగ్ జంప్ చేసి వెళ్లడం తల్చుకుని నవ్వుతూ ముందు వస్తున్న వూరేగింపు నాకంట బడలా! ముందు పెద్ద ఏనుగూ, వెనక మంగళ వాద్యాలతో ఏదో దేవుడి వూరేగింపు రావడం ముందు మా అత్తగారి కంటే పడ్డది వీది మలుపు తిరిగేప్పుడు!

ఆహా! ఆహా!! ఏం శకునమే! యింతవరకూ ఎవరూ రాలేదని బాధపడ్డానే పిచ్చిముండని! ఆ దేవుడు ఎంతో మంచి శకునం పంపించాడే! ముందుగా ఏనుగు! ఆహా! అసలు శకునాల్లోనే తలమానికం ఏనుగు రావడం! ఆ వెనక దేవుడి వూరేగింపు!అద్భుతంగా అమిరిందే శకునం ఆ వినాయకుడే సాక్షాత్తూ బయల్దేరి వస్తున్నాడే వచ్చేది వినాయక చవితి గదా! నాయనా నీకు నూటొక్క ఉండ్రాళ్ళు చేస్తాను నీకు నూటొక్క టెంకాయలు కొడతాను ఏడుకొండల వాడా! పెళ్ళి కాగానే అందరం నీ కొండ కొస్తాం! చూశావటే యిల్లు బయలు దేరగానే మొదటి శకునం ఎంత శుభంగా వుందో! యిల్లాంటి శకునం దొరకడం అపరూపం! తెలుసా! అని ఆమె సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బైపోతూంటే ముందు వచ్చిన రెండు అపశకునాల్ని దాచిన నేను కాస్త గిల్టీగా అనీజీగా ఫీలవుతూ ఒక పొడినవ్వుతో నేనూ తెచ్చిపెట్టుకొన్న సంతోషం ప్రదర్శించక తప్పలేదు!

వారం రోజుల్లో జరగబోయే ఆ పెళ్ళికి మా అత్తగారు ఆర్డరిచ్చిన పెళ్లి నగలూ మంగళసూత్రాలూ వగైరా తీసుకోడానికి మేము వెళ్లిన నగల షాపు మూసివుంది ఆ షాపు యజమానికి సడన్‌గా ఆరోగ్యం బాగాలేక ఆస్పత్రిలో చేర్చారట! అతని ఆరోగ్య పరిస్థితి తెలిసేదాకా కొట్టు తెరవరట! అది విన్న మేమందరం ఒక్కసారిగా చప్పగా చల్లబడిపోయాం ఆ పరిస్థితిలో మా అత్తగారి మొహం చూట్టం బావుండదని పక్కకి తిప్పుకున్నాను! దూరాన్నుంచి ఏనుగు వూరేగింపు మా వైపే మళ్లీ ఒస్తోంది! మా అత్తగారు ఆ వైపుకూడా చూడకుండా ఏంటో మంచి శకునం వచ్చిందని మురిసి పోయాను! అని విసుగ్గా గొణుక్కుంటూ కార్లో కూర్చున్నారు మా అత్తగారు!

నాకు మాత్రం యీ బ్రేకు మొదటి అపశకునాల ప్రభావమేనని గట్టి నమ్మకం కలిగింది ఆ తర్వాత ఏనుగూ దేవుడూ మంచి శకునమే మా అత్తగారు చెప్పినట్లు శకునాల్లోనే చాలా శుభ శకునం గనక ఆ ఏనుగు ప్రభావం అల్టిమేట్‌గా మంచి చేస్తుందనే నమ్మకంతో దేవుడికి నేను మొక్కుకొన్నాను అంతా నిర్విఘ్నంగా జరగాలని వినాయకుడికి దణ్ణం పెట్టాను

ఆశ్చర్యం ఏమిటంటే- మర్నాడే ఆ నగల షాపునుండి ఫోను వచ్చింది మా అత్తగారికి!ఆర్డరిచ్చిన నగలన్నీ రెడీగా వున్నాయనీ హాస్పిటల్లో చేర్చిన యజమాని కూడా ఆరోగ్యంగానే యింటి కొచ్చాడనీ, చెప్పారు అది విన్న మా అత్తగారు నేను చెప్పానుగదే ఆ ఏనుగు సాక్షాత్తూ వినాయకుడేననీ ఆ తిరుపతి వెంకన్న నా కోసమే బయల్దేరి వచ్చాడనీ కాకపోతే మొదట్లో ఎడం పక్క కారు తిప్పినప్పుడు ఆ పక్కింటి సుమంగళి వచ్చి తిరిగి వెనక్కి వెళ్లడం యీ కాస్త తాత్కాలిక చికాకు కలిగించింది! అంటూ మా అత్తగారు మామూలు త్రికాల జ్ఞానంతో వ్యాఖ్యానించారు!

మరి వంటవాడు తిరువేంగళం మేనేజరు వైద్యనాద అయ్యరు వాళ్ల శకునం సంగతి ఆమెకి తెలిస్తే !

ఏది ఏమైనా ఏనుగు రూపంలో వినాయకుడూ వూరేగింపులో నామాల వెంకన్నా పెళ్లి ముత్తానికి జరిపించేశారు

**ఆ తర్వాత మా అత్తగారికి నిజం చెప్పకుండా వుండలేకపోయాం! అది వేరే సంగతి! శ్రీవిఘ్నేశ్వరా!**





# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## సురేష్ చిత్రాలు

డి. రామానాయుడు నిర్మించే 22వ చిత్రంలో శరత్‌బాబు, శారద, అర్జున్, రజని అధిగాగలవారు పాల్గొంటారు. బి. గోపాల్ దర్శకుడు. చక్రవర్తి సంగీత దర్శకుడు. 23వ చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి నాయకా నాయికలు. కె. మురళీమోహనరావు దర్శకుడు. కె. రాఘవేంద్రరావు




దర్శకత్వం నెఱపే 24వ చిత్రంలో కృష్ణ హీరో. సురేష్ ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్ తొలి చిత్రంలో ఎ. ఎన్. ఆర్., సుహాసిని నాయకా నాయికలు. వి. మధుసూదనరావు దర్శకుడు. డి. సురేష్‌బాబు నిర్మించే సురేష్ ఎంటర్ ప్రైసెస్ చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి నాయకా నాయికలు. కె. రా యి్య దర కుడు

## శ్రీ వాణీ సినీ ఆర్ట్స్ చిత్రంలో "లేడీ జేమ్స్‌బాండ్"గా స్మిత

"మా పిక్చర్లన్నిటికి కైలాసకోనలో ప్రారంభోత్సవం జరపడం ఆనవాయితీ కదా? అదే విధంగా అక్కడ ఆగస్ట్ 14న కొత్త చిత్రం 'లేడీ జేమ్స్‌బాండ్"కి పూజ జరిపి, ఆగస్ట్ 15న మహాబలిపురం దగ్గరున్న 'గోల్డన్ బీచ్'లో షూటింగ్ ప్రారంభించాం. ఆగస్ట్ 25 వరకు తొలి షెడ్యూల్ జరిపాం. సెప్టెంబర్ 5 నుంచి 25, అక్టోబర్ 1 నుంచి 15 వరకు జరిగే తదుపరి షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. స్మితకు ఇది వెరైటీ కేరెక్టర్. ప్రముఖ నటీనటులందరూ కూడా ఉంటారు." అన్నారు ఎన్. వి ఎ )రాజు ఈయన కథ మర్పణలో

చ ంద్రశేఖర రెడి ( ్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహి చే ౖ న్స్ త్రిల ర్‌కు కొంపెల్ల విశ్వం బాషా లకర రాజా కోటి స్వరకల్పనలో వేటూరి అ ఎ్రాచార్య గి తాలు రాశారు. రాజా ఛాయ, నళొభల శిల్పం, గౌ అంరాజు కూర్పు, మోహన్ రెడ్డి– రత్నారావు ప్రొడక్షన్, ఎన్. బంగార్రాజు నిర్వహణతో పి. ఎస్. రంగనాథవర్మ, బి. అచ్యుతరామరాజు నిర్మాతలు.

## శోభన్‌బాబు "డ్రైవర్‌బాబు"గా నూతన సంస్థ చిత్రం

అన్ని వర్గాల ప్రేక్షకులనూ ఆకట్టుకునే ఉత్తమ విలువలుగల చక్కని చిత్రాలను అందించాలనే ధ్యేయంతో నెలకొల్పబడిన సంస్థ శ్రీకృష్ణ ప్రసన్న ఎంటర్‌ప్రైసెస్. దీని అధినేత బి. వి. ఎల్. ఎస్. ప్రసాద్. ఈయన తొలి చిత్రంలో హిట్ హీరో శోభన్‌బాబు, డ్రీమ్ క్వీన్ రాధ నాయకా నాయికలు. సత్యనారాయణ, ప్రభాకర రెడ్డి, గుమ్మడి, రాజేష్, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, రాజ్యలక్ష్మి, తులసి పాత్రధారులు . సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, పి. సురేష్ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, సలీమ్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, శ్రీనివాసరావు సహకార దర్శకత్వం, ఎన్. ఎ. ప్రసాద్ ప్రొడక్షన్‌తో బి. తిమ్మరాజు, బి. రామారావు సహ నిర్మాతలు. "పాత్రధారులందరి ప్రతిభను వెలికి తెచ్చే పటిష్టమైన కథ. సెప్టెంబర్ 9 నుంచి 20 , అక్టోబర్ 1 నుంచి 7, నవంబర్ 15 నుంచి 31 వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు.

## విజయదుర్గ సినీ ప్రొడక్షన్స్ చిత్రం

"డి.వి. నరసరాజు సంభాషణలు విశేషాకర్షణ," అన్నారు పై సంస్థ అధినేత విజయకుమార్. ఈయన నిర్మాతగా ఎన్. నరసింహారావు సమర్పించే చిత్రానికి వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, సభాపతి ఛాయ, కళై శిల్పం, జి. ఆర్. అనిల్‌మల్నాడ్ కూర్పు, జగ్గారావు నిర్మాణ సారథ్యంతో ఎం. డి. ఎం. ప్రసాద్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. కాకర్ల సత్యనారాయణ (చిన్ని) సహ నిర్మాత. ఈ చిత్రంలో మురళి హీరో. "సెప్టెంబర్‌లో సాంగ్స్ రికార్డవుతాయి. విశాఖపట్టణం పరిసరాలలో అక్టోబర్ , నవంబర్ నెలల్లో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే మణివణ్ణన్.

## శ్రీ సారథీ స్టుడియోస్ చిత్రాలు

పి. శశిభూషణ్ నిర్మించే పై సంస్థ 18వ చిత్రంలో రాధిక, శరత్‌బాబు నాయికా నాయకులు. జంధ్యాల దర్శకుడు. 19వ చిత్రంలో సుహాసిని నాయిక. ఈ రెండు చిత్రాలకూ ఎస్. గోపాలరెడ్డి ఛాయాగ్రాహకుడు.

(68 పేజీ చూడండి)



“మాయాజాలం”3డి లో రజని



# వినాయకచవితి విశేషం

## గొల్లపూడి/మారుతీరావు ద్విపాత్రాభినయం

భాగ్యలక్ష్మి సంహాపురి సంహం చిత్రాలలో ద్విపాత్రలు నిర్వహించిన గొల్లపూడి మారుతీరావు ఇప్పుడు నాపేరే దుర్గ చిత్రంలో ద్విపాత్రాభినయం చేస్తున్నారు సినిమాలలోనే తప్ప నిజజీవితంలో నటించడం తెలియని గొల్లపూడి ఒక వేళ వినాయక చవితి నాడు నిజజీవితంలోనూ ద్విపాత్రలు దరిస్తే !

ఒక చిత్రం ప్రారంభోత్సవానికి వెళ్ళొచ్చి తాపీగా ఇంటి దగ్గర కూర్చొని పేపర్ తిరగేస్తున్న మారుతీరావు దగ్గరికి గొల్లపూడి వచ్చాడు ఒకసారి గొంతు సవరించుకున్నాడు )

గొల్ల గుడ్ మార్నింగ్!

మారు తెలుగులో ఎడవలేవూ? ఎప్పుడూ ఇంగ్లిషు ముక్కలూ నువ్వూనూ ఎమిటిలా తగలడావ్

గొల్ల అప్పుడే మరచిపోయావా ఇప్పుడే వినాయకుడికి కొబ్బరికాయి కొట్టి వచ్చావు ఇవాళ వినాయక చవితి

మారు వినాయక చవితి కాకపోయినా ప్రారంభోత్సవం నాడు కొబ్బరికాయ కొడతాం వినాయక చవితి అయితే ఎమిటి

గొల్ల తెలిసి కూడా పూజ లేకుండా కూర్చున్నావా శుంఠా!

మారు శుంఠా అని నాకు పూజ మొదలెడుతున్నావా ఎప్పుడో చిన్నప్పుడు చేసే వాడ్ని పూజ

గొల్ల ఇప్పుడు పెద వాడి వయిపోయా ననుకుంటున్నావా

మారు వయస్సులో నయ్యా బాబూ! అయినా మా ఆవిడ రోజూ పూజలు చేస్తూంటుంది పూజ గదిలో వినాయకుడు కూడా ఉన్నాడు

గొల్ల ఉంటాడు ఆ దిమావల్లే నువ్విలా బొరవిరుచుకు తిరుగుతున్నావు ఆవిడ పూజవల్లే నువ్వి స తికి వచ్చావు

**మారు అందరితో ఇదే చిక్కు మంచి జరిగితే అది పెళ్ళాల మహత్యం చెడు జరిగితే అది మొగుళ్ళ సైత్యం**

**గొల్ల ఏమయినా నువ్వు ఇంట్లో రామయ్యా వీధిలో కృష్ణయ్యవి కదా?**

**మారు అయ్యయ్యో అది సినిమాలో నయ్యా మహానుభావా! నా కాపరం చెడగొట్టకు నేను ఇంట్లో వీధిలో సందులో గొందులో రైల్లో బస్సులో - అన్ని చోట్లా రామయ్యనే**

గొల్ల వినాయకుడివి మాత్రం కాదు

మారు అవాలనే కోరిక మనస్సులో లేకపోలేదు సుమా ఆయిన లాగా ఎప్పుగా మెక్కాలని ఉంది



కాని నాకు వాశిగల తిండి ఇష్టంకాని రాశిలో పూజం ఆయినలాగా చిన్న బొజ మిద మోజు మరి నేను ఎలక్ట్రిక్ స్తంభంలాగ ఉంటాను కదా! అందుకే దేవుళ్ళలో వినాయికుడంటే నాకు ఇష్టం నాకు లేనివి ఉండాలని ఆశించేవి ఆయినకున్నాయి గనక

గొల్ల మరి ఆయనకిద్దరు పెళ్ళాలున్నారు

మారు నాకు మాత్రం ఒక్కరే ఆ విషయంలో దేవుళ్ళతో పోటీ ఎడలేం ఎడాలనే కోరికాలేదు

గొల్ల నీకో విషయం తెలుసా నీ జాతకం రీత్యా ఇప్పుడు దశాదిపతి గణపతి నీపై ఆయన కటాక్షం ఉండడం వల్లే నేడు ఆర్టిస్ట్‌గా ఇంత బిజీగా ఉన్నావు

మారు ఇదిగో– మళ్ళీ ఇది నాకు నచ్చదు గొప్పతనానికి పెళ్ళాలూ దేవుళ్ళూ పూజలూ దశలూ జాతకాలూ కారణమంటే ఒప్పుకోను అవన్నిటికీ తోడు స్వయం కృషి ఎంతో కొంత ప్రతిభా క్రమశిక్షణా – ఇవి నాలో లేవంటావా

గొల్ల ఉన్నా అవన్నీ బయటకు చెప్పుకో కూడదయ్యా మొగుడా! ప్రతిభ ఉందనుకుంటే వినయం అవుతుంది ఉందని చెప్తే అహంకారం అవుతుంది

మారు రాతగాడి బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు ఇక్కడా కొటేషన్లూ సినిమా డైలాగ్‌లూ మొదలెట్టావు

గొల్ల మాట మార్చకు ఇంతకీ వినాయికుడంటే చిన్నప్పుడు భక్తి ఉండేది ఇప్పుడు లేదంటావ్

మారు నువ్వెక్కడ దొరికావయ్యా – చెప్పిన మాట మార్చేస్తున్నావు చిన్నప్పుడు పూజ చేసేవాణ్ని ఇప్పుడు లేదు అలాగని భక్తి లేక కాదు ఆ రోజుల్లో భక్తి ఉండ్రాళ్ళ మీద పండగ శెలవులు మీద ఉండేది మరో రహస్యం పండగనాడు ఉదయంఆట సినిమాకి మా నాన్నగారిని మూడణాలు అడిగి నాడియా – జాన్ కె వాస్ సినిమాకు పారిపోయేవాణ్ని చిన్నతనంలో వినాయకచవితి అంటే – నాడియా చిత్రాలు రోడ్లమీద ఎల్లేరుకాయలు చల్లి నలుగురి చేత తిట్లు తినడం సరదా

గొల్ల ఇప్పుడు తింటున్నావుగా

మారు ఇప్పుడా! ఎవరు నన్ను తిట్టేది?

గొల్ల తెల్లారి లేస్తే వెదవ్వేషాలు వేస్తున్నావు సినిమాల్లో మానభంగాలూ హత్యలూ దోపిడీలూ చేయిస్తున్నావు హీరోలు హీరోయిన్‌లు చెడ తిట్లు తిడుతున్నారు చూసే ప్రేక్షకులు వాళ్ళ వాళ్ళ హీరోలను నువ్వు పెట్టే బాధల్ని చూసి నిన్ను తిడుతున్నారు

మారు నిజమేనయ్యోవ్ ఆ లెక్కన నాకు రోజూ వినాయకచవితే!

గొల్ల మరి చవితి చంద్రుడ్ని చూసిన నీలాపనిందలు ఎప్పుడైనా పడ్డావా?

మారు ఎప్పుడూ పడుతున్నాను బాబూ! ఇందాక నువ్వేగా అన్నావు నేను ఇంట్లో రామయ్య – వీధిలో కృష్ణయ్యనని? అలాగే కొందరైనా తెలుగుదేశంలో నేను దుర్మార్గుడ్నని అనుకోరంటావ్

గొల్ల తెలుగు ప్రేక్షకులు అంత దద్దమ్మలు కాదోయ్! చెడ వేషం వేసిన వాళ్ళందరూ చెడ వాళ్ళు కానక్కరలేదని వాళ్ళకి తెలుసు

మారు అయితే అది కొంత మేలు తెర మీద తిట్లు తింటూ బాగా తిట్లు తిన్నాడయ్యా అనిపించి ప్రేక్షకుల మెప్పు పొందడం కత్తిమీద సాము అది నేను సాధించానని నువ్వనుకుంటే నాకు గర్వం

గొల్ల అంటే నేను నిన్ను పొగడాలంటావు

మారు మీ వినాయికుడికి పొగడ్తలంటే ఇష్టం కదూ

గొల్ల ఆయన దేవుడు నువ్వు సాదా నటుడివి

మారు నటన వాళ్ళ నాన్నగారు – అంటే నటరాజు అంశ

గొల్ల సరే ఒప్పుకున్నాను కాని నీ మీద ఒక అపవాదు దాన్ని అపవాదు అందామా

మారు ఏమిటి




గొల్ల సినిమాల్లో నీ పాత్రలకి డైలాగ్‌లు నువ్వే రాసుకుంటావని

మారు అంటే మిగతా రచయితలు అంత చచ్చు దద్దమ్మలనా నీ ఉద్దేశ్యం

గొల్ల అని నేనలేదు

మారు నా బాబుల్లాగ రాసేవాళ్ళున్నారు మారుతీరావు ఎలాంటి డైలాగులు చెప్తే బాగుంటుందో తూకం వేసి తూటాల్లాగ రాసే వారున్నారు రచయితని గనక నా బిగువు కోసం అక్కడా ఇక్కడా చెయ్యి పెడతానేమో గాని పూర్తిగా రాసుకొంటానంటే అది నీలాపనిందే 1982లో చవితినాడు చంద్రుడ్ని చూశానన్న మాట

గొల్ల 1982లో అంటావేంటి?

మారు ఆ సంవత్సరంలో కదా నేను నటుడ్నయింది?

గొల్ల ఈ మూడేళ్ళలో ఎన్ని సినిమాల్లో నటించావయ్యా

మారు డెబ్భయ్‌పైన

గొల్ల అందులో గుర్తించుకునేవి పాతికైనా ఉన్నాయా

మారు పైనే ఉన్నాయి ఈ మధ్య వినాయకుడి ముందు నిలబడి జయమాలినిని పెళ్ళి చేసుకున్నాను

గొల్ల ఇదేమిటి మళ్ళీ

మారు కంగారుపడకు సినిమాలో నేలే వినాయకుడి మీద నా భక్తిని చెప్పడానికి ఇది ఉదహరించానంతే

గొల్ల ఈ సినిమా భక్తిని అలా ఉంచి వినాయకచవితినాడు భక్తిగా పూజ చెయ్యడం మళ్ళీ ప్రారంభించు కనీసం మీ ఆవిడ పూజ చేస్తుండగా పక్కనయినా కూర్చో అసలే సినిమా బ్రతుకు నీలాపనిందలు తిట్లు ఎవరికీ తప్పవు తప్పించేది ఆ వినాయకుడు ఒక్కడేనని మరిచిపోకు

మారు పండగపూట వచ్చి పరోక్షంగా నాకు తిట్లు సమర్పించుకుంటున్నావా స్వామీ? అలాగే లెంపలేసుకొని మా ఆవిడ కొంగు పట్టుకుని మరి పూజ చేస్తానని హామీ ఇస్తున్నాను ఇంక వెళ్ళిరా!

గొల్ల నమో వినాయకాయ

మారు అలాగే కానియ్

(సమర్పణ జి వి జి)

సమృద్ధ పరిమళము
సరియైన ధరతో

ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు




"గులాబి మఱియు ఆకుపచ్చ రంగులలో లభించును"





జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2106 Tel

## శ్రీవారు తో పాఠాలు

బాలు (శోభన్‌బాబు) ఆఫీసుకు బయలుదేరబోయాడు అతనితో పాటు గాయత్రి (విజయశాంతి), [illegible] [illegible] బాలు మందహాసంతో "ఏయ్! నువ్వెక్కడికి?" అన్నాడు.

"మీ అడుగు జాడల్లో నడవడానికి," అంటూ గాయత్రి. అతని కోటుకు గులాబీ పువ్వు తగిలించింది. బాలు సైకిల్ స్టాండ్ తీసేసరికి "ఇంత పెద్ద ఇంజనీర్ గారికి సైకిలా?" అంది.

"అఫ్‌కోర్స్! మానాన్నగారు ఓ పెద్ద టాంగా కొంటానన్నారనుకో. గుర్రాలు ఎన్ని ఉండాలన్న తగాదా వచ్చి, మానేశాం!"

"అన్నిటికీ వేళాకోళమేనా?"

"చూడు, గాయత్రీ! సైకిల్ ఇబ్బందని నాకెప్పుడూ అనిపించలేదు. నీకూ అనిపించదు. రా....కూర్చో!"

"నేనా! అమ్మో! భయం".

"భయం కాదు, చులకన. ఎందుకో తెలుసా? సైకిల్ పేదవాడి వాహనం గనుక."

"అబ్బ! అన్నిటికీ అంతస్తులని కెలకడం మీకు దురలవాటండీ..... అలవాటు లేదు గనుక నాకు భయం."

# సినిమా విశేషాలు

-జి.వి.జి.

"ఎక్సైక్టిస్..... ఒక్కసారి ఎక్కితే భయం ఆదే పోతుంది. లేని గొప్పసంతోషాలకి ఎగబడడం కన్నా – ఉన్న చిన్న సంతోషాలతో సరిపెట్టుకు పోవడం ఈ జీవితం నేర్పే మొదటిపాఠం."

గాయత్రి క్రీగంట చూస్తూ, "ఇది తమరు నాకు నేర్పే రెండో పాఠం. పెళ్ళాన్ని కాపాడే బాధ్యత మీదే!" అంటూ సైకిలెక్కింది.

ఆమె భయానికి బాలు లోలోన నవ్వుకుంటూ సైకిల్ నడిపాడు.

బి. భాస్కరరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. వి. వి. సత్యనారాయణ సమర్పించే శ్రీరాఘవేంద్ర సినీ క్రియేషన్స్ "శ్రీవారు" చిత్రానికి ఆనం గోపాల కృష్ణారెడ్డి, కందేపి సత్యనారాయణ నిర్మాతలు.

## జంధ్యాల రచన దర్శకత్వంలో రెండు రెళ్ళు ఆరు

"[illegible] ప్రధాన [illegible], ఆగస్టు 22 నుంచి రాజమండ్రి, విశాఖపట్నం ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో సెప్టెంబర్ 15కి షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వం నెఱపే విజయ కమర్షియల్స్ వారి "రెండు రెళ్ళు ఆరు" చిత్రంలో చంద్రమోహన్, రజని, రాజేంద్రప్రసాద్, ప్రీతి, వేలు, వీరభద్రరావు, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, వంకాయల, పొట్టి ప్రసాద్, పుచ్చా పూర్ణానందం, శ్రీ లక్ష్మి, కాకినాడ శ్యామల, చంద్రిక, జానకి వగైరా తారాగణం. మల్లాది వెంకట కృష్ణమూర్తి కథకుడు. రాజన్– నాగేంద్ర స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. కోటేశ్వరరావు ఛాయ. దిలీప్‌సింగ్ శిల్పం. ఈదర సత్యనారాయణ– బి. ఎన్. నిమ్మల సహకార దర్శకత్వం, శేషు నృత్యాలు. యోగానంద్ ప్రొడక్షన్, జె. పుల్లారావు సహాయ దర్శకత్వం, సభాపతిరావు నిర్వహణతో కె. శాంతికుమార్ సమర్పించే ఈ చిత్రానికి జి. సుబ్బారావు నిర్మాత.

శోభన్ బాబు, విజయ శాంతి, "శ్రీవారు"లో



"పచ్చని కాపురం"లో కృష్ణ, శ్రీదేవి.

## తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో "ఆక్రందన"

"ఆగస్టు 12, 13 తేదిల్లో రెండు రోజులపాటు షూటింగ్ జరిపాం. తదుపరి షెడ్యూల్స్ సెప్టెంబర్ 1 నుంచి 20, అక్టోబర్ 11 నుంచి 15," అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సి.కె.ఆర్. ప్రసాద్, సి.ఆర్.ఆర్. ప్రసాద్ నిర్మించే సత్యశక్తి పిక్చర్స్ "ఆక్రందన" చిత్రంలో జయసుధ, నూతన్‌ప్రసాద్, గొల్లపూడి మారుతిరావు, మిక్కిలినేని, నిర్మల, టెలిఫోన్ సత్యనారాయణ ఆదిగా గలవారు పాల్గొంటున్నారు. భీశెట్టి కథకు గణేశ్ పాత్రో సంభాషణకర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. నవకాంత్ ఛాయ, కె. రామ లింగేశ్వరరావు శిల్పం, కణ్ణన్ కూర్పు, గూనా సహదర్శకత్వం, ఎ. నాగేశ్వరరావు– శ్యాం సహకార దర్శకత్వంతో నాగలక్ష్మి చరిత సమర్పించే ఈ చిత్రానికి తాండవకృష్ణ ప్రొడక్షన్ కంట్రోలర్. "ఒక సామాన్యమైన స్త్రీ నేరం చేస్తే, అది సంచలనమైన వార్త కాదు. కాని, ఒక అసామాన్యమైన స్త్రీ, స్టేట్ ఫస్ట్, యూనివర్సిటీ గోల్డ్ మెడలిస్ట్, కాబో యే సబ్ కలెక్టర్... సంస్కారంగల యువతి, మూడు ముళ్ళుపడ్డ తర్వాత భర్తను దైవంగా భావించే భారతనారి ఆక్రందనలోని ఆవేదన ఏమిటి? ఊహ్యమైన మలుపులతో ఆద్యంతం సంభ్రమాశ్చర్యాలు కలిగించే ఇతివృత్తం," అని కథ గురించి టూకీగా చెప్పారు భీశెట్టి.

## కె.రాఘవ ఆధ్వర్యంలో "పెళ్ళోయ్ పెళ్ళి"

"ఫుల్ లెంగ్త్ కామెడి, ఆగస్టు 18 నుంచి నెల రోజులపాటు ఏకబిగిన షూటింగ్ పూర్తవుతుంది. గోపాలకృష్ణ అనే హైదరాబాద్ వాస్తవ్యునికి డైరెక్షన్‌ను అప్పగించాం," అన్నారు కె. రాఘవ. ఈయన ఆధ్వర్యంలో తయారయ్యే "పెళ్ళోయ్ పెళ్ళి" చిత్రంలో నరేష్, గొల్లపూడి, సంగీత, పూర్ణిమ, కొందరు హైదరాబాద్‌లోని కళాకారులు పాల్గొంటున్నారు. ఆదివిష్ణు కథ, మాటలు రాశారు. బి. శంకర్ సంగీత దర్శకుడు. నాగరాజ్ ఛాయాగ్రాహకుడు. డిసెంబర్‌లో విడుదలవుతుంది.



ఈ పిల్ల డాన్సులు మాత్రం త్రి-డిలో చూపించాలి డైరెక్టరూ!











# అమృతాంజన్‌కే తెలుసు తల నొప్పి బాధ



OBM 8708 TG

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ




## అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి



1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.

కృష్ణ, జయప్రద, "కృష్ణగారడి"లో

## కృష్ణ, శ్రీదేవి జంటతో "ఖైదీ రుద్రయ్య"

"ఆగస్టు 12 నుంచి 15 వరకు ఫస్ట్ షెడ్యూల్ జరిగింది." అన్నారు విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత టి. త్రివిక్రమరావు. ఈయన నిర్మించే "ఖైదీ రుద్రయ్య" చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, శారద, సిల్క్ స్మిత, సత్యనారాయణ, జగ్గయ్య, రావు గోపాలరావు, గిరిబాబు, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, సలీమ్ నృత్యాలు, విజయ్ సాహసాలు, ... జెశ్వరరావు ...

ప్రద్యుమ్నరావు సహ నిర్మాత. ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## తెలుగు, హిందీ భాషల్లో డి. వి. ఎస్. రాజు చిత్రాలు

చక్కని చిత్రాలను అందించాలనే ధ్యేయం గల మహోన్నతమైన నిర్మాత డి.వి.ఎస్. రాజు "రెండు చిత్రాలను ప్లాన్ చేశాం. తెలుగు చిత్రంలో చిరంజీవి హీరో, కె. రాఘవేంద్రరావు డైరెక్టరు. ఇది వచ్చే సంవత్సరం సెట్సుకు వెళ్తుంది. 'ముగ్గురు మిత్రులు' హిందీలో తాతినేని రామారావు ... యా ... అన్నారాయన

## "భారత సింహం" కృష్ణంరాజు

కె. శంకర్ దర్శకత్వంలో కుమరన్, షణ్ముగం నిర్మించే ఎ. వి. ఎం. వారి "భారత సింహం" చిత్రంలో కృష్ణంరాజు హీరో. భీశెట్టి కథకుడు.

## కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు చిత్రం

"భీశెట్టి కథ..... అక్టోబర్ మొదటి వారంలో షూటింగ్," అన్నారు కె. ఎస్. ఆర్. దాస్. ఈయన దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు నిర్మించే పి. ఎన్. ఆర్. పిక్చర్స్ చిత్రంలో కె. ఆర్. విజయ, అర్జున్ ఆదిగా గల వారు పాల్గొంటారు. సాయినాథ్ ... బాషా కర్త

# నేనే V నాయకుడ్ని అయితే..?

# పేదల బాగు కోసం సూచించే బడ్జెట్



దజన్ పలకలకు పైసా చొప్పున పన్ను మినహాయించబడుతుంది. ఇందువల్ల కాగితపు కొరతను తట్టుకోడానికి వీలవుతుంది.

పాఠ్యపుస్తకాల మీద అమ్మకం పన్ను ఇరవై శాతం ఎక్కువగా విధించబడుతుంది. ఇందువల్ల బాలలు బడిలో మేష్టార్లు చెప్పే పాఠాల వంకే శ్రద్ధగా దృష్టిని కేంద్రీకరించడానికి వీలవుతుంది.

రైళ్ళలో సెకెండ్ క్లాస్‌లో నిద్రించే వసతి సౌకర్యాల మీద 25 శాతం పన్ను ఎక్కువ చేయబడుతుంది. ఇందువల్ల పేద ప్రయాణీకులు కునుకు తీసి తమ విలువైన వస్తువులు పోగొట్టుకోకుండా చూసుకోడానికి వీలవుతుంది.

నౌకలు, విమానాల మీద అమ్మకం పన్ను తొలగించబడినందువల్ల వాటిని సామాన్య ప్రజానీకం కొనుక్కోడానికి అందుబాటులో ఉంటుంది.

పేదవారు తమ కుటీర పరిశ్రమలలో తయారు చేసుకొనే సరకులను వారి వారి ప్రాంతాలలోనే విక్రయించాలి. ఇందువల్ల రవాణా ఖర్చులు ఆదా అవుతాయి.

పట్టువస్త్రాల మీద ఏమాత్రం పన్ను వేయకుండా నూలు బట్టల మీద మాత్రం 75 శాతం విధించబడుతుంది. అప్పుడు పేదవారు కూడా పట్టువస్త్రాలనే ధరిస్తారు.

బంకమట్టి, వెదురు, గడ్డి, తాటి ఆకుల మీద కొత్తగా పన్నులు విధించడం వల్ల పేదలు ఇటుక, సిమెంటుతోనే స్వగృహాలు నిర్మించుకోడానికి వీలవుతుంది.

పాల డబ్బాల మీద పన్ను నాలుగు రెట్లు ఎక్కువ చేయటం వల్ల పేద పసిపాపలు శ్రేష్ఠమైన తల్లి పాలతోనే సంపూర్ణారోగ్యంతో ఉండడానికి వీలవుతుంది.

ఉప్పు మీద టన్నుకు పైసా చొప్పున పన్ను తగ్గించబడుతుంది.

లంచగొండితనం నిర్మూలించబడడంతో మామూళ్ళు తీసుకునే పేదవారు నష్టపోకుండా ప్రతి ఆఫీసులో "మామూళ్ళు బాధితుల నివారణ నిధి" కోసం ఒక హుండీ ఉంచబడుతుంది.

—పొట్టి ప్రసాద్

## సినిమా

### దాసరి దర్శకత్వంలో మోహన్‌బాబు చిత్రం "ఏడడుగుల బంధం" షూటింగ్ ముగింపు

"ఆగస్టు 15 నుంచి 30 వరకు జరిగిన మలి షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన స్క్రీన్‌ప్లే, సంభాషణలు, దర్శకత్వంలో మోహన్‌బాబు ప్రధాన పాత్ర నిర్వహిస్తూ నిర్మించే లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్ "ఏడడుగుల బంధం" లో జయసుధ, రంగనాథ్, సత్యనారాయణ, జగ్గయ్య, రాళ్ళపల్లి, శ్రీలక్ష్మి, అన్నపూర్ణ ఇతర భూమికలు నిర్వహించారు. కె. ఎస్. మణి ఛాయ, సూర్యకుమార్ శిల్పం, ఆత్రారావు కూర్పు, సురేఖా ప్రకాష్ నృత్యాలు, సి. వి. ఆర్. బాబు సహ దర్శకత్వం, పి. ప్రకాష్ ప్రొడక్షన్, నాగేశ్వరరావు సహకార దర్శకత్వంతో ఎం. కృష్ణ, పురుషోత్తం నిర్వహణ బాధ్యతలు వహించారు. ఆత్రేయ, గోపి రాసిన గీతాలకు శంకర్ గణేష్ మృదుమధురమైన బాణీలు కూర్చారు.

### తెలుగు నిర్మాతల హిందీ చిత్రాలు

"మయూరి" చిత్రాన్ని తాతినేని రామారావు దర్శకత్వంలో రామోజీరావు హిందీలో నిర్మిస్తున్నారు.

మిథున్ చక్రవర్తితో హిందీలో, రజనీకాంత్‌తో తమిళంలో కంచర హర చంద్రరావు దర్శకత్వంలో "సంచలనం" చిత్రాన్ని పద్మావతీ ఫిలిమ్స్ అధినేత యు. సూర్యనారాయణబాబు నిర్మిస్తారు.

"మాపల్లెలో గోపాలుడు" చిత్రాన్ని ఎం. ఎస్. రెడ్డి హిందీలో తయారు చేస్తారు.

### బాలకృష్ణ "దేశోద్ధారకుడు"

"బాలకృష్ణ సరసన విజయశాంతి నాయిక. జనవరి మొదటి తారీఖున పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరుగుతుంది", అన్నారు ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన హిందీలో "ఖైదీ, మహాగురు" చిత్రాలను డైరెక్ట్ చేశారు. ఈయన దర్శకత్వంలో ధనేకుల శివన్నారాయణ నిర్మించే లక్ష్మీ రామా ఆర్ట్ పిక్చర్స్ "దేశోద్ధారకుడు" చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు (గెస్ట్), గుమ్మడి, నూతన్ ప్రసాద్, గొల్లపూడి, వేలు, పూర్ణిమ, వై. విజయ, శ్రీలక్ష్మి ఆదిగాగల వారు పాల్గొంటారు. జనవరి 11 నుంచి 20, ఫిబ్రవరి 1 నుంచి 10, మార్చి 1 నుంచి 10 వరకు జరిగే షెడ్యూల్స్‌తో చిత్రీకరణ ముగుస్తుంది. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, ఎం. వి. రఘు ఛాయతో తుమ్మల హరిశ్చంద్ర ప్రసాద్ సమర్పిస్తారీ చిత్రాన్ని.

"పట్నం పిల్ల - పల్లెటూరి చిన్నోడు"లో
కె. ఆర్. విజయ



# Gayathri Hotels and Theatres Pvt. Ltd.,

**MAHESHWARI** 70m m **PARAMESHWARI** 35m m

India's Twin Super Theatres Celebrate Their 4th Anniversary

## KACHIGUDA : HYDERABAD



**T SUBBARAMI REDDY, Managing director, and Management of MAHESHWARI - PARAMESHWARI Theatres Thank all their esteemed film fans, Distributors and well - wishers for their valued and continued patronage, which made the Theatres and the films a Thundering success**

**Total Annual gross collections of MAHESHWARI - PARAMESHWARI**

| Year | Maheshwari | Parameshwari |
|---|---|---|
| 1981-82 | Rs. 53-49 Lacs | Rs. 41-76 Lacs |
| 1982-83 | Rs. 54-08 Lacs | Rs. 42-18 Lacs |
| 1983-84 | Rs. 56-27 Lacs | Rs. 47-35 Lacs |
| 1984-85 | Rs. 59-47 Lacs | Rs. 50-99 Lacs |

| Maheshwari | | Total | Parameshwari | |
|---|---|---|---|---|
| Silsila | Rs. 12-50 Lacs | gross collections | Jaws | Rs. 16-05 Lacs |
| Yarana | Rs. 11-50 Lacs | | Disco Dancer | Rs. 25-50 Lacs |
| Namakhalal | Rs 49-68 Lacs | of hit films | Andha Kanoon | Rs. 12-75 Lacs |
| Mahaan | Rs. 11-60 Lasc | | Kasma Paida | |
| Betaab | Rs. 29-90 Lacs | in our Theatres | Karnewaleki | Rs. 17-38 Lacs |
| Sharaabi | Rs. 28-18 Lacs | | Tawaif | Rs. 13.88 Lacs |
| Saaheb | Rs. 14-81 Lacs | | Cooli | Rs. 17-03 Lacs |
| Arjun | Rs. 17-30 Lacs | | | |

**T. Subbarami Reddy,**
*Managing Director*



*T. Subbarami Reddy*

**S. Srikantiah**
*General Manager*

# గణపతి కటాక్షం!

## సుజాత



మా బంగళా ఎదురుగానే ఓ చిన్న వినాయకుడి కోవెలను కట్టించాం నేను ప్రతిరోజూ ఉదయం ఇంటి నుంచి బయలుదేరేటప్పుడు. సాయంత్రం తిరిగొచ్చేటప్పుడు ఆ వినాయకుడికి మొక్కుతూంటాను ఒకసారి నేను అర్జెంటుగా ఫ్లయిట్‌లో వెళ్ళాలి షూటింగ్ నుంచి ఇంటికి తిరిగొచ్చి విమానాశ్రయానికి బయలుదేరేసరికి చాలా ఆలస్యమైపోయింది విమానాశ్రయానికి సకాలంలో చేరగలనో లేదో అనే భయంతో విఘ్నేశ్వరా! నేను విమానాన్ని అందుకునేలా చూడు అని మరీ మరీ ప్రార్థించి బయలుదేరాను అప్పటికి విమానం బయలుదేరే సమయం దాటిపోయినా విమానాన్ని అందుకోగలిగాను ఎందుకో తెలుసా? ఏదో కారణం మూలంగా ఆ రోజు ఆ విమానం గంట ఆలస్యంగా బయలుదేరింది! విఘ్నేశ్వరుడంటే విఘ్నేశ్వరుడే మరి.



## నళిని

నేను దైవభక్తి గలదాన్ని ముందు గణపతిని పూజించి గాని మిగతా దేవతలను పూజించను. నేనిటీవల కొత్తగా మద్రాసు మహాలింగపురంలో కొన్న భవంతి ఎదురు గణపతి గుడి ఉంది ఎంత అదృష్టం! నా ఇష్టదైవమైన గణపతిని ప్రతిరోజూ ఎన్ని సార్లో స్మరించడానికి నాకు మహదవకాశం లభించటం ఆ గణపతి కటాక్షమే కదా

## అనూరాధ



కాట్టుక్కుళ్ళి తిరువిషా అనే తమిళ చిత్రం షూటింగ్ ఒక ఏనుగు ముందరి కాళ్ళు ఎత్తి నిలబడితే ఆ కాళ్ళ కింద నేను డాన్స్ చేయాలి రిహార్సల్స్ సమయంలోనే నాకు ముచ్చెమటలు పోసేశాయి పొరబాటున బేలెన్స్ తప్పి ఆ ఏనుగు కింద పడితే ఇక అంతే సంగతులు అయినా గజాననా! నన్ను రక్షించు! అని ప్రార్థిస్తూ స్టెప్పులు ఎదమయ్యా నాలో ఎక్కడ లేని ధైర్యం ప్రవేశించింది అద్భుతంగా డాన్స్ చేశానని యూనిట్‌లోని అందరూ మెచ్చుకున్నారు ఆ తర్వాత ఒక కొబ్బరికాయను తెప్పించి ఆ ఏనుగుకు అర్పించాను

సీరియల్

# సుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

సముద్రంలో వుప్పులాటి రవికి అడవిలో వుసిరిలాంటి తనకూ స్నేహం కలిసింది స్నేహలత కొత్త చిగుళ్ళు తొడుగకముందే అవాంతరాలొచ్చిపడ్డాయి ముందు గీత ఆ తర్వాత మంజు అక్క తనకు రవికి మధ్య అడ్డగోడలయారు! నిజానికి సావిత్రమ్మగారు చెప్పినట్లు మంజు అక్క రవికి సరిఅయిన జోడీ! అక్కకున్న నేర్పు వోర్పు చూశాక సావిత్రమ్మగారే ముచ్చట పడడంలో ఆశ్చర్యమేముంది?

రవి ఆరోగ్యం బాగా లేకపోతే అతన్ని సావిత్రమ్మగారిని నర్సింగ్‌హోమ్‌ని అక్క సంబాళించుకుని వస్తున్నది ప్రేమ త్యాగాన్ని కోరుతుంటుంటారు! తను ప్రేమించిన రవి సుఖపడాలంటే అతను మంజు అక్కను వివాహం చేసుకోవాలి! ఇంకా ఇక్కడే వుంటే రవికి మంజు అక్కకు మధ్య అడ్డుగా వుండేకంటే ఇక గుంటూరునుండి వెళ్ళిపోవడం మంచిది!

చంద్ర ఆరోగ్య పరిస్థితి బాగున్నది కొద్ది రోజులలో అతనిని హాస్పటల్‌నుండి డిస్చార్జ్ చేస్తారు! ఇక ఈ రోజే విజయవాడ వెళ్ళిపోతే మంచిది! అనుకుంటూ ఇందు చంద్ర గదిలోకి వెళ్ళింది!

అరె! ఏమిటి ఇందూ అలా వున్నావేంటి? ఎప్పుడూ కండ్ల నీరురాని నీకు కన్నీరా?

ఏం లేదు చంద్రా! ఇవాళ విజయవాడ వెళ్ళిపోతున్నాను!

ఇందూ! నీ మనసెందుకో కష్టపడింది! నీ బాధ ఏమిటో నాకు చెప్పు! నీ వ్యధలు తీర్చగల సమర్థత నాకు లేకపోయినా మనసులోని దిగులు చెప్పుకున్నందువల్ల తగ్గుతుంది!

అందని మానిపండుకోసం ఉబలాటపడిన అల్పజీవికి అసంతృప్తి కాక మిగిలేదేమయినా వుంటుందా?

ఇందూ! నీ మనసు తీవ్రంగా గాయపడింది నీ మనసు దోచుకున్న ఆ అదృష్టవంతు డెవరు? చెప్పు! పోయి అతని పాదాల మీద బతిమిలాడుతాను!

ఇందుకన్న మంచి అమ్మాయి నీకు జన్మలో దొరకదని నచ్చచెపుతాను

చంద్రా! కొన్ని నిర్భాగ్య జీవితాలు అమృతం ఇచ్చినా చిగురించవు! కారు చీకటిమయమైన నాజీవితంలో వెలుగు రేఖలకు తావులేదు!

దయచేసి ఇక బాధాకరమైన యీ ప్రస్తావన తేవద్దు!

ఈ రోజు మధ్యాన్నం నేను విజయవాడ వెళ్ళిపోతాను

ఇందూ! నువ్వు సంతోషంగావుండాలని కోరుకునే వాళ్ళలో నేను ప్రథముడిని! ఇక్కడనుండి విజయవాడ వెళ్ళినందువల్ల నీకు బాధోపశమనం కలుగుతున్నప్పుడు తప్పక వెళ్ళిపో!

నా కోసమే ఇన్ని రోజులూ ఎన్నో ఇబ్బందుల పాలయినావు! ఎన్ని జన్మలెత్తినా నీ రుణం తీర్చుకోలేను!

చంద్రా! నీవంటి ఆత్మీయుడు ప్రమాద స్థితిలో వుంటే వచ్చి సహాయపడే అవకాశం నాకు కలిగింది!

అదృష్టవశాత్తు ఆరోగ్యవంతుడవయావు! మరలా ఎప్పుడూ సిగరెట్ తాగనని నాకు మాట ఇవ్వు!

నేను ఎక్కడవున్నా నువ్వు ఆరోగ్యంగా వున్నావనే తలంపు నాకు ఆనందాన్ని కలిగిస్తుంది!

ఇందూ! నీకన్నా నాకు కావలసిన వాళ్ళెవరూ లేరు! నీ మాట వృధా పోనివ్వను ఇక జన్మలో సిగరెట్ తాగను!

చంద్ర ఎక్కడవున్నా నీ శ్రేయోభిలాషని గుర్తించుకో!

అప్పుడే ఇన్‌పేషెంట్సును చూస్తూ వచ్చిన మంజు రూమ్ వాకిట్లో నిలబడి ఎవరయ్యా చంద్రా! శ్రేయోభిలాషిని అంటున్నావు! అంటూ లోపలకు వచ్చింది ఆమెను చూడగానే అవతలకు తిరిగి కళ్ళు తుడుచుకుంది ఇందు

ఏం లేదమ్మా! ఇందు ఇవాళ విజయవాడ వెళ్ళిపోతానంటున్నది!

అలాగా! ఏం ఇందూ! మరి నాతో అనలేదేం? అమ్మతో అయినా చెప్పావా?

లేదక్కా! ఇందాక మా ప్రిన్సిపాల్‌గారు ఫోన్ చేసారు! పరీక్షలు దగ్గరకొస్తున్నాయి పోర్షన్లు కాకపోతే పిల్లలు పరీక్షల్లో దెబ్బతింటారు వెంటనే రమ్మన్నారు

చంద్ర పరిస్థితి బాగానే వుంది! అతన్ని కనిపెట్టి చూడటానికి నువ్వున్నావు! ఇంటికి వెళ్ళి పెద్దమ్మకు చెప్పి మధ్యాన్నం వెళ్ళిపోతాను!

అలాగే ఇందూ! పని వత్తిడిలో పడి ఇన్నాళ్ళుగా నీతో మనస్సు విప్పి సరిగా మాట్లాడనయినా లేదు!

డాక్టర్ రవి ఆరోగ్యం బాగుపడగానే విజయవాడ వస్తాను ఒకటి రెండు రోజులు నీ దగ్గర గడుపితేగాని నాకు తృప్తిగా వుండదు!

అలాగేనక్కా! తప్పకుండారా!

మంజు మిగిలిన పేషెంట్లను చూడటానికి పక్క రూముకు వెళ్ళింది

* * * * *

డాక్టరు రఘు పరిస్థితి బాగా వున్నది మంజు కనుగుడ్ల పైభాగంలో గట్టిగా నొక్కితే కండ్లు తెరచి చూచాడు అతని చూపులు క్షణంసేపు మంజును గుర్తించినట్లు కాంతివంతమయి మరలా అంతలోనే మగతతో మూసుకుపోయాయి

ఎవరొచ్చారో చూడరా రఘూ! అంది నరసమ్మ మరలా అతని కళ్ళు తెరుచుకుని మంజువంక పరీక్షగా చూసాయి నమ్మలేనట్లు రెప్పలు టప టప లాడించి మరి చూసాడు రఘు మంజును గుర్తించినట్లు అతని పెదాలపై చిరునవ్వు కనపడింది

ఏం రఘూ! నేనింకా నీకు గుర్తున్నానా? అంది మంజు గుర్తున్నావు

**జరిగినకథ–12** ఇందువదన ఆప్తమిత్రుడు చంద్రహాస్ గుంటూరులోని రవిగారి శుశ్రుత నర్సింగ్ హోమ్‌లో చేరాడని తెలిసి అతనిని చూడటానికి గుంటూరు వస్తుంది ఇందువదన చంద్ర రాకేష్ ఇందువదన పేరు కలవరించడం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది అమెరికా నుండి వచ్చిన తన క్లాసుమేటు మంజు ఇందుకి పెద్దమ్మ కూతురని తెలుసుకుంటాడు రవి ఇందుపై అభిమానం పెరిగింది మంజు రవి పట్ల ఆప్యాయతంగా ఉండటం చూచిన ఇందు మనసు వ్యాకులం చెందుతుంది రవి జ్వర తీవ్రత చూస్తే మంజుకి భయం వేసింది మెడిసిన్ ప్రొఫెసర్ రామారావు వచ్చి రవిని చూసినా అతని పరిస్థితి మెరుగవలేదు సావిత్రమ్మ కోరుకుంటు తమె మంజు రవిల వివాహం జరిపిస్తానని చెపుతుంది

అన్నట్టు తలూపాడు రఘు

నరసమ్మగారు కాఫీ గ్లాసు స్పూను అందిస్తే అతన్ని నోరు తెరవమని ఒకో చెంచా గొంతులో పోయసాగింది మంజు

రెండు నిముషాలలో గ్లాసు ఖాళీ అయింది తల్లి కాఫీ గ్లాసును మంజు చేతికి ఇవ్వడం చూచాక రఘు కళ్ళు ఆశ్చర్యంతో మెరిసాయి

మంజు రాత్రింబవళ్ళు శ్రమ చేయబట్టే నువ్వు ఇలా బతికి వున్నావురా రఘూ! అంది నరసమ్మగారు

కృతజ్ఞతతో నిండిన రఘు చూపులను తట్టుకోలేను అన్నట్టు తలదించుకుని అంటీ ఏది వచ్చినా పట్టలేదు రఘూ! అంటూ అవతలకు వెళ్ళింది మంజు

ఆరోజు నర్సింగ్ హోమ్‌లో పని పూర్తి చేసుకుని ఇంటికి వెళ్ళేసరికి మూడు గంటలయింది! వాకిట్లోనే మాదేవి ఎదురయి ఇందు విజయవాడ వెళ్ళిపోయింది! ప్రిన్సిపాల్‌గారు రమ్మని ఫోన్ చేసారట! అంది

ఆ సంగతి నాకు నర్సింగ్ హోమ్‌లోనే చెప్పింది అంది మంజు

రవికి జ్వరం తగు ముఖం పట్టినట్టుంది! వళ్ళంతా చెమటపట్టి వున్నది! మంజును భోజనానికి పిలిచింది భూదేవి ఆమె భోంచేస్తూ వుండగా సుందరమ్మగారు వచ్చి హాలులో కూర్చున్నారు

మంజు భోంచేసి వచ్చి కూర్చోగానే ఆమె మా వాడు యిప్పుడు మామూలు మనిషయ్యాడమ్మా! అంది

అలాగా! ఇందు ఇవాళ విజయవాడ వెళ్ళిపోయింది! మీరు కనుక్కోమన్న విషయం నేను కనుక్కోనేలేదు అంది మంజు

ఆ అవసరం లేకుండానే మా వాడు మనసు కుదుర్చుకున్నాడు! ఇందాక పన్నెండు ఆ ప్రాంతాల ఇందు వచ్చి మా వాడితో రాకేష్! చంద్రకు నెమ్మదించింది!

నేను ఈ రోజే విజయవాడ వెళ్ళిపోతున్నాను అని చెప్పింది

ఆ అమ్మాయి ముఖం ఎంతో దీనంగా కనపడింది కళ్ళు వాచి వున్నాయి మనిషి పాలిపోయినట్టు వన్నె తగ్గి వున్నది

అలాగా ఇందూ! అని మావాడు అనగానే ఇందు వెళ్ళిపోయింది తర్వాత అయిదు నిముషాల్లోనే ఆమె సూట్‌కేస్ తీసుకుని వెళ్ళిపోయింది ఆమె వెళ్ళగానే చంద్ర మా రూమ్‌కు వచ్చాడు ఇన్ని సంవత్సరాలుగా అతనికి రాకేష్‌కు మాటలులేవు

ఏమిటి చంద్రా! ఎలా వుంది నీకు? అని అడిగాడు

బాగానే వుందిరా! నీకెలా వుంది!

ఫైన్! ఇవాళో రేపో డిశ్చార్జి చేస్తారనుకుంటున్నాను

సరే ఇద్దరం ఒకేసారి నర్సింగ్‌హోం నుండి విడుదల అవుతాము అన్నాడు చంద్ర

ఇన్ని సంవత్సరాలుగా మాటలు లేకపోవడంతో వాళ్ళ వొకరి విషయాలు వొకరు తెలుసుకుంటూ కొంతసేపు మాట్లాడుకున్నారు ఇందు ప్రస్తావన వచ్చింది

ఇంతకు ముందే ఇందువచ్చి విజయవాడ వెళ్తున్నానని చెప్పి వెళ్ళింది అన్నాడు రాకేష్

అవున్రా! ఆమె మనసేం బాగులేదు! ఏదో తీవ్రమైన వ్యాకులంతో కలవరపడుతున్నది! అన్నాడు చంద్ర

అదేమిటి? ఎప్పుడు నవ్వుతూ చలాకీగా వుండే ఆమెకు ఎందుకిలా









# శుశ్రుత నర్సింగ్ హోమ్

అయింది ?

ఆమె ఏదో తీవ్రమైన నిరాశకు లోనయింది రాకేష్ తట్టుకోలేని ఆశాభంగానికి గురిఅయి వుక్కిరిబిక్కిరి అయిపోయింది!

ఎందుకని? నేనింకా నీకు నయమవగానే మీ యిద్దరూ వివాహం చేసుకుంటారని అనుకున్నానే!

లేదు రాకేష్! మా ఇద్దరి మధ్య వున్న ప్రేమ వన్‌వే ట్రాఫిక్ మాత్రమే! ఆమె నన్ను వొక ఆత్మీయుడైన స్నేహితునిగా మాత్రమే చూచిందిన్నాళ్ళూ! ఆమె హృదయానికి ఏదో తీవ్రమైన గాయం తగిలింది! ఎంత అడిగినా నాకు వివరాలు చెప్పలేదు అన్నాడు చంద్ర దిగులుగా!

ఆ తర్వాత కాసేపు ఆ మాటా యీ మాటా చెప్పి వెళ్ళిపోయాడు చంద్ర అతను వెళ్ళిన దగ్గర్నుండి మా వాడికి ఎక్కడలేని వుషారు వచ్చింది ఇంతలోనే ఇంత మార్పు వచ్చిందేమా అని నేను మా వారు ఆశ్చర్య పోయాం! అంతలో మాకు రాకేష్ చిన్నప్పుడు బొమ్మకోసం చేసిన హడావిడి గుర్తొచ్చింది పంజాబీ పిల్ల చేతిలో బొమ్మలాక్కుని వీధిలోకి గిరవాటేసి బొమ్మ పప్పుయిపోతే ఆనందించాడు వాడు!

ఇన్నాళ్ళు వాడి మనసులో ఇందు చంద్ర ప్రేమించుకుంటున్నారనీ త్వరలో వివాహం చేసుకుంటారనీ అనుమానం వుండేది

ఇవాళ ఆ అనుమానం తీరింది! పైగా ఇందు భగ్న హృదయ అని చంద్ర చెప్పిన దగ్గర్నుండీ మావాడి మనస్తాపం తీరిపోయింది!

అలాగా! ఇందు నాకేమి చెప్పలేదే! ఇలా అకస్మాత్తుగా విజయవాడ వెళుతున్నదేమిటా అని ఆశ్చర్య పోయాను! అంది మంజ

మా వాడికి చంద్ర ఇందు ఎక్కడ వివాహమాడతారోనని భయం కలిగింది! ఇప్పుడు ఆ భయం పోయింది! పైగా ఇన్నాళ్ళు ఎలా అయితే ఇందును ప్రేమించి భగ్నహృదయుడై బాధపడుతున్నాడో అలాగే ఇందూ కూడా ఎవరినో ప్రేమించి భగ్నహృదయయై బాధపడుతున్నదన్న విషయం తెలిసిన దగ్గర్నుండి మనిషి వూరట పొందాడు

వాడు మనోవ్యధపోయి మనిషి మామూలుగా వుండడం నాకు మా వారికి ఎంతో సంతోషంగా వుందమ్మా! ఈ విషయం చెబుదామని వచ్చాను

కొంచెం సేపాగి సుందరమ్మమళ్ళీ మావాడి ఆరోగ్యం బాగావుంది మీకిలనైతే ఇంటికి తీసుకు వెళదాం అనుకుంటున్నాం! ఏమంటారు? అని అడిగింది మంజను

సాయంత్రం నేను నర్సింగ్‌హోమ్‌కు వచ్చినప్పుడు అతని పరిస్థితి చూచి ఏ సంగతీ చెబుతానమ్మా అంది మంజ

సుందరమ్మ వెళ్ళి పోగానే ఆలోచనలో పడింది మంజ శుశ్రుత నర్సింగ్‌హోమ్‌లో జేరిన ప్రతిఒక్కరి బాధ వెనుకా ఒకగాథ వుంటూ వచ్చింది అదృష్టవశాత్తూ నర్సింగ్‌హోమ్ నుండి డిశ్చార్జి అయిపోయేప్పుడు ప్రతివొక్కరూ సంతోషంగా వెళుతున్నారు! మానసిక వ్యధలకు పరిష్కారం శరీర రుగ్మతలకు వైద్యం దొరకి పరిపూర్ణానందంతో తిరిగి వెళుతున్నారు ఇందు ఎందుకిలా అర్ధాంతరంగా వెళ్ళి పోయింది పని వత్తిడి వల్ల ఆమెతో అంతర్యంగా మాట్లాడలేకపోయింది సుందరమ్మగారు ఆమె ఎవరినో ప్రేమించిందని చెప్పింది! ఇందు ప్రేమించిందెవరినీ? ఆమె ప్రేమలత మారాకు వేయకుండా మాడి పోయిందనీ విన్నది ఈ విషయమై బాగా ఆలోచించాలి అనుకుంటూ సోఫాలో ఒడి నిద్రపోయింది మంజ

సాయంత్రం మంజ నిద్రలేచి వెళ్ళి చూసేసరికి రవికి టెంపరేచర్ బాగా తగ్గిపోయింది మనిషికి స్పృహలేదన్నది తప్ప ఇతరత్రా అతని ఆరోగ్య పరిస్థితిలో ఆందోళన కలిగించే విషయమేమీ కనబడలేదు! ఆ విషయమే సావిత్రమ్మగారికిచెప్పి నర్సింగ్‌హోమ్‌కు బయల్దేరింది

రఘు కళ్ళు తెరచి చూస్తున్నాడు మంజను చూడగానే అతను గుర్తుపట్టినట్టు చిరునవ్వు నవ్వాడు

ఎలా వున్నావు రఘూ! అని మంజ అడిగితే బాగానే వున్నాను అన్నట్టు తలూపాడు నరసమ్మగారి ఆనందానికి అవదులులేవు! ఇక దక్కడు అని ఆశలు వదులుకున్న రఘు మరల పరిపూర్ణ ఆరోగ్యవంతుడవుతాడనే ఆశకలుగుతున్నది అంతకంటే ఆమెకు యీ చివరి జీవితంలో కోరుకోవలసిందే ముంటుంది? పుత్రభిక్ష పెట్టిన మంజ అంటే ఆమెకు విపరీతమైన అభిమానం కలుగుతున్నది! మంజవంక ఆప్యాయంగా చూస్తూ వుంటే ఆమెకు ఎందుకో

ఇక రఘు నావాడుకాదు! నీవాడే అనిపించింది! తన ఆలోచనకు మరుక్షణంలోనే సిగ్గుపడి పోతూ పని వున్నట్టు గది బయటకు వెళ్ళిందామె!

రఘు చేతులు మెడమీదనున్న ట్రకియాస్టమిట్యూబ్ మీదకు వెళ్ళాయి చేతివేళ్ళతో ట్రకియాస్టమి ట్యూబ్‌ను తడుముకుని చూచుకుంటూ మంజవంక ఆశ్చర్యంగా చూచాడు

సెక్రిషన్స్ ఎక్కువగా వుండి వూపిరి సరిగా లేకపోతే అర్ధాంతరంగా ట్రకియాటమి చేసాను అంది సంజాయిషి చెబుతున్నట్టు మంజ!

వెంటనే మంజకు హవుస్ సర్జన్‌గా వుండగా సర్జరీ ప్రొఫెసర్‌గారి సమక్షంలో రఘుకు రవికి తనకూ మధ్యన జరిగిన డిస్కషన్ గుర్తొచ్చింది

ఒక సేనాదిపతి విందులో పాల్గొంటున్నప్పుడు ఎముక ముక్క ట్రకియాలోకి పోయి వుక్కిరి బిక్కిరి అయి మరణించాడు అని ఇవాళ పేపరులో చదివాను! అలాటి పరిస్థితిలో అక్కడ మీరెవరయినా వుంటే ఏం చేస్తారు? అని అడిగాడు సర్జరి ప్రొఫెసరు

డైనింగ్ టేబిల్‌మీద వుండే నైఫ్‌తో ఎమర్జన్సీ ట్రకియాటమి చేస్తాను అని మంజ టకామని సమాధానం చెప్పింది అవునన్నట్టు తలలూపారు రవీ రఘు

యు ఆర్ ఎబ్సొ ల్యూట్లీ రైట్! ఐ హోప్ వెన్ ది సిట్యుయేషన్ ఎరైజెస్ యు

'సిస్టమ్స్' లోంబెమేరు దేన్నైనా ఎన్నిక
చేసుకోవచ్చు...



# శుశ్రుత నర్సింగ్ హోమ్

విల్ ప్రూవ్ యీక్వల్ టు యువర్ ప్రాక్లమేషన్

మోస్ట్ సర్టన్లీ సర్' అంది మంజు

కాలగతిలో కలసిపోయిన జ్ఞాపకాలను గుర్తు తెచ్చుకుంటుంటే రఘుకు మంజుకు సంతోషం కలిగింది అంతలోనే రఘుకు తను లిల్లీ చేతిలో పొందిన పరాభవం ఆత్మహత్యా ప్రయత్నం గుర్తొచ్చి మనసులో ములుకులా బాధ కలిగింది

రఘూ ఆకారాలను చూచి మోసపోవద్దని నేను నీకు ఎప్పుడూ చెప్పేదాన్ని' నా మాట మర్చిపోయినందువల్ల ప్రమాదం పాలయావు అంది మంజు వెనుక మెడికోగా జరిగిన విషయాలు గుర్తుతెస్తూ

మంజు రవి రఘు యం బి బి యస్ నాల్గవ సంవత్సరం చదువుతుండగా డాక్టర్ రమణి వాళ్ళ క్లాసుకు పెథాలజీ ట్యూటర్‌గా వచ్చింది రమణి రూపం ఆకర్షవంతం కాకపోయినా ఆమె స్టూడెంట్సు అందరితోనూ ఎంతో కలుపుగోలుతనంగా వుంటూ త్వరలో పాపులర్ అయింది నవ్వుతూ నవ్విస్తూ నిర్లిప్తంగా వుండే వారిని కూడా హుషారుగా వుండేట్లు చేసేదామె తెలంగాణా నుండి వచ్చినామె కావడంతో ఆమె వ్యక్తిగత విషయాలెవరికి తెలియలేదు చాలా రోజుల వరకు'

కాలేజీ దగ్గర్లోనే రూమ్ తీసుకుని అందులో వుండేదామె నాల్గవ సంవత్సరం మెడికోలు చాలా మంది ఆమె రూమ్ దగ్గరకు వెళ్ళి సరదాగా మాట్లాడుతూ కాలం గడిపేవారు వేసిన జోక్ వేయకుండా వాళ్ళను పకాలున నవ్వించేదామె' ఇటువంటి సరదా అయిన టీచర్ లేరు' ఆమె జీవితమే వొక నవ్వుల జల్లు' ఆమె మాటలు పరమానందంతో పరవళ్ళు తొక్కే సెలయేళ్ళు' విచారమే ఏమిటో ఎరుగని అదృష్టవంతురాలామె అనుకునే వాళ్ళు ఆమెను చూచిన విద్యార్థినీ విద్యార్థులు

రఘుకు ఆమె అంటే ఎందుకో మొదటి నుండి ఎంతో గౌరవభావం ఏర్పడింది సహజంగా బిడియస్తుడు రిజర్వ్‌డ్‌గా వుండేవాడు అయిన రఘు రమణిని అక్కా అని పిలుస్తూ ఆమెతో ఎంతో క్లోజుగా వుండేవాడు సాయంత్రం కాలేజీ వదిలిన దగ్గర్నుండి అతను ఆమె వెంటే ఆమె రూమ్‌కు వెళ్ళి పొద్దు పోయిందాకా వుండి ఆ తర్వాత ఇంటికి వెళ్ళేవాడు ఆమె వంట చేసుకుంటూనే కబుర్లు చెబుతూ అతన్ని నవ్విస్తూ కాలం గడుపుతుండేది కొంతసేపు అతని చేత క్లాసు పుస్తకాలు చదివిస్తుండేది రఘు క్లాస్‌మేట్సు మరి కొంతమంది కూడా ఆమె గది వద్దకు వచ్చి వెళుతుండేవాళ్ళు

ఆ ఏడు మెడికల్ కాలేజీలో ఎగ్జిబిషన్ పెట్టారు పెథాలజీ డిపార్టుమెంటులో ఎగ్జిబిట్స్ ఏర్పాట్లు చేయటంలో రాత్రింబగళ్ళు శ్రమ చేయసాగింది రమణి ఆమెకు సహాయం చేస్తూ చాలా మంది మెడికోలుండేవారు అందరిలోనూ రఘు ఆమెకు ఎక్కువ చేదోడుగా వుంటుండేవాడు

అన్నదమ్ములు అక్క చెల్లెళ్ళు లేని రఘు వొంటరి బతుకులో రమణి అక్క అమృతపు జల్లులు కురిపిస్తూ వుండేది' ఎగ్జిబిషన్ ఏర్పాట్లలో హడావిడిగా తిరుగుతున్న రమణి రఘులను చూచి అంతా అదుగో అక్కా తమ్ముడు వస్తున్నారు అంటుండేవారు

ఏమిటి రఘూ' ఎప్పుడూ పిలిస్తే గాని పలకనివాడివి ఇప్పుడు ఇలా హుషారుగా వుంటున్నావు? నీలో చాలా మార్పు వచ్చిందోయ్' అంది మంజు ఒకరోజు

ఏంలేదు మంజూ' వొంటరిగా పెరగటంతో ఏకాంతంగా వుండటం అలవాటయి పోయి ఎక్కువ కలుపుగోలుగా వుండలేకపోయానిన్నాళ్ళూ' అక్క వచ్చిన దగ్గర్నుండి నాలో మార్పు వచ్చింది జీవితం జీవించటానికి నవ్వుతూ నవ్విస్తూ కాలం గడపటానికి మూతి ముడుచుకుని ఒక మూల పడివుండటానికి కాదు అనిపిస్తున్నదిప్పుడు

రమణి మేడమ్ మార్చారంటావు'

అవును' అక్క వచ్చిందగ్గర్నుండి నేను నవ్వడం ఏమిటో నేర్చుకున్నాను నవ్వడం నవ్వించడం అక్క సహజ స్వభావం' నిజంగా అక్క ఎంత అదృష్టవంతురాలు'

రఘూ' మెరిసేదంతా బంగారం కాదన్నారు నిర్మలంగా కనుపించే సముద్రం కడుపున అనేక బడబాగ్నులుండవచ్చు శోకమయమైన జీవితంలోని చేదు అనుభవాలను మర్చిపోవటానికి మేడమ్ ఇలా హిలేరియస్‌గా కనపడుతున్నదేమో?

అక్క జీవితంలో అసంతృప్తా' ఆమె ఒక సంతోషసాగరం' అందులో బడబాగ్నులుండటానికి వీలు లేదు' ఎటువంటి కారు చిచ్చులూ అందులోకి రాగానే చల్లారిపోతాయి' అయినా మంజూ నువ్వు మరీ పెసిమిస్టిక్‌గా ఆలోచిస్తున్నావేమో ? ఆమె జీవితం నువ్వన్నట్లు నిజంగా బాధా మయమైతే అక్క అంత సంతోషంగా ఎలా వుండగలుగుతున్నది?

విచారాన్ని కప్పి పుచ్చుకోటానికేమో?

ఏమో మంజూ' నేను నమ్మను' అని వెళ్ళిపోయాడు రఘు

ఎగ్జిబిషన్ ఏర్పాట్లలో పడిపోయారంతా' రమణి రూమ్‌కు వెళ్ళే సరికి రాత్రి పదకొండయేది' ఆమె వెంట రూమ్ దాకా వెళ్ళి దిగబెట్టి ఆ తర్వాత తన యింటికి వెళ్ళేవాడు రఘు

అక్కను ఎవరూ ఎత్తుకు వెళ్ళరులే రఘూ' పొద్దుపోయింది' నువ్వు మీ యింటికి వెళ్ళు అని రమణి అంటే

పరవాలేదక్కా అంటూ వెంట వస్తుండేవాడు రఘు ఆరోజు ఎగ్జిబిషన్ ఏర్పాట్లతో అర్ధరాత్రి దాటాకగాని ఇంటికి వెళ్ళటానికి వీలుచిక్కలేదు రమణికీ రఘుకూ' రమణి రూమ్ దగ్గరకు వెళ్ళే సరికి పన్నెండున్నర అయింది వరండాలో వున్న మనిషిని చూసి వులికిపడింది రమణి

రమణిని చూచి అతను భయంకరంగా నవ్వాడు' అతని ఆకారం చూచి రఘు దడుసుకున్నాడు' తాటి పీచులా అట్టలు గట్టిన జుట్టు చిందర వందరగా పెరిగిన రక్కసిగడ్డి దుబ్బులాంటి గడ్డంతో అతని తల బ్రహ్మజెముడు పొదలా వుంది బ్రహ్మజెముడు పొద లోని కీచురాళ్ళలా అతని కళ్ళు వికృతంగా మెరుస్తున్నాయి ఆ కళ్ళల్లో కనుపించే క్రూరత్వం చూచి భయవిహ్వలుడైనాడు రఘు మాసి దుర్గంధం వెలార్చుతున్న అతని బట్టల నుండి వెలువడుతున్న వాసనను అతని నాసికాపుటల నుండి వస్తున్న నాటుసారా వాసన మింగివేస్తున్నది

ఎప్పుడొచ్చారు? నూతిలో నుండి వచ్చినట్లుంది రమణి గొంతు

నువ్వు తిరుగుళ్ళకు వెళితే వాకిట్లో పడివుండటానికి నేనేం నీ రంకు మొగుడినంటే అంటూ ఆమె జుట్టు పట్టుకుని వంగదీసి యిష్టం వచ్చినట్లు తన్నాడతను

ఇక వోర్చుకోలేక వరండాలోకి వచ్చాడు రఘు

ఎవరు నువ్వు? ఎందుకు అక్కను అలా కొడుతావు? అంటూ అడ్డు వెళ్ళాడు రఘు

ఎవరో దాన్నే అడుగు' అయినా మొగుడూ పెళ్ళాల మధ్య పానకంలో పుడకలా నువ్వెవడివిరా? అంటూ రఘు మీదకొచ్చాడు తను

అప్పటికే పోగయిన ఇరుగు పొరుగూ భార్యా భర్తల తగూ మధ్య తల దూర్చకూడదు అని రఘుతో చెప్పి ఎటువారటు వెళ్ళారు

రఘు మాత్రం యింటికి వెళ్ళలేక పోయాడు అతని కాళ్ళు శక్తిహీనములైపోగా శిలా విగ్రహంలా అలా నిలబడిపోయాడు! (ఇంకా ఉంది)



# తెలుగు వినాయకుడు

పులికంటి కృష్ణారెడ్డి

ఇంటిని చూసి యిల్లాలిని చూడమన్నారు– యింటితో యిల్లాలితో ఓపినంత అనుభవాన్ని గడించిన పెద్దలు కోరి కోరి పూజించుకొనే కోట్లాది యిండ్లకైతే గణపతికి కొదవలేదు కాని పలిచి పలవించుకొనే యిల్లాలు మాత్రమే లేకపోయింది

ఇల్లాలు లేకపోయిందని గణపతి యిసుమంత బాధపడలేదు అసలు ఆ ఏనుగు తలకు ఆలోచన తల కెక్కలేదు పైగా యిల్లాలున్న బ్రతుకు కంటె లేనిబ్రతుకులే ఎంతో హాయి అని కండ్లారా చూసి మరీ తెలుసుకొన్నాడు ఏడాదికి ఒక్కసారి ఏదో ముచ్చటపడి కొలుచు కుంటున్నారు కదా? అని నట్టింట కొలువు తీరితే– శివశివా! ఒక్కొక్క యింట్లో వారు చేటంత చెవులే వరించలేకపోయేవి వేళకు యింటికి రాలేదనో పండగ వెచ్చాలు తేలేదనో పిల్లలకు తనకు కొత్త బట్టలు కొనలేదనో ఎదురింటి వాళ్లు ఎంతో ఘనంగా పండగ చేసుకొంటూంటే ఆ రాత తన నొసట రాయలేదనో ఆ యిల్లాలు తెగ పోరుతూంటే ఆ మగరాయుడు ముప్పై రెండు పండ్లతో కసి కసిగా నీళ్ళు నములుతూంటే తాను చూస్తూ ముసి ముసిగా నవ్వుకొన్న సందర్భా లెన్నో!– ఆ సందర్భాల్లోనే చెప్పులోని రాయిని చెవిలోని జోరీగను కాలి ముల్లును కంటి నలుసును ఇంటి పోరుతో పోల్చి ఏకంగా పద్యమే చెప్పిన కవిని తాను ఎంతగానో ప్రస్తుతించినాడు కూడా!

ఇల్లాలు లేకపోయిందని యిసుమంత బాధపడని గణపతి ఈ మధ్య తన వాహనాన్ని గురించి మాత్రం తెగ బాధపడిపోతున్నాడు ఆ వాహనాన్ని చూస్తే ఎవరికైనా భయమూ భక్తీ ఉన్నాయా? పోనీ! అందచందా లున్నాయా? అనుకొన్నప్పుడు అనుకొన్న చోటికి క్షణాల మీద పోగలుగుతున్నదా? ఏమీ లేనప్పుడు ఎల్ల కాలం దానితో ఏగులాడిందుకు? ఆరు నూరైనా నూరు ఆరైనా తన వాహనాన్ని మార్చి తీరవలసిందే! అని గట్టిగా నిర్ణయించుకొన్నాడు గణపతి

నిర్ణయించుకోవడమైతే చాలా గట్టిగానే నిర్ణయించుకొన్నాడు కానీ– నిర్ణయాన్ని ఆచరణలో పెట్టాలంటే సవాలక్ష అడ్డంకులు ఎదురైనాయి గణపతికి!

తన వాహనం ఎలుక ఎలుక అంటే దానికి కోపం రావచ్చు ఎటూ ఏదో ఒక సాకుబెట్టి తరిమేస్తున్న తరుణంలో దానికి కోపం తెప్పించడ మెందుకు?



అంతలో యింతకాలం ఎంతో వినయ విధేయలతో సర్వీస్ చేసిన కారణంగానైనా కృతజ్ఞత చూపవలసిన అవసరం ఎంతైనా ఉంది కాబట్టి గౌరవించాలి గౌరవించడమంటే శాలువా కట్టలో తాంబూలాదులు పట్టు దుకూలాలు పెట్టి గౌరవించ వలెనా?మాటేగదా? అంటే ఏం పోతుంది? మూషిక రాజమనే పిలుదాం' అని కూడా నిర్ణయించుకొన్నారు గణపతి

అయితే తక్షణ కర్తవ్యం?–

మూషికరాజాన్ని ఉద్యోగం నుండి బర్తరఫ్ చేయాలి ఆ తరువాత కావాలంటే కొత్త వాహనాన్ని గురించి తీరికగా ఆలోచించుకోవచ్చు

అయితే ఈ రోజుల్లో ఉద్యోగం నుండి బర్తరఫ్ చేయడమంటే మాటలా? యూనియన్ల సమ్మెలు **నిరాహారదీక్షలు లేబర్ కోర్టులు-ఓయబ్బో! ఒకటా?** రెండా? ఓవన్ని వాటితో రంకు మొగుడి పోరు ఆ పోరు ఎదేకంటే ఇంటిపోరే ఎంతో నయం అదేమంది పొంగినట్లే పొంగి చల్లారి పోతుంది ఈ సమ్మెలు నిరాహారదీక్షలు అట్లాకాదే? కోర్టులు అందులో లేబర్ కోర్టులు కోర్టు కెక్కిన కొంప **కొల్లపోతుందే? అయితే ఏం చెయ్యాలి? ఏం** చెయ్యాలి? ఏం చెయ్యాలి? అని చేతులు ముడుచుకొంటూ కూర్చుంటే అది పురుష లక్షణం కాదే? కాబట్టి ఏదో ఒకటి చెయ్యాలి ఏదో ఒకటి చెయడమంటే ?– అదే మూషికరాజాన్ని ఉద్యోగం నుండిబర్తరఫ్‌చెయ్యాలి !

ఆ మాట మనసులో మెదిలేసరికి మానవజాతి కంటే ఎన్నో రెట్లు ఎక్కువైన మూషిక జాతి కనుల ముందు మెదిలింది బలవంతమైన సర్పమే చలి చీమల చేత చిక్కి చస్తూ ఉంటే– మూషికరాజాన్ని ఉద్యోగం నుండి తొలగిస్తే? ఎలుకల దండు దాడిచేస్తే? అమ్మో! ఇంకేమైనా ఉందా? అవి కొరికితే మళ్ళీ డాక్టర్ల చుట్టూ తిరగాలి ఆ డాక్టర్ల కంటే యముడే నయం ఒక్కసారిగా ప్రాణాలు తీసుకొని పోతాడు!

పోనీ! యాభై అయిదేండ్లకే పదవీ విరమణ సాకుతో సాగనంపితే– బ్రహ్మాండంగా ఉంటుంది అయితే మూషికరాజాన్ని డ్యూటీలో చేర్చుకొన్నపుడు పుట్టిన తేదీ సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చెయ్యమని అడగలేదు అది ఒక పెద్ద పొరబాటై కూర్చుంది ఇప్పుడు మూషికరాజమా!నీకు యాభై ఏండ్లు నిండెను నీవు పదవీ విరమణ చేయవలెను! అంటే అది తెల్లబడిన వెంట్రుకలను చక్కగా ట్రిమ్ చేసుకొని చిక్కంగా దైకొట్టేసి అయ్యో!రామా!నాకు నలభై యేండ్లన్నా నిండలేదే?అని సాగదిస్తే ఏం చెయ్యాలి?

**ఇంతకూ తనదే తప్పు** దాని దొంగబుద్ధిని సపోర్టు చేయకుండా ఉండవలసింది అయ్యో పాపం! అనుకొంటే ఆరు నెలల పాపం తలకెక్కి కూర్చుంది మెక్కుతున్న కుడుములు ఉండ్రాళ్ళు చాలక ఆ దొంగ రైతుల పొలాలమీద పడేది చెమటోడ్చిన రైతులు చేతికందిన పంట ఎలుకలపాలై పోతుంటే చూస్తూ సహించలేక ఆహార పదార్థాల్లో మందు



జోవా మ్యూజియంలోని అపురూప గణపతి విగ్రహం

ఫోటో ఏలేశ్వరపు నరసింహారావు

# తెలుగు వినాయకుడు

కలిపి పెట్టే దాని కడుపు ఘుండ! ముక్కులదాకా మెక్కి గొంతు మీదికి తెచ్చుకొనింది అప్పుడు పోతే పోనీలే! అని అనుకొని ఉంటే యిప్పు దేగొడవ ఉండేదికాదు ఇంతకాలం ఎక్కి తిరిగిన నేరానికి అయ్యో! పాపం!" అని దాన్నెత్తి భుజాన వేసుకొని పశువుల ఆస్పత్రికిపోతే అబ్బబ్బ! అక్కడ మనుష్యుల డాక్టర్ల కంటే ఆ పశువుల డాక్టర్లు మితిమీరిపోయినారు మనిషిని మనిషి దోచుకోవడం సహజం కానీ ఆ పశువుల డాక్టర్లు మరీ పశువులై పోతున్నారు అయినా కిక్కురు మనకుండా అన్నీ భరించి లంచాలు కుమ్మరించి దాన్ని కాపాడుకొనేసరికి తల ప్రాణం తోకకొస్తూ **ఉంది ఏం చెయ్యాలి?**

అది గూడా చాలా తెలివయింది ఇంత కాలంగా యింతదూరం ప్రయాణం చేసింది కదా? ఎక్కడైనా ఎదైనా యాక్సిడెంట్ చేసి కాలో చెయ్యో విరగ గొట్టుకొనుంటే అంగవైకల్యం సాకుతోనైనా దాని ఉద్యోగానికి ఉద్వాసన పలికి ఉండవచ్చు! అయ్యో! నాతెలివి తెల్లార అంగవికలులకు మూడు శాతం ఉద్యోగాలు కేటాయించి ఉద్యోగభద్రతలు కల్పిస్తూ ఉంటే– ఒకవేళ దానికి అంగవైకల్యం కలిగి ఉండినా ఉద్యోగం నుంచి ఊడబెరికే దానికి వీలు కలిగేది కాదు పైగా ఆ కుంటి దానితో నే ఎత్తు బారం మొత్తుకోళ్ళుగా జీవితం ఎగనాడవలసి వచ్చేదేమో?

ఎన్ని విధాల ఆలోచించినా ఏ మార్గమూ కనిపించక పోయేసరికి గణపతికి మహాచెడ్డ కోపం వచ్చింది ఆ కోపంతో తొండాన్నెత్తి బొజ్జమీద బాదుకొన్నారు చెవుల్ని వింజామరల్లా ఊపుతూ చిందులు తొక్కినాడు అసలే స్థూలకాయం అవస్థ పెట్టేకుండికి అలసిపోయింది అలసిపోయే సరికి ఆవేశం చల్లబడింది ఆవేశం చల్లబడేసరికి రంగస్థలం మీద పోర్షన్ మరిచిపోయిన నటుడిలా నిలబడి పోయినాడు ఆ తరువాత కూర్చున్నాడు లేచినాడు పచార్లు చేసినాడు ఏమిచేసినా ఏమి తోచకపోయేసరికి తరుణోపాయం కోసం తండ్రినే అభ్యర్థించాలని నిర్ణయించుకొన్నారు గణపతి

తండ్రి ఎక్కడుంటాడు? ఏ స్మశానవాటికలో ఉన్నాడో? ఏమో? ఆయనగార్ని వెదుక్కొంటూ వెళ్ళాలి వెళ్ళాలంటే మళ్ళీ వాహనం అవసరం అవసరమని మూషిక రాజా నెక్కి వెళ్ళితే– కొరివితో **తల గోకున్నట్లే అవుతుంది అందుకే అంతా** అతిరహస్యంగా జరిగి పోవాలి దాన్ని ఉద్యోగాన్నుండి తొలగించేవరకు దానికేసంగతి తెలియకూడదు అందుకే గణపతి అతి జాగరూకుడై యింటి నుండి బయటపడినాడు

బయలుదేరడమైతే మహాజోరు మీద బయల్దేరినాడు కానీ ఆ స్థూలకాయాన్ని మోసుకొని నడవడమంటే మాటలా? ఇంతకాలం మూషికరాజం మీదికెక్కితే అది ముక్కుతూ మూలుగుతూ అర్ధగంట అటో యిటో గా గమ్యస్థానాన్ని చేరుస్తూ ఉండేది కానీ యిప్పుడు దానిని ఉద్యోగం నుండి బర్తరఫ్ చెయ్యాలి కాబట్టి ఎట్లా చెయ్యాల్నో తండ్రి దగ్గర తగు సలహా తీసుకోవాలి కాబట్టి ఆ పని దాని పరోక్షంలో నే జరగాలి కాబట్టి నడకమీదనే బయల్దేరినాడు అలవాటు లేని నడకంటే మాటలా? అయినా తాను అనుకొన్నది సాధించాలన్న ధ్యేయంతో గణపతి నడుస్తున్నాడు స్మశానవాటికల్లో తండ్రిని వెదుక్కొంటూ నడుస్తున్నాడు

ఆయనగారు ఏ బూడిద గుట్టమీద కొలువుతీరినాడో? ఏమో? అనుకొని స్మశానవాటికలో కలయచూస్తూ తిరుగుతున్న తరుణంలో ఏదో కాళ్ళకు చుట్టుకొనినట్టు తోచింది

ఉలిక్కిపడినాడు గణపతి!

కొంపదీసి తాను వదలిపెట్టి వచ్చిన తన వాహనరాజమే వెను వెంటనే బయల్దేరి వచ్చి కాళ్ళకు అడ్డంపడలేదు కదా?– అని సందేహపడినాడు గణపతి సంభ్రమాశ్చర్యాల్లో పడినాడు గణపతి వెంటనే తేరుకొని ఎవరు నీవు? అని అడిగినాడు

**"ఓ బొజ్జ గణపయ్యా! నీ బంటు నేనయ్యా!!**

అది ఎలుక గొంతు కాదు!– బ్రతుకు జీవుడా! అని తేలికగా నిట్టూర్చినాడు గణపతి ఆ తరువాత నిబ్బరంగా నిలబడి గొంతు సవరించుకొన్నాడు

ఆ ఆకారం గణపతి రెండు కాళ్ళను వొడిసి పట్టుకొనింది!

బాబూ! లోకంలో నాకు చాలా మంది బంటులున్నారు ఎవరని పోల్చుకోను?– కాస్త వివరణ అవసరం గదయ్యా?

అది నిజమేననుకోండి అయినా నన్ను గురించి నేను వివరించుకోవలసిన అవసరం లేదు నా కిప్పుడు! మీ అవసరం కొద్దికీ మీ కాళ్ళ కడ్డం పడుతున్నాను నేను

నా అవసరానికో

"ముహూర్తానికి!"

"ఏం? త్రికాలజ్ఞుడివా నువ్వు?"

ఒకవైపు గణపతికి ఆశ్చర్యం కలుగుతున్నా కోపలం ఒక స్మశాన సంచారి ముందు వ్యక్తం చేయడం యిష్టంలేక వెటకారంగానే మాట్లాడుతున్నాడు.

"కాకపోవచ్చు కానీ అనుభవం గొప్పది కదా?"

"ఏమిటి నీ అనుభవం?"

"నా అనుభవాన్ని చెబుతూ కూర్చుంటే పొద్దులు చాలవు. కాబట్టి ముందు మీ పనిని గురించి మాట్లాడుకొందాం!"

"నా పని సంగతి నీకెట్లా తెలుసు?"

"పాడిందే పాడినట్లు వేసిన ప్రశ్నే వేస్తే మళ్ళీ వచ్చిన సమాధానమే వస్తుంది. ఇంతవరకు నా రాష్ట్రంలో నాయకుల కెంతో సహాయపడినాను. ఇప్పుడు నాయకులకు నాయకుడు వినాయకుడికి సహాయపడుతున్నాను."

"నా అవసరమేమో తెలుసుకోకుండానే?"

"మీ అవసర మేమిటో నాకు బాగా తెలుసు."

"అయితే చెప్పుచూద్దాం!"

"ఒకానొక నాయకుడు కాషాయ వస్త్రాలు ధరించి, చెవిపోగులు పెట్టుకొని సన్యాసినను చాటుకొంటూ ప్రజాసేవకు జీవితాన్ని ఒక్క రూపాయి జీతంతో అంకితం చేసి, "నాచేత యేముంది?.... బూడిద!" అని అంటూనే అనుకొన్నదే తడవుగా ముచ్చటగా మూడు వాహనాల్ని మార్చినాడు. ఆయనే మూడు వాహనాల్ని మారిస్తే భస్మ సామ్రాజ్యానికే అధినేత అయిన తండ్రికి కొడుకుగా ఉండి ఎల్లకాలం ఈ ఎలుకతో **ఏగవలసిందేనా?" అని బాధపడుతున్నారుగదూ?"**

తన మనసులోని మాటను ఉన్నదున్నట్లుగా చెప్పేసరికి గణపతికి తల దిమ్మెక్కింది. అతడొక మహాత్ముడని, ఆ మహాత్ముడి ద్వారా తన అభీష్టం నెరవేరుతుందని మనసు ఆనంద డోలికల్లో తేలియాడింది. నిజంగా ఆ మహానుభావుడి పాదాలకు వంగి వంగి నమస్కరించ వలెనను కొన్నాడు. అనుకోవడమైతే అనుకొన్నాడు కానీ- నడుం వంగదే?- అందుకే,

"మహాశయా! తమ రెవరో కానీ తమ ప్రతిభా పాటవానికి హృదయపూర్వక నమస్సుమాంజలులు అర్పిస్తున్నాను. తమ ప్రజ్ఞను గుర్తించలేకుండా ఏదేదో వాగినాను. క్షమార్హుడిని." అన్నాడు గణపతి అతివినయంగా.

"ఎంతమా టింతమాట! తుమ్మిపూలతో తొలి పూజలందుకొనే దేవదేవుడవు!- దేవుళ్ళకే దేవుడవైన **మీ ముందు నేనెంత? లేదంటే-ఆవేశంలో ఎవరికైనా** బుర్ర పనిచేయదు. అట్లాంటి సమయాల్లో ప్రక్క మనిషి సలహా అవసరమవుతుంది. ఇప్పుడు నేనా అవసరాన్ని తీరుస్తున్నాను. అంతే!"

"పోనీ! యిప్పుడైనా చెప్పండి తమరెవరో?"

"నాది ఆంధ్ర దేశం!"

"ఓహోహో! ఆంధ్రులా మీరు. మీరన్నా మీ రాష్ట్రమన్నా నాకు చాలా ప్రీతి. అన్నపూర్ణకు నిలయమైన మీ రాష్ట్రంలో భోజనం!... ఓహో హో హో! పర్ణించడానికి ఆదిశేషుడికైనా అలవికాదు. తలచుకొంటేనే నోరూరుతున్నాయి. ఆ గోంగూర!.... ఆ ముద్దపప్పు!... ఆ పూర్ణం కుడుములు!..."

"ఆంధ్రులతో భోజనప్రియుల్లో అసలు విషయాన్ని మరచిపోతున్నారనుకొంటి మీరు కూడా అంతేనా స్వామి?"

"నాకొక చిన్న సందేహం బాబూ!"

"ఏమిటి స్వామి?"

"నువు ఆంధ్రుడవు కావు."

"శివ శివా! అంతమాటనకండి స్వామి! ఎవరో మా తాత ముత్తాతలు అరవ దేశంలో బ్రతికింది వాస్తవమే ననుకోండి. **నేను మాత్రం పుట్టింది ఆంధ్రదేశంలో నే!...** పెరిగింది **ఆంధ్రదేశంలో నే!-** చదువుకొనింది ఆంధ్రదేశంలో నే! ఉద్యోగం చేసింది ఆంధ్రదేశంలో నే! ఉరిపోసుకున్నది ఆంధ్రదేశంలో నే!"

"శివ శివా!- పాపము శమించుగాక!- ఉరిపోసుకున్నావా?- అంటే ఆత్మహత్య!"

"అక్షరాలా ఆత్మహత్యే స్వామి!"

"అంత పాపానికెందుకు పొడిగట్టినావయ్యా!"

"అదొక పెద్ద కథ. ఆ కథ తరువాత చెబుతాను కానీ- ముందు అసలు విషయానికి రండి.

"అసలు విషయాన్ని ప్రస్తావించడానికే కదా నేను నా తండ్రి కోసం వెదుకుతున్నది."

"మీ తండ్రికేం తెలుసు స్వామి! పత్రీభోళా శంకరుడు. చేతులు కాలిన తరువాత ఆకులకోసం ప్రాకులాడేరకం. ఆయనకు రాజకీయా లేం తెలుసు?"

"అయితే ఏం చెయ్యాలంటావ్?"

"మీ ఎలుక వాహనాన్ని ఉద్యోగం నుండి ఎట్లా బర్తరఫ్ చెయాలన్నది మీ ఆలోచన. అవునా?"

"అవునయ్యా! అవును. ఈ మాట అక్షరాలా నిజం. నా బాధను గుర్తించిన నా తండ్రి ఆ శంకరుడే నన్ను నాకడకు పంపినట్లుంది. దయచేసి ఆ మార్గ మేమిటో తొందరగా సెలవిచ్చి నన్ను కష్టం నుండి గడతేర్చండి."

"రద్దులకు పేరెన్నికగన్నది ఆంధ్ర రాష్ట్రం!"

"అయితే నేను సరాసరి అక్కడికే వెళ్ళి ఈ రద్దును గురించి ప్రస్తావిస్తాను."

"అబ్బబ్బ! అబ్బకే తొందరపాటనుకుంటే కొడుకు కూడా అంతేనా? తొందరపడకండి స్వామి!"

"తొందరపడ వద్దంటున్నావు కాని నా బాధ నీకేం తెలుసయ్యా? ఎన్ని దినాలుగా నిద్రాహారాలు మాని ఆలోచిస్తున్నానో తెలుసా? వినాయక చవితి రానేవస్తున్నది. కనీసం ఈ పండగనాటికైనా కొత్త వాహనమెక్కి వెళ్ళి అచ్చటానికి నోచుకొన్నానో? లేదో?"

బాధగా ఒక్క నిట్టూర్పు విడిచినాడు గణపతి!

స్మశాన సంచారి నిలువునా కరిగి పోయినాడు. తన అనుభవాన్నంతా విశదపరచి గణపతికి సాయ పడేవలనని సంకల్పించుకొన్నాడు.

"స్వామి! ఈ తొందరపాటులో మీరు సరాసరి ఆంధ్రప్రదేశ్‌కు వెళ్ళితే ఏమవుతుందో తెలుసా?"

"భాగ్యనగరంలో ప్రజలందరూ నా భక్తులు. అఖండ స్వాగతాలు పలుకుతారు."

"అయ్యో! నా పిచ్చి స్వామి! ప్రజల సంగతి కాదు నేను మాట్లాడుతున్నది. ప్రజలు అప్పుడు యిప్పుడు ఎప్పుడూ గొర్రెదాటు ప్రజలే! నేను మాట్లాడుతున్నది పాలకుల సంగతి!"

"పాలకులు కూడా ప్రజలే కదా?"

"అయినా ప్రజలు వాళ్ళకు కొన్ని హక్కుల్ని ధారాదత్తం చేసినారు. ఆ హక్కుతో వాళ్ళు ప్రజల ముక్కు చెవులు కోయవచ్చు. లేదా ముక్కు పిండి రేపు వినాయక చవితి నాటికి తయారు చేసుకొనే



# తెలుగు వినాయకుడు

ఎండ వంటకాలమీద పన్నులు వసూలు చేయవచ్చు!

భూలోకంలో యింత అన్యాయం జరుగుతున్నదా? ఏది మా దృష్టికి రాలేదే?

ఎవరెవరి స్వార్థం వాళ్ళది ఎవరెవరి సుఖం వాళ్ళది మీసుఖం కోసరం మీరు తాపత్రయ పడుతూంటే యింక భూలోకవాసుల్ని గురించి ఆలోచించడానికి మీకు తీరికెక్కడిది?

అది ఒక విధంగా నిజమేననుకో! నేను భాగ్యనగరానికి సరాసరి వెళ్ళితే ఏమవుతుం దంటావ్?

ఏం కావాల్నో అదే అవుతుంది స్వామి?

అంటే?

మీరూ రద్దు మీ వాహనం ఎలుకా రద్దు!

అదెట్లా సాధ్యం?

ఏముంది స్వామి? మిమ్మల్ని చూస్తూనే ఓహో హో హో గణపతులుం గారా? రండి రండి బహు కార్యమగ్నమానసులమైన మాకు దర్శన మిచ్చి మేము మరచిన విషయాన్నే మాకు మతికి తెచ్చినారు మాకు చాలా సంతోషంగా ఉంది ఈ భాగ్యనగరంలో ఏటేటా మీ పూజ పేరుతో ఊరేగింపు సాకుతో మారణహోమం జరగడాన్ని మేము సహించలేము ఈ ఏడాది నుండి మీ పూజనే రద్దు చేస్తున్నాం! అంటే ఏం చేస్తారు?

వెళ్ళితే అంతపనీ జరుగుతుం దంటావా?

అందుకు సందేహమా స్వామి! నా గతి చూడండి బతికినంత కాలం ఏదో నీతి అనీ నిజాయితీ అని వాటిని పట్టుకొని వ్రేలాడినాను తుదకేం మిగిలింది నిరుద్యోగులుగా ముగ్గురు కొడుకులు! కట్నాల సంకెళ్ళలో అవివాహితులుగా అయిదు మంది కూతుర్లు!

ఓరి నీ యిల్లు బంగారం కానూ? కుటుంబాన్ని పరిమితం చేసుకో కూడదటయ్యా?

ఈ మాట నాతో కాదు స్వామి చెప్పవలసింది!

ఇంకెవరితో?

మీరు వాహనంగా వాడుకొంటున్నారే ఎలుకా! ఆ జాతికి చెప్పండి

అబ్బ! వీడెప్పుడో మహామహా సమర్థుడుగా ఉన్నాడే? అని ఒక్క క్షణం నిరుత్తరుడైనాడు గణపతి

ఏమిటి స్వామి ఆలోచిస్తున్నారు?

కలియుగంలో మనిషి తెలివి తేటల్ని గురించి!

ఆ పని తీరిగ్గా కూర్చుని చేయవచ్చును కానీ ప్రస్తుతాంశానికి రండి

అయితే తక్షణం నా వాహనం ఎలుకను ఉద్యోగం నుండి బర్తరఫ్ చెయ్యాలి మార్గమేమిటో చెప్పండి

ఏముంది స్వామి! మూషికరాజమా! ఈ రోజు నిన్ను ఉద్యోగం నుండి బర్తరఫ్ చేస్తున్నాను! అనండి చాలు

ఇదేమిటిది? కొండంత రాగం తీసి తుమ్మెదల పాట పాడినట్లు!

సింపుల్! అంతకంటే చేయవలసిందేమి లేదు

అమ్మో! ఎలుకల దండు నామీద విరుచుకపడితే!

ముందు జాగ్రత్తగా ఆర్డినెన్సు జారీ చెయించండి

ఆర్డినెన్సు ఎవరు జారీ చేయాలి?

ఇంకెవరు? శంకరుడే!– ఆయన దయాళువు అడగడమే తరువాయి!

హ్హాహ్హాహ్హాహ్హా!

ఎందుకు స్వామి నవ్వుతున్నారు?

ఓరి పిచ్చోడా! ఇంతవరకు నీవు చాలా తెలివైన వాడననుకున్నానే!

ఇప్పుడేమయింది స్వామి?

ఇంతేనా నీకు తెలిసింది! నిజంగా నా తండ్రి శంకరుడు దయాళువై ఉంటే నా కెందుకయ్యా యిన్ని తిప్పలు? ఆయనకు ఒక కంట్లో వెన్న ఇంకొక కంట్లో సున్నం మూడవ కంట్లో అగ్ని లేకుంటే– నా సోదరుడు కుమారస్వామికి వన్నెల చిన్నెల నెమలి వాహనం నా తల్లికి ఏకంగా పులి వాహనం తనకా వృషభరాజం వాహనం నాకేమో ఈ ఎలుక వాహనం దీనితో నేనెన్ని యిబ్బందులు పడుతున్నానో ఆయన గ్రహించ లేదా? గ్రహించి ఊరకున్నాడంటే ఏమని అర్థం?– పోనీ! నువ్వే చెప్పు ఈ రోజుల్లో మారుతి కార్లో వెళ్ళితే ఒక మర్యాద బెంజిస్సు కారుమీద వెళ్ళితే యింకొక మర్యాద టొయోటాలో వెళ్ళితే ఆ ట్రీట్‌మెంటే వేరు వ్యక్తిగత విలువ లుండవలె కానీ **ఒకరిచ్చే మర్యాద లెందుకని సర్దుకుపోతున్నా ఈ** పూటకు చేరుకోవాలంటే పని పాటా మానుకొని మూడు పూటలు ముందుగా ఎయల్దేరాలి పోనీ! ఎయిల్దేరినా ఈ వాహనాన్ని చూసి కనీసం చిన్న **పిల్లలు కూడా భయపడడం లేదంటే–ఎందుకయ్యా** ఈ పనికిమాలిన ఎలుకు?

**మీ బాధ నాకు అర్థమవుతూ ఉంది అయినా మీ శ్రేయస్సు కోరే – ఆయన మీకు ఎలుక వాహనాన్ని యిచ్చి ఉంటారని నా అభిప్రాయం**

**అంటే?**

మరి వేగంగా వెళ్ళే వాహనమైతే మీ శరీర **తత్వానికి సరిపడదని కాబోలు!**

బోలు లేదు తొర్రా లేదు మహా తెలిసిన వ్యక్తిలాగ **మాట్లాడుతున్నావ్? ఈ** శరీరం ఇట్లా కావడానికి కారకులెవరయ్యా? **ఆయనే** గదా? తల నరికినపుడు లోకం గొడ్డు పోయినట్లు ఈ ఏనుగు **తలనే తెచ్చి అతికించవలెనా?**

**అది నిజమేననుకోండి!**

మరి **ఆ పక్షపాతి ఆర్డినెన్సు** జారీ చేయమంటే **చేస్తాడంటావా?**

**చేయనంటే చేయిస్తే సరిపోతుంది**

**అదెట్లా?**

ఎక్కడ కీ ఇవ్వాలో **అక్కడ** కీ యిస్తే **అన్నీ** సర్దుకుంటాయి

**అంటే?**

మీ **తల్లి** దగ్గర నిరాహారదీక్ష ప్రారంభించండి కాగల పనులన్నీ గంధర్వులే నిర్వహిస్తారన్నట్లుగా **ఆమె** మీ తరఫున వకాల్తా పుచ్చుకొంటుంది

**అది కాని పని!**

నిరాహారదీక్ష ప్రారంభించడమా?

**అది కూడ కష్టమే! అయినా ఎట్లో తిప్పలు** పడతాననుకో! కాని **ఆయన కాదంటే ఈమె ఔను!** అనదు **ఆమె మహా పతివ్రత!**

పట్టుబట్టి సాధించకుండా మీరే పట్టు సడలితే ఎట్లా స్వామి?

**ఆమె** సంగతి నాకు బాగా **తెలుసయ్యా? నన్ను చూసి నవ్విన** చంద్రుణ్ణి నా **తండ్రి** నగవువుగా **పెట్టుకుంటే ఆమె పల్లెత్తు మాట అనిందా? నా**





జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికి, చల్లదనానికి, దానికదే సాటి

రీటా-వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి

# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును



గణపతి తల్లిని ఏకంగా నెత్తి నెక్కించుకుంటే నెత్తి నోరూ మొత్తుకొనిందా? లేదే? అటువంటి తల్లి యిప్పుడు మాత్రం ఆయనను ప్రతిఘటించిందా? అసంభవం!

కడుపు తీపి మీకు తెలియదు స్వామి!

ఇంత అనుభవశాలివి తెలివిమంతుడివి ఇక్కడికెట్లా వచ్చినావయ్యా?

ఆత్మహత్య చేసుకొని!

ఔనౌను చెప్పినావు గదా? ఎందుకింత పాపానికి వొడిగట్టినావయ్యా?

ఏం చెయ్యమంటారు స్వామి? ఉద్యోగులు యాభై అయిదేండ్లకే పదవీవిరమణ చేయాలని ఆర్డినెన్సుతో నోరు నొక్కితే ఏం చెయ్యమంటారు? ఎంపికట్టు ఇంకా రోజుల సర్వీసుంది ఎదురుగా విరులు ఊరుల్లా ఎనిమిదిమంది సంతానం నిలక్షణంగా తిరుగుతున్నారు ఉద్యోగమున్నప్పుడే వాళ్ళందర్నీ మేపడానికి ఓపనంత ఓర్పు నేర్పు కావలసి వచ్చే ఉద్యోగం లేకుండా! ఫిగాడ్! - తల తిరిగింది వెన్నెముకలో చలి పుట్టింది అయితే బుర్ర మాత్రం తీవ్రంగా పనిచేస్తూ ఉంది సర్వీసులో ఉన్నప్పుడే చస్తే! ఎవడికో ఒక కొడుక్కి ఉద్యోగం! వాడికి పక్కలోకి పెండ్లాం వచ్చే వరకు వాళ్ళందరికీ పట్టెడు మెతుకులు పెడతాడు! - అని తోచేసరికి ఏంచేసినానో తెలుసా స్వామి! ఉరేసుకొన్నాను అంటే ఆత్మహత్య చేసుకొన్నాను!

ఆ మాట చెవిని పడేసరికి గిరక్కున వెనక్కు తిరిగినాడు గణపతి గున గున పరుగందుకున్నాడు!

స్వామీ! స్వామీ! ఏమయింది స్వామీ? - ఇంతసేపు యింత ఆప్యాయంగా మాట్లాడి యిప్పుడు మాట మాత్రం చెప్పకుండా పరుగెత్తుతున్నారేం? ఇది న్యాయమా? చెప్పండి స్వామి చెప్పండి! అంటూ స్మశాన సంచారి వెంట పడినాడు

గణపతి తిరిగి చూస్తే ఒట్టు!

కాలి కొద్దీ పరుగెత్తుతున్నాడు!!

మనసులో ఆలోచన! కన్నుల్లో భయం! ముఖంలో విచారం! ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి

ఎప్పుడెప్పుడు కైలాసం చేరుకొందామా? అన్న ఆతురతతో పరుగెత్తుతున్నాడు!

ఉన్నట్టుండి ఎందుకు గణపతి యిట్లా పరుగందుకున్నాడో? అర్థం కాకుండా స్మశాన సంచారి అరుస్తూ వెంటపడినాడు!

గంటలు నిమిషాలవుతున్నాయి!

నిముషాలు సెకండ్లవుతున్నాయి!!

అలుపు సొలుపు ఎరక్కుండా పరుగెత్తుతున్నాడు గణపతి!

యోజనాలు బారలైనాయి మూరలు జానెళ్ళయినాయి!

గణపతి కైలాసంలో అడుగుపెట్టినాడు అబ్బా! అని నిట్టూర్చినాడు

ఆత్మహత్యా మహాపాపానికి వొడిగట్టిన నేరానికి కైలాసంలో ప్రవేశానికి నోచుకోకుండా స్మశాన




# తెలుగు వినాయకుడు

సంచారి స్వామి! స్వామి! అని కైలాసం వాకిట నిలబడి అరుస్తున్నాడు

అయినా వినిపించుకోకుండా గణపతి ఒక్క వూపులో తన నివాస మందిరం వైపు పరుగెత్తినాడు మందిరంలో అడుగుపెట్టి అడుగు ముందుకు పడకుండా నిలబడిపోయినాడు!

ఎదురుగా తన వాహనం ఎలుక ఉరేసుకొని వ్రేలాడుతూ ఉంది!

ఆ దృశ్యాన్ని చూస్తుంటే గణపతి కడుపు రగిలింది కాళ్ళు తడబడుతున్నాయి కండ్లు వాగులైనాయి ఔరో మని ఏడుస్తూ గణపతి కుప్పగా కూలిపోయినాడు

తనయుడి ఆక్రందన తల్లి చెవిని పడింది!

క్షణాల మీద ఆమె అక్కడకు చేరుకొనింది బిడ్డను చేతుల్లోకి జవురుకొని గుండెలకు హత్తుకొనింది

గణపతి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు!

నాయనా! తొందరపాటు నిర్ణయాలు యిట్లాంటి విపరీత పరిణామాలకే దారితీస్తాయి గతించిన దానికి చింతించి ప్రయోజనంలేదు కర్తవ్యోన్ముఖుడవు కావాలి లే నాయనా లే! - పార్వతి కొడుకును సముదాయిస్తూనే హితోక్తులు పలికింది

ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు తల్లీ!

సృష్టి స్థితి లయ కారకుడు శివుడు శివుడి ఆజ్ఞ లేనిదే చీమ అయినా కట్టదు వెళ్ళి వారినే శరణు వేడు

ఇంతవరకు తండ్రిని పక్షపాతిగా చిత్రించి దూషించిన సంగతి మనసులో మెదిలింది తండ్రికి మొగం చూపడానికి గణపతికి మొగం చెల్లలేదు అందుకే తటపటాయిస్తూ -

అయితే తప్పదంటావా తల్లీ!

తప్పు చేసిన ఎవరైనా తలవంచక తప్పదు నాయనా!

వంచిన తలెత్తకుండా గణపతి తండ్రిని చూడడానికి బయల్దేరినాడు కొడుకు వినయవిధేయతలకు ఉప్పొంగిపోతూ పార్వతి ముసిముసిగా నవ్వుకొనింది

శివుడి మందిరాన్ని సమీపించిన గణపతి చిత్తరువులా నిలబడిపోయినాడు

ఎదురుగా మూషికరాజం! గణపతిని చూసి ముసి ముసిగా నవ్వింది చిందులు తొక్కింది ఆ తరువాత చిత్తరువులా నిలబడిన గణపతికి ప్రదక్షిణం చేసి ప్రక్కన వొదిగి నిలబడింది - తన సేవకు తానెప్పుడూ సిద్ధమే అన్నట్టుగా!

గణపతి ఆనందంగా ఆశ్చర్యంగా దాని వైపు చూస్తున్నాడు

ఇదేనా తమకు తండ్రిగారు ప్రసాదించిన సరికొత్త వాహనం స్వామి! దీనికే యింత మురిసి పోతున్నారేం?

ఇదేదో పరిచితమైన గొంతుగా ఉందే? అనుకొంటూ గణపతి అతని వైపు దృష్టి మరల్చుతూంటే - నాయనా! స్మశానంలో నీకు జ్ఞానోపదేశం చేసిన ఘనుడితడే! ఆ ఘనకార్యానికి మెచ్చి యితన్ని అనుగ్రహించినాము అందుకే కైలాస ప్రవేశం లభించింది!! అంటూ శివుడు గణపతి సందేహాన్ని తీర్చినాడు!

నన్ను అనుగ్రహించినారు బాగానే ఉంది కానీ మీ కొడుకు మీదనే మీకింత ఆగ్రహమెందుకు పరమేశ్వరా? అర్థించకనే నాబోటి వాళ్ళను అనుగ్రహిస్తున్నారే- మీ కొడుకు ముచ్చట తీర్చరాదా స్వామి!

ఔరా! ఔరౌరా మానవుడా! తండ్రీ బిడ్డలకే జట్టు ముడివెయ్యాలని చూస్తున్నావే?

అపచారం! అపచారం దేవరా! అంత మాట అనకండి కలియుగం సంగతి మీకు తెలియనిదేముంది? ఐరావతమంతటి అంబాసిడర్ కార్లు నందీశ్వరుడంతటి బస్సులు గరుత్మంతుడు లాంటి విమానాల్లో మానవులే విహరిస్తుంటే ముల్లోకాల పాలికకు ఎలుక వాహనమా? ఏం బాగాలేదు స్వామి! - ఈ పండగకైనా కొత్త వాహనమిచ్చి ఆయన కోర్కె తీర్చండి!

ఓయీ కనిష్క సంగతి ఏమయిందో ఎరుగుదువు కదా?

కైలాస సంచారి శివుడితో మాట్లాడుతున్నానన్న సంగతిని మరిచినాడు

కనిష్కకేమయింది? అది కూలలేదు కూల్చినారు!

అదే నేనూ అంటున్నది మీరందరు భూలోకాన్ని స్వర్గలోకంగా మార్చుకోవాలని అహరహము కృషి చేస్తున్నారు బాగుంది మా ఆశయము ఆశీస్సు కూడా అదే! అయితే కూల్చే బుద్ధులు కాల్చే బుద్ధులు వదలండి అప్పుడే మీరు మీ ధ్యేయాన్ని సాధించిన వాళ్ళవుతారు అంతేకానీ ఒక్కొక్కడు ఒక భస్మాసురుడైతే మీరక్కడే మేమిక్కడే!!

ఈ సందేశాన్ని భూలోకానికి చేర వేయాలనుకొన్నాడేమో? గణపతి ఎలుక వాహనమెక్కి ఏకాఏకిని బయల్దేరినాడు!

తస్మాత్ జాగ్రత్త! □

# నీరు వేడిచెయ్యవలసిన అవసరం లేదు, సీసాని మరగబెట్టవలసిన శ్రమ లేదు, వేడిగా చల్లగా ఉందేమోననే బాదరబందీ లేదు!



ప్రకృతి యుగయుగాల నుంచి సహజమైన స్వాభావికమైన తీరులో అప్పుడే పుట్టిన పాప యొక్క పోషణ నెలా చేస్తూ పోతోందో మరి!

ప్రకృతి వేలకి వేల లక్షల ఏళ్ళబట్టీ ప్రయోగాల వెంట ప్రయోగాలు చేస్తూ చేస్తూ చివరికి శరీర నిర్మాణంకోసం ప్రోటీన్లు శక్తినిచ్చే కార్బొహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ, ఆరోగ్యాన్ని కాపాడే విటమిన్లూ వీటి యొక్క సరియైన సంతులితమైన దాన్ని తయారుచేసింది. అందుకే తల్లిపాలు పాపకొక ఆదర్శ ఆహారం అయింది.

## కలుషితం అయ్యే ప్రమాదం లేదు

మీ పాప స్తన్యపానం చేసినప్పుడు, అవి ఏ రకంగానూ దూషితం అయ్యే ప్రమాదమిక ఉండదు, ఎందుకంటే దాన్ని కలుషితమవడం గాని, సీసాని శుభ్రం చేయవలసి రావడంగాని, ఉష్ణోగ్రతని చూడవలసి రావడం గాని చేసే ప్రశ్నే లేదు గనక. తల్లి పాలంటూరా అవి అమృత తుల్యమైనవి!

అంతేగాకుండా ప్రకృతి దాన్లో "రోగ నిరోధక ద్రవ్యాలను" కూడా ప్రసాదించింది, దాంతో మీ పాప ఆమాశయం, పేగుల్లోని వ్యాధులు యితర వ్యాధుల నుంచి రక్షణ కలుగుతుంది. మరి తల్లి పాలలో యింకా ఎన్నెన్నో ఉన్నాయి—స్కర్వీ వ్యాధిని నిరోధించే విటమిన్ సీ ఉంది.

## ప్రపంచమంతా ప్రచలితం

ఇప్పుడు రోజుకి రోజూ, ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు, అంటే పశ్చిమ దేశాల్లో సహితం, తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు. ఎందుకంటే, తల్లి పాలలోని పోషణ తత్వాల మహత్తర లక్షణాల్ని మళ్ళీ వాళ్ళు అవగాహన చేసుకోవడం మొదలెట్టారు.

## తప్పకపోతే

మరి మీరేగనక యింక ఏ కారణం వల్లనైనా తప్పకపోతే, మీ పాపకు మీ పాలు యివ్వలేకపోతే—అంటే మీ ఆరోగ్యం సరిగా లేకనో, లేదా మీలో సరిపడినన్ని పాలు పడకో. అలా జరిగినప్పుడేం చెయ్యాలి మీరు? అటువంటి సందర్భంలో మీరు ఎంతో ఆలోచించిన మీదట. ఎటువంటి ఎటువంటి ఆహారం యివ్వాలంటే, అ యిచ్చేది తల్లి పాల తర్వాత అన్నింటికన్న ఉత్తమమైనదిగా ఎంచుకునేదాన్ని.

## స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం. ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతో బాటే తేలికగా అరగగలిగే కార్బొహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి. ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది. మొదటిగానే పేస్ట్‌లా తయారు చేయవలసిన అవసరం ఉండదు.

## పొదుపు

అమూల్‌స్ప్రే. డబ్బాలలో దొరికే శిశుఆహారాన్నిటికన్న పొదుపైనది ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన—"శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు.

## జాగ్రత్త పడటం

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసానీ, పిచ్చుకూ ఆరోగ్యకరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి. పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి. పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఉచితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి

**ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో**

ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాలలో ఉన్నాయి అవి గర్భధారణ ప్రసవానికి ముందర జాగ్రత్త ప్రసవము తల్లిపాలు ఇతర ఆహారములు మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట పిల్లవాని దినచర్య వాని అభివృద్ధి జబ్బులను అరికట్టుట ప్రథమ చికిత్స సాధారణ రోగములు జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ క్షేమము చూడవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు ఇంగ్లీషు హిందీ తమిళ మలయాళ మరాఠీ గుజరాతీ బెంగాలీ భాషలో దొరుకుతుంది దానికోసం బాక్స్ 10124 బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ పూర్తి అడ్రసు యిస్తూ రూ 1 25 స్టాంపుల్ని జతపర్చండి




# అమూల్‌స్ప్రే

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL6/83

సీరియల్



# ప్రతిభ



డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

బుచ్చయ్య సన్నగా పొడుగ్గా కార్టూన్ పిక్చర్లో బొమ్మలా వున్నాడు ప్యాంటు షర్టు వేసుకున్నాడు టై కట్టుకున్నాడు అతనిది సన్నని కీచుగొంతు మాట్లాడితే కీచురాయి అరిచినట్లుగా వుంటుంది

బుచ్చయ్య వేదిక మిదికి రాగానే సబాసదులంతా చప్పట్లు కొట్టారు ఆ చుట్టు పక్కల రాజకీయ వర్గాల్లో ప్రత్యేకంగా బుచ్చయ్య వర్గం ఒకటుంది వాళ్ళు బుచ్చయ్య ఎక్కడున్నా సరే అక్కడ యిలా చప్పట్లు కొట్టి తమ సంతోషాన్ని వ్యక్తపరుస్తుంటారు

బుచ్చయ్య లేచి- సోదర సోదరి మణులారా' ఇవ్వాళ చాలా సుదినం ప్రతిబ అంతటి నర్తకిమణి మన మిద ప్రేమతో ద్రాక్షారామానికి వచ్చి ప్రదర్శన యిస్తుండడం మన అదృష్టం ఉప్పుకప్పురంబు ఒక్క పోలిక నుండు చూడ చూడ రుచుల జాడవేరు పురుషులందు పుణ్య పురుషులు వేరయా విశ్వదాబిరామ వినుర వేమ (సబలో చప్పట్లు' బుచ్చయ్య జిందాబాద్ అని కేకలు') ఆ తర్వాత బుచ్చయ్య వరుసగా కనకపు సింహాసనమున శునకము గూర్చుండ బెట్టి ఓ బొజ్జ గణపయ్య నీ బంటు నేనయ్య వంటి పద్యాలు చదవడం మొదలు పెట్టాడు బుచ్చయ్య ఒక్కొక్క పద్యం చదివినప్పుడల్లా సబకులు చప్పట్లు చరిచారు

ఆ తర్వాత బుచ్చయ్య ఇలా అన్నాడు-

నాకు కళ అంటే ఇష్టమనీ కళాబిమానిననీ మిరంతా అనుకుంటుంటారు మిరలా నన్నబిమానిస్తున్నందుకు మి అందరకూ నా జేజేలు నిజానికి నేను మిరు అనుకునేటంత పెద్ద కళాపోషకుణ్ని ఎమి కాదు ఏదో అప్పుడప్పుడు తొ చిసంత కళాకారులకు సహాయం చేస్తుంటానంతే ఇది నాగొప్ప తనమేమి కాదు ఇది నా పూర్వికులు నేర్పిన విద్య - అంతే మాతండ్రిగారు ద్రాక్షారామంలోని సుప్రసిద్ధ నర్తకి దేవాలయ నృత్యాల్లో స్పెషలిస్టు అయిన ఆనందవల్లిని పోషించేవారు (సబలో కేరింతలు' చప్పట్లు' హర్షద్వానాలు') ఆ పరంపర ఎమాత్రం పోకుండా నేను ఈ ప్రతిబ వంటి కళాకారులను అబిమానిస్తున్నాను

మళ్ళీ సుమతిశతకంలోంచి ఒక పద్యం వేమన శతకం లోంచి రెండు పద్యాలు

నాకు ప్రత్యేకంగా ఈ క్లాసికల్ డాన్స్ అంటే అబిమానం అని మిరు అనుకోవద్దు నేను కళాబిమానిని ప్రపంచంలో వున్న అన్ని రకాల డాన్సులను అబిమానిస్తాను ఆదరిస్తాను ప్రేమిస్తాను నాకు డిస్కో డాన్సంటే కూడా ఇష్టమే (సబలో కేరింతలు)- మనం ప్రజాబిమానులం మనది ప్రజాస్వామ్యం కాబట్టి ప్రజలకేది ఇష్టమో అదే మనకూ ఇష్టం కావాలి ప్రతిబ వంటి కళాకారిణులు ప్రజలను దృష్టిలో వుంచుకుని ప్రజా నృత్యాలను ప్రోత్సహించాలి ప్రజల జీవిత సమస్యలను తీసుకుని ప్రజా రచయితల చేత నాటికలు రాయించుకొని ప్రదర్శించాలి పురాణాలు వెనుకటి లాగా ప్రజలు ఆదరించటం లేదు కాబట్టి మనం నిరుత్సాహ పడకుండా కాలానుగుణంగా పురాణ గాదలను విడచిపెట్టి కొత్త కొత్త కదలు మన రచయితలు స్వీకరించాలి (ప్రజా నాయకుడు బుచ్చయ్య జిందాబాద్)

కుమారి ప్రతిబ వేదిక మిదికి వచ్చి మా సన్మానాన్ని స్వీకరించ వలసిందిగా కోరుతున్నాను అని బుచ్చయ్య తన ప్రసంగం ముగించాడు

కార్యకర్తలు బుట్టలతో పూలదండలు తెచ్చారు గంధం కుంకుమ శాలువ తెచ్చారు

మోహినీ వేషదారిణి అయిన ప్రతిబ వేదిక మిదకు వచ్చింది ఆమెను చూడగానే సభ్యులందరూ హర్షద్వానాలు చేశారు ప్రతిబ వినమ్రంగా వారికి నమస్కరించింది బుచ్చయ్య ఆమెను స్త్రీలు వల్లె వాటుగా వేసుకునే శాలువాతో కప్పి చందన తాంబూలంతో సత్కరించాడు ఆ తరువాత సుదారాణిని నట్వాంగం నారాయణను ఇతర కళా కారులనూ రంగస్థలం పైకి పిలిచి పేరు పేరునా సత్కరించారు అంతా అయింతర్వాత ఈ నాటకం రచించిన రచయిత కూడా వేదిక మిదకు వస్తే బాగుంటుంది అన్నాడు బుచ్చయ్య

సైడు కర్టెను వద్ద నిలబడిన సుదారాణి ప్రతిబ మొహం వైపు చూచి చిరునవ్వు నవ్వింది

ప్రతిబ ఆవేశంతో రంగస్థలం మిదికి వచ్చింది బవబూతికి సన్మానం చేయించాలనే కోరిక ఆమెకు అకస్మాత్తుగా కలిగింది వేదిక మిదకు వచ్చి ఆమె బవబూతి కళ్ళల్లోకి చూసింది బవబూతి ఆమె కళ్ళల్లోకి సాబిప్రాయంగా

**జరిగినకద-5** ప్రతిబ హైదరాబాద్‌లోని రవీంద్ర బారతిలో నృత్య ప్రదర్శన ఇచ్చింది ఆమె నృత్యం చూసిన బవబూతి ఆమెకు తన అబినందనలు తెలిపాడు బెంగుళూరులోని రవీంద్ర కళాక్షేత్రంలో జరిగిన సమావేశంలో ప్రసంగించిన బవబూతిని తమ కళా మందిరానికి రమ్మని ప్రతిబ ఆహ్వానించింది వాత్సాయనశర్మ అరంగేట్రం ఆండాళ్‌ను ప్రిన్సిపాల్‌గా ఒప్పించి నటనాలయంతో పాటు కవుల కాలేజీ ప్రారంబించాడు ఆ సంస్థ పేరు విపంచి బవబూతి తాను క్షీర సాగర మదనం అనే యక్షగానాన్ని రాసినట్లు అందులో మోహిని పాత్రను ప్రతిబను అబినయించమని కోరుతూ ప్రతిబకి ఉత్తరం రాయగా తాను హైదరాబాదు వస్తున్నట్లు అన్ని విషయాలు అప్పుడే మాట్లాడుకోవచ్చని ప్రతిబ సమాదానం రాసింది క్షీరసాగరమదనంలో మోహిని పాత్రను అబినయించడానికి ప్రతిబ అంగికరించింది ద్రాక్షారామంలో ప్రదర్శన ఇచ్చేందుకు ప్రతిబ ఆమె బృందం బయలుదేరి వెళ్ళింది వారితో బవబూతి వెళ్ళాడు

చూస్తూ తన పేరు పిలువ వద్దని తాను రచయితనని చెప్పవద్దని వారించాడు బుచ్చయ్య ప్రతిబ స్టేజిపైకి ఎందుకు వచ్చిందో తెలియక ఈ నాటకాన్ని వ్రాసింది అని సాభిప్రాయంగా చూచాడు

ఆమెయే అని సబలో నుండి బవభూతి అరిచాడు

దానితో బుచ్చయ్య ఆనందంతో వూగిపోయాడు చప్పట్లు కొట్టి ప్రతిబ మెడలో మరొక పూలదండ వేయబోయాడు ఈ ఆకస్మిక సంఘటనకు ప్రతిబ నిశ్చేష్టురాలైంది

ఈ సన్మానానికి నేను అర్హురాలను కాదు నిజానికి ఇది వ్రాసిం అని ఎదో చెప్ప బోయింది కాని ఆమె మాటలు ప్రేక్షకుల కరతాళ ధ్వనుల్లో మునిగి పోయాయి

బవభూతికి ఆమెను సన్మానం అందుకో వలసిందిగా సబలో నుండే సైగ చేశాడు

బుచ్చయ్య ఇచ్చిన పూలదండను ప్రతిబ తీసుకుని గిరుక్కున తెరలోపలికి వెళ్ళిపోయింది తన పేరు బయట పెట్టవద్దనీ తాను వీరివెంట కలిసి వచ్చినట్లు ఎవరికీ తెలియనివ్వ వద్దనీ ముందుగానే బవభూతి పెట్టిన షరతు ప్రతిబకు గుర్తు వచ్చింది

తను తొందర పడి వేదిక పైకి వెళ్ళిందేమో! ఆయనకు సన్మానం చేయించాలనే తపనే తప్ప ఆయన ఎందుకలా చేయవద్దన్నాడో ఆలోచించక పోవడమే ఇటువంటి పరిస్థితి వచ్చిందని ప్రతిబ అనుకున్నది ఆమె నిరుత్తరురాలైంది

ఆరాత్రి ప్రతిబ చాలా అద్భుతంగా నర్తించిందని ఆమెతో చిరపరిచయం గల సుదారాణి మొదలైన వారంతా అనుకున్నారు

ప్రదర్శన ముగిసిన తర్వాత ప్రముఖులంతా వచ్చి ప్రతిబను మిగిలిన కళాకారులనూ అబినందించారు తర్వాత కళాకారులంతా బోజనాలకు వెళ్ళారు నట్వాంగం నారాయణ కాంట్రాక్టరు వద్ద నుండి రావలసిన లెక్కలు తమ రాక పోకలకైన ఖర్చులు కళాకారులకు ఎంతెంత ఇవ్వాలో ఆ వివరాలు -లెక్క చూచుకుంటున్నాడు

ప్రతిబ అలంకరణలు విప్పి ముఖానికి వేసిన రంగును తుడుచుకుంటూ వుండగా ఆమెకు అకస్మాత్తుగా ఇందాక జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది మేక తనపై పులితోలును కప్పుకున్నట్లు నర్తకి గానే గాక రచయిత్రిగా కూడా తనకు అనవసరమైన ఖ్యాతి ఈనాడు సబలో వచ్చింది రేపు అన్నవరం సబలోకి వెళ్ళి ఇది బవభూతి వ్రాశాడని మేం ప్రదర్శిస్తున్నామని చెప్తే ఎలా వుంటుంది? ఈ వార్త ద్రాక్షారామ ప్రజలకు తెలిస్తే వారేమను కుంటారు? తన అపకీర్తి మాట అటుంచి బవభూతికి రావలసిన కీర్తి ఈ విదంగా తనకు దక్కటం మాత్రం తనకేమంత గౌరవం? తను అయ్యవారిని చేస్తే అది కోతిగా మారింది! ఆమెకు బవభూతి స్మృతి పథంలో మెదిలాడు వెదల్పైన తెల్లని వస్త్రంతో ఆమె తన కనుబొమలను తుడుచుకుంటూ అద్దంలోకి చూచింది అందులో బవభూతి ప్రతిబింబం కనిపించింది

ఆమె గిర్రున వెనుదిరిగి చూచింది

అక్కడ బవభూతి నిలబడి వున్నాడు

ఆమె చివాలున లేచి నిలబడి ఏమిటిది? మీరెందుకిలా చేశారు? అ అడిగింది

బవభూతి నవ్వి అవును మరి! నా పేరూ వూరూ బయట పెట్ట వద్దంటే మీరు ఆవేశం పట్టలేక నన్ను రచయితగా సబకు పరిచయం చెయ్యాలన్న ఆసక్తితో వేదిక మీదికి వచ్చారు అందుకని నేను అకస్మాత్తుగా అలా అనవలసి వచ్చింది అన్నాడు

ఇదేమి బాగోలేదు

మీ ప్రదర్శన మాత్రం చాలా బాగుంది అత్యద్భుతంగా వుంది!

అందుకు కారణమేమిటో తెలుసునా? మీవంటి కవి విమర్శకుడు సబాసదులలో కూర్చుని వున్నాడన్న విషయం నాకు తెలుసు కాబట్టే నేను అలా నటించాను నిజం చెప్పాలంటే నేను నా నటనమంతా ఈ ద్రాక్షారామం ప్రేక్షకుల కోసం చేయలేదు కేవలం మిమ్మల్ని దృష్టిలో పెట్టుకునే చేశాను ముఖ్యంగా నా సాత్త్వికాబినయం అందలి బేదాలు మూర్ఛనలు అన్నీ మీరు



పరిశీలిస్తున్నారని తెలిసి నేను ఎంతో భక్తి శ్రద్ధలతో నటించాను

బవభూతి ఆమెకు సమీపంగా వచ్చాడు తెల్లని వస్త్రాన్ని తీసుకుని ఆమె చెవులకు వెనుక బాగాన మెడ మీద వున్న రంగును తుడిచివేశాడు

ఆమెకు అరచేతిలో కొద్దిగా నూనె వేశాడు దానిని ఆమె మళ్ళీ ముఖానికి మర్దించుకున్నది

ఇంతలో సుదారాణి అక్కడకు వచ్చింది ఆమె ప్రతిబకు మేకప్పు తీసి వేయడంలో సహాయం చేసింది

బవభూతి తన చెవుల వెనుక బాగంలోనూ మెడమీద రంగును తుడుస్తున్నప్పుడు ప్రతిబ ఒక విచిత్రమైన అనుభూతిని పొందింది అది ఇట్టిదట్టిదని చెప్పడానికి వీల్లేదు బవభూతి అలా చేస్తాడని ప్రతిబ ఊహించలేదు. బహుశ బవభూతి కూడా ఆక్షణాన అలా చేయ వలసి వస్తుందని

# ప్రతిభ

అనుకోలేదు ప్రతిబ మెడ వెనుక బాగంలోని రంగును సరిగా తుడుచుకోలేక పోయింది అందుకని బవబూతి అకస్మాత్తుగా ఆ వస్త్రాన్ని తీసుకుని ఆమెకు సాయం చేశాడు నిజానికి అది చాలా స్వల్ప సంపటనే కాని అతడు ప్రతిబ కన్నుల్లోకి చూచినపుడు తానిలా ఎందుకు చేశానా అని ఒకసారి అనుకున్నాడు ఆమె వేషాన్ని సడలించేందుకు ఒక్క సుదారాణి తప్ప మరెవ్వరూ వచ్చి సహకారం చేస్తున్నట్లు కనపడదు తానలా చేస్తే ఆమె ఏమను కుంటుందో ఏమోననే ఆలోచన ఆక్షణంలో రాలేదు తర్వాత దాన్ని గురించి ఆలోచిస్తుంటే అదేమంత పెద్ద ఆలోచింపదగిన సంపటన కాదని ఒక్కక్షణం అనిపిస్తున్నది

ఎందుకు కాదు ఆమె మేకప్పు కూడా పరపురుషులతో చేయించుకోదు స్వయంగా చేసుకుంటుంది సుదారాణి మాత్రమే సాయం చేస్తుంది అలాంటప్పుడు తాను చేసిన ఈ పనిని ఆమె ఎలా అర్థం చేసుకుంటున్నదో'

నిజానికి సంపటన చిన్నదా పెద్దదా అన్న విషయం ఆ సంపటన మీద కాక ఆ సంపటనను ప్రతిబ అర్థం చేసుకోవడం మీద ఆదారపడి వుంటుంది – అని బవబూతి అనుకున్నాడు

బవబూతి ఆమె గదిలో నుండి బయటకు వెళ్ళిపోయాడు బవబూతికి బోజనం చేయ బుద్ధి పుట్టలేదు పాలు పండ్లు తీసుకుందామనుకున్నాడు కాని అందుకు మనస్కరించలేదు ఆరుబయట అటూ ఇటూ తిరుగుతూ వున్నాడు నట్వాంగం బృందమంతా బోజనం ముగించి తాంబూలాలు నములుతూ ద్రాక్షారామం గురించి తమకు తెలిసిన ముచ్చట్లు కథలు గాథలుగా చెప్పుకుంటున్నారు

ద్రాక్షారామానికి పూర్వం దక్షతపోవన దక్షవాటిక అనే పేరు వుండేదట ఇక్కడి శివలింగాన్ని వ్యాసుడు ప్రతిష్ఠించాడని స్థానిక స్థల పురాణాలలో వ్రాయబడి వుంది దాక్షాయని తన తండ్రికి శివుడు చేసిన అవమానాన్ని బరించలేక యోగాగ్నిలో ఆహుతయిన ప్రదేశం ఇదేనని స్థానికులు కథలుగా చెప్పుకుంటూ వుంటారు అత్రి గౌతముడు కశ్యపుడు బరద్వాజుడు విశ్వామిత్రుడు జమదగ్ని వశిష్ఠుడు – వీరంతా ఈ ప్రాంతానికి వచ్చి ఈ స్వామిని అబిషేకించారట ఆ ఋషుల పేరు మీదనే ఇక్కడి గోదావరి సప్తపాయలుగా ఆ ఋషుల పేరున పిలువబడుతోందట ఇవన్ని వింటున్నాడు స్త్రీ అవమానాగ్నిని బరించలేనపుడు తనను తానే దహించి వేసుకుంటుందనే విషయం అతనికి జ్ఞప్తికి వచ్చింది

మన ప్రతిబకు ఈ సప్త గోదావరికి ఏదో సన్నిహిత సంబంధం వుందట

ఒకడు రెండవ వాని చెవిలో గుసగుసలు చెప్పినట్లు చెప్తున్నాడు

అవును అందుకే శ్రమకోర్చి ఆమె ఈ ద్రాక్షారామ ప్రాంతం వంటి మారుమూలల్లో ప్రదర్శనకు వచ్చిందిట నిజానికి ఇంత తక్కువ కాంట్రాక్టుకు ఇంతకు ముందెన్నడూ ఆమె ఒప్పుకోలేదుట

గుసగుసలు క్రమంగా సద్దుమణిగాయి

అర్ధరాత్రి దాటి పోయింది

ఆకాశంలో చుక్కలు పాడే నిశ్శబ్ద నీరవ సంగీతం బవబూతి ఏకాంతంగా వింటున్నాడు

అతనికెందుకో ప్రతిబ నిద్రపోవడం లేదనే విషయం అకస్మాత్తుగా స్ఫురించింది

పూలమొక్కల పక్క నుండి చప్పుడు చేయకుండా నడిచి వెళ్ళి చూచాడు

అలా వెళ్ళడం తప్పా ఒప్పా అన్న విషయం కూడా ఆలోచించలేదు నిజమే'

ప్రతిబ గదిలో మంచం మీద ఏకాంతంగా కూచుని దుఃఖిస్తున్నది సుదారాణి మాత్రం పక్కనే ఒడలు మరచి నిద్ర పోతున్నది

## 6

పూర్వం ఉపన్యాసాలల్లో వేదాలు ఉపనిషత్తులు ఉదాహరిస్తూ







వుండేవారు ఆనాటి వక్తలకు శ్రోతలకు కూడా ఆ పాండిత్యం వుండేది కాని ఈ నాడు ఈ బక్కపీచు బుచ్చయ్య సుమతీశతకం వేమనశతకం పద్యాలు చదివి వినిపిస్తూంటేనే ప్రజలు చప్పట్లు కొడుతున్నారు

ఏ మాత్రం సందర్భశుద్ధి లేకుండా వేదికలపై ఎలా వాగినా అది ఈనాడు ఉపన్యాసం కింద చలామణీ అవుతున్నది – అన్నాడు బవభూతి ప్రతిబతో

నిజం చెప్పవద్దూ! ఆయన ఏం మాట్లాడాడో నేను సరిగ్గా వినలేదు

అదేమిటి? మీరు అక్కడే సైడు కర్టెన్‌లో నే వున్నారు గదా?

నిజమే – అప్పటికే నేను పాత్రతో తాదాత్మ్యం పొందటం మొదలుపెట్టాను అంది ప్రతిబ

బవభూతి కన్నులు ఆమె సమాదానానికి ఆనందంతో మెరిసాయి

ద్రాక్షారామం నుంచి ప్రతిబ బృందం వాళ్ళు అన్నవరం చేరారు తూర్పుగోదావరి జిల్లాలోని సుప్రసిద్ధ క్షేత్రాలలో ఇది ముఖ్యమైనది ఇక్కడ స్వామి వారికి ప్రతి సంవత్సరం కళ్యాణోత్సవాలు జరుగుతుంటాయి ఆ సమయంలో ఎంతో ఖరీదైన నృత్య గీత వాద్య సంగీత సాహిత్య కార్యక్రమాలు స్వామివారి సన్నిదిలో దేవస్థానంవారు ఏర్పాట్లు జేస్తుంటారు ఆలయ సమీపంలో గెస్ట్‌హవుస్ సత్రాలు కాటేజీలు వున్నాయి సామూహిక సత్యనారాయణ వ్రతాలు చేసుకునేందుకు తడవకు ఐదు వందల మందికి తగ్గకుండా పట్టే షెడ్లు రెండు వున్నాయి ఎత్తైన గుట్టకు కింద పంపా సరోవరం వుంది హృదయాన్ని ఆహ్లాదపరిచే సహజ రమణీయమైన ఆ దృశ్యాలు చూచేసరికి బవభూతి మనస్సు ఆనంద తాండవం చేసింది దక్షాధ్వర ధ్వంసం – అపారమైన తపస్సు –కామదహనం– కుమార సంబవం – ఇవన్నీ కలిసి వచ్చేటట్లు ఒక నృత్య సంగీత రూపకాన్ని రచించాలని అనుకున్నాడు అందలి ప్రదాన పాత్రను ప్రతిబను దృష్టిలో నుంచుకుని రూపొందించాలి అనుకున్నాడు బవభూతి

గుట్ట మీద నుంచి నడిచి కిందికి వెళ్ళడానికి ఒక మార్గం వుంది అలా కాక కార్లు జట్కాబండ్లు పోయేందుకు మరొక రోడ్డు కూడా వేశారు కాలి బాట వెంట నడచుకుంటూ బవభూతి గుట్ట కిందికి దిగాడు అక్కడ చిన్న చిన్న టీ దుకాణాలున్నాయి అక్కడ చేరిన జనం టీ తాగుతూ రాత్రి గుట్టపై జరగబోయే ప్రదర్శనాన్ని గురించి ముచ్చటించుకుంటున్నారు ఉత్సవాల సమయం కావటంతో అన్నవరం మొత్తం చాలా రష్‌గా వుంది ప్రతిబ చాలా గొప్ప కళాకారిణి అనీ ఆమె ప్రదర్శన చూడ్డం అదృష్టమనీ అక్కడ కూర్చున్న వారు అనుకుంటున్నారు

నిజమేరా! ఈ రోజుల్లో ఇంత బాగా సాదన చేసిన వారు అరుదు కాని ఒక తరానికి ముందు మాత్రం మన గోదావరి జిల్లా సంగీత సాహిత్యాలకు పెట్టింది పేరు ముఖ్యంగా నృత్యాలకు మన జిల్లా అఖిలబారత కీర్తి సంపాదించుకుంది అన్నాడొకడు

ద్రాక్షారామంలో అమ్మవారి పేరు మాణిక్యాంబ ఆ పేరుతోనే ఒక దేవదాసి అక్కడ తన జీవితమంతా ఆలయ కైంకర్యంలో గడిపి తరించిందట! నేటికి దీనిని అక్కడి స్థానికులు కతలుగా గాదలుగా చెప్పుకుంటూ వుంటారు అన్నాడు మరొకడు

అక్కడ దాకా ఎందుకు? – మన వెనక వీదిలో పారిజాతమ్మ లేదూ! ఆమె పూర్వం వయసులో వున్నపుడు చాలా గొప్ప నర్తకిట ముసలిదై ఆలనా పాలనా లేక ఇప్పుడలా కాలం వెళ్ళబుచ్చుతున్నదిగాని

నిజమా?

అవును పెరటి మొక్క మందుకు పనికిరాదన్నట్లు మనవాళ్ళ గొప్పతనం మనకు తెలియదు మొన్న మొన్నటిదాకా మన జిల్లాలలో ముఖ్యంగా మండపేట ప్రాంతంలో చాలా పెద్ద పెద్ద కళాకారులుండేవారు ఎన్నో బాగవత మేళాలు వుండేవి ఈ సినిమాలు వచ్చాక క్రమంగా ఆ కళలన్నీ నశించాయి

బవభూతి ఈ మాటలన్నీ విన్నాడు ఆయనకెందుకో ఒకసారి పారిజాతమ్మను కలుసుకోవాలనిపించింది ఈమె వల్ల తనకేదో ఒక అపూర్వ రహస్యం తెలియబోతున్నదని ఆయన మనస్సుకు అతీంద్రియ ప్రజ్ఞ వంటిది కలిగి చెప్పినట్లయింది

పారిజాతమ్మ ఇల్లు తెలుసుకోవడానికి బవభూతికి పెద్ద కష్టం కాలేదు ముందు బాగం అంతా గడ్డితో కప్పబడిన పంచ కింది బాగంలో ఆచ్ఛాదనగా కొన్ని గోనె పట్టాలున్నాయి లోపలి ఇల్లంతా పెంకులతో కప్పబడి వుంది

ఇక్కడ పారిజాతమ్మగారు ఎక్కడ వుంటారు?

బవభూతి అక్కడ గచ్చు మీద కూచున్న ఒక ముసలమ్మను ప్రశ్నించాడు

ఆమె నవ్వి ఎవరు బాబూ నీవు? నేనే ఆ పారిజాతాన్ని అన్నది

బవభూతి ఆమెకు నమస్కరించాడు

కూర్చో నాయనా కూర్చో! ఎక్కడ నుండి వచ్చావు?

హైదరాబాదు నుండి వచ్చానంది స్వామి వారి కళ్యాణోత్సవాలు చూద్దామని మీ పేరు నేను చాలాసార్లు లోగడ విని వున్నాను అందుకని ఒకసారి కలుసుకుందామని వచ్చాను అన్నాడు

ఆమె నవ్వింది

ఆ నవ్వుకు ఆవిడ ముసలి బుగ్గలపై సొట్టలు పడ్డాయి అది చూచి ఈమె ఒకప్పుడు మహా సౌందర్యవతి అయి వుండాలని బవభూతి ఊహించాడు

పారిజాతమ్మ ఇంట్లో వాళ్ళు లోపలినుండి బయటికివచ్చి కొత్తగా వచ్చిన బవభూతిని చూచి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయారు బహుశః అప్పుడప్పుడు ఇలా అడపాదడపా ఎవరో పత్రికలవాళ్ళో సాహితీవేత్తలో ఎవరో ఒకరు వస్తుంటారని అందుకే బహుశ తన రాక ఇంట్లో వాళ్ళకి కొత్తగా అనిపించలేదని బవభూతి ఊహించాడు

రాత్రి మొత్తం వెన్నెల కాచి అలసిపోయి తెల్లవారు జామున మసకబారిన చంద్రబింబంలా ఉన్నది పారిజాతమ్మ ఆమెకు ముసలితనపు చాదస్తం కూడా కొంచెం పట్టుకున్నది పలకరిస్తేనే చాలు అచ్చట్లు ముచ్చట్లు చెబుతున్నది

గుట్టమీద ఇవ్వాళ కూచిపూడి కళా నృత్యం ప్రదర్శిస్తున్నారట కదా

# ప్రతిభ

పారిజాతమ్మ గారూ! బవభూతి మెల్లగా కదిపాడు

అవును నాయనా! ఈ దేవస్థానం బోర్డువారి పుణ్యమా అని అడపాదడపా ఇలాంటి కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నారు కాని పూర్వం పరిస్థితి ఇలా వుండేదికాదు ఇక్కడి జమిందారులందరూ ఎంతెంత కళా పోషణ చేశారో మీ తరం వారికి తెలియదు ఆ రోజుల్లో మేం ఉబయ గోదావరి జిల్లాల్లో బాగవత విద్యను ప్రదర్శించేవాళ్ళం ఈ నాట్య సంప్రదాయం మరెక్కడా లేదు నా గూర్చి నేను చెప్పుకోకూడదు గాని నా స్నేహితురాలు దుగ్గిరాల మాణిక్యమ్మ వుండేది ఆమె పేరు చెబితే ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు కాళి కమలాక్షి బాగవత కేళికి బయలుదేరితే అది ఒక మహారాణి దర్జాలా వుండేది కాగడాల వారు ముందు నడుస్తూ వుండగా దాస దాసీ జనం వెంట నడుస్తూ వుండగా తొమ్మిదిమంది బోయీలు పల్లకీ మోస్తూ వుండగా ఆమె సాక్షాత్తూ సత్యబామలాగా వెలుతుండేది చింతా అంబాసాని మారంపల్లి పెద వెంకటరత్నం చిన వెంకరత్నం వైదేహి ఇందువదన పువ్వుల పాపాచలం పెండేల సత్యబామ శ్రీరాజితం మొదలైన కళాకారులు అనాడు వెలిగిన వెలుగు తలచుకుంటే ఇప్పటికీ నా కళ్ళ ముందు ఆ బంగారు కాలం అంతా సినిమాలాగా కనపడుతూంది

ద్రాక్షారామంలో ఆనందవల్లి అని ఒక ప్రముఖ కళాకారిణి కూడా వుండాలి కదూ? బవభూతి తన అతీంద్రియ ప్రజ్ఞ వల్ల తాను ఊహించిన ఒక సమస్యకు సమాదానం కోసం అడిగాడు దానికి పారిజాతమ్మ ఇలా సమాదానం చెప్పింది

అవును నాయనా! బాగా గుర్తు చేశావు ఒకనాడు ఆంధ్రదేశాన్నంతా తన నాట్య కళావైబవంతో ఉర్రూతలూగించి సూర్యచంద్రుల వలె ఒక్క వెలుగు వెలిగిన రంగస్థల నర్తకి ఆమె అస్మాతో తీసుకొని చచ్చిపోయింది ఇంతకూ నాదో ప్రశ్న కళాకారిణులకు పెళ్ళి అవసరమంటావా?

బవభూతి విస్తుపోయాడు

ఆయన మనసులో కొన్ని సంవత్సరాలుగా మెదులుతున్న ఒక బలమైన సందేహం అకస్మాత్తుగా పారిజాతమ్మ ముఖం నుండి ప్రశ్నగా తన ముందే నిలబడింది దానికి అవుననో కాదనో తానే సమాదానం చెప్పాలి కాని అలా చెప్పలేని స్థితి తనది ఎందుకంటే ఈ విషయంలో తానిప్పుడొక అన్వేషణ మొదలుపెట్టాడు అది పల రూపాన్ని చెందకుండా తానప్పుడే ఒక అబిప్రాయాన్ని ఎలా ఏర్పరుచుకోగలడు?

ఆనందవల్లి గొప్ప నర్తకి నాయనా! అంతేకాదు గొప్ప స్టేజి నటి కూడాను తులాబారంలో సత్యబామ రోషానారాలో రోషనార సీతారామ కళ్యాణంలో కైక విషాద సారంగదరలో చిత్రాంగి ఇలాంటి పాత్రలకు ఆమె పెట్టింది పేరు స్వాదినపతిక ఖండిత నాయికాబినయంలో ఆమెకు ఆమెయే సాటి అందుకే ఆమె ఆయా పాత్రలనే ఎన్నుకునేది బ్రతికి వున్నప్పుడు ఈ జమిందారులంతా ఆమె ఆటనూ పాటను చూచి వేనోళ్ళ ప్రశంసించారు బ్రిటిష ప్రబుత్వంవారు మెచ్చి మెడల్సు ఇచ్చారు కాని చివరి దశలో ఆమె మందుకు కూడా నోచుకోలేక పోయింది కడుపున బుట్టిన సంతానాన్ని ఏ అనాదాశ్రమంలోనో చేర్పించి చివరకు దిక్కులేని చావు చచ్చింది ఆమె పోయాక ప్రముఖ విమర్శకులు కవులు నాట్య శాస్త్రవేత్తలు ఆమె పైన పోటోలతో సహా వ్యాసాలు వ్రాసి ప్రకటించారు ఇలా వ్యాసాలు వ్రాసినందుకు వారికి పాతిక వంద యాభై ఇలా పారితోషికాలు ముట్టాయి ఆమెపై వ్యాసాలు వ్రాసి డబ్బు సంపాదించినవారు ఆమె కళ యొక్క గొప్పదనం గురించి వ్యాసాలు ప్రకటించి పత్రికలు అమ్ముకున్నవాళ్ళు ఆ వంద రూపాయలు నెలనెలా ఆమెకిచ్చినట్లయితే ఆమె ఇంకా చాలాకాలం బ్రతికి వుండేది ఇంతకూ ఆమె మరణించడానికి కారణమేమో తెలుసా?

పేదరికం!

కాదు కళా దారిద్ర్యం!

అంటే?

అంటే ఏమిటో చెప్తాను విను బుల్లెమ్మాయ్! రెండు కాపీలు తెచ్చి పెట్టమ్మా! పారిజాతం కేక వేసింది

లోపలినుంచి బుల్లెమ్మాయ్ అనబడే వ్యక్తి కూతురో కోడలో ఎవరో మరి రెండు కాపీలు తెచ్చి ఇచ్చింది

పారిజాతమ్మ కాపీ చప్పరిస్తూ చూడు నాయనా నేనేదో ముసలిదాన్ని ఏదో వాగుతున్నాను నీకేమి విసుగు అనిపించటం లేదు కదా?

లేదమ్మగారూ! మీరు మాట్లాడుతుంటే నాకెంతో ఉత్సాహంగా వుంది బరత మహాముని స్త్రీరూపంలో సాక్షాత్కరించినట్లుంది

మరి అంతగా పొగడకు నాయనా! ఇలా పొగడ్తలు వినీ వినీ చూడు ఎలా ముసలిదాన్నయానో! ఈ కళాకారులు అంతా ఇంతే కళాకారులు నటరాజుని పూజిస్తుంటారు ఎందుకో తెలుసా? ఆయన సంద్యా తాండవం చేసేటప్పుడు నంది బృంగి వీరబద్ర చండీశ్వరాది సమస్త ప్రమదగణమూ నట్యాంగంలో కూర్చుంటారు బ్రహ్మ విష్ణువు సరస్వతి లక్ష్మి వీళ్ళంతా ఆయన నాట్యానికి సంగీత నేపద్యం సమకూరుస్తూ వుంటారు అంతటి విశ్వ నర్తకుడికి చివరకు మిగిలేదేమిటో తెలుసునా స్మశానంలో బూడిద! ఓ పట్టు పీతాంబరమో ఓ కస్తూరి తిలకమో పెట్టుకుంటాడంటే అది లేదు పుడకల పూసలు బొమికల దండలు పాములు చర్మాలూ కపాలాలూ ఇవే ఆయన ఆస్తి! ఆనంద తాండవం చేసే శివునికి సంకేతాలివి! ఇక ఆయన పాదాలను పూజించే మాకు మాత్రం ఇంతకన్నా వేరే ఏం మిగులుతుంది చెప్పు! చాదస్తం కొద్ది ఏదో చెబుతున్నాను నాయనా! విసుగుపుట్టడం లేదు కదా?

లేదండీ లేదు

కాపీ తాగు చల్లారిపోతుంది

ఇంతకీ ఏం చెపుతున్నానూ? ఆనందవల్లి గూర్చి కదూ – అవును – ఆమె

# రైతు సోదరులు, చేతి పని వృత్తుల వారు, రోజు వారి కూలీలు...

## సురక్షితమైన, సుఖవంతమైన భావి ప్రణాళిక నేడే రూపొందించుకోండి.


రజకులు

## జాతీయ పొదుపు సంస్థవారి
## 10 సం॥ల సాంఘిక భద్రతా సర్టిఫికెట్లు కొనండి.

- సం॥నికి 11.5 శాతం వడ్డీ.
- 10 సం॥ల పాటు ఉచిత భీమా సౌకర్యం.
- సులభంగా లభ్యం.
- 10 సం॥లలో మీ ఆదా మూడింతలు.


రైతులు


చేపలు పట్టువారు (జెస్త వారు)


రాళ్లు కొట్టువారు (చేతపనివారు)


చర్మకారులు

నిర్ణీత ఆదాయం లేని మీకోసం రూపొందించబడ్డ జాతీయ పొదుపు సంస్థవార 10 సం ల సాంఘిక బద్రతా సర్టిపికెట్లు వీటితో మి కుటుంబానికి సురక్షతమైన, సుఖవంతమైన బవిష్యత్తు మి ఆదా మొత్తం 10 సం లలో మూడింతలు అవడమే కాకుండా ఉచిత బీమా సౌకర్యం కూడా లబిస్తుంది

ఈ సర్టిపికెట్లు కొనడం ఎంతో తేలిక మిగతా బీమా పథకాల్లో లా కాకుండా డాక్టర్ సర్టిపికెట్‌తో నిమిత్తం లేదు 18 సం నుండి 45 సం ల వయస్సు గలవారు ఏ పోస్టాఫీసులోనైనా డబ్బు చెల్లించి వెంటనే ఈ సర్టిఫికెట్లు పొందవచ్చు ఇవి రూ 500/- మరియు రూ 1000/-ల మూల్యాలలో దొరకుతాయి

మిగతా వివరాలకై –
మి దగ్గర్లో నున్న ఏజెంటును కాని
పోస్టాపీసులో కాని సంప్రదించండి
లేదా మి జిల్లా కలెక్టరు కార్యాలయములోని
స్మాల్ సేవింగ్స్ తహసీల్‌దారుని గాని బారత
ప్రభుత్వ జిల్లా సేవింగ్స్ అధికారిని గాని
ప్రాంతీయ డెప్యూటీ డైరక్టరు (స్మాల్ సేవింగ్స్)
గారిని గాని సంప్రదించండి

జారీ చేసినవారు –
కమిషనర్ స్మాల్ సేవింగ్స్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హిమాయత్‌నగర్ హైదరాబాదు - 500 029

అధిక వడ్డీతో పాటు
ఉచిత భీమా సౌకర్యం
కల్పించే సంస్థ
దేశంలో ఇదొక్కటే



## జాతీయ పొదుపు సంస్థ
మీ భద్రతే మా లక్ష్యం.

TARA/CSS/1/85-86

## ఆలస్యం అయితే ఏం?

అధిక మాసాల వల్ల
ఆలస్యంగా వచ్చావా
అయినా పరవాలేదు
అస్సాం సమస్య తేల్చి పారేశావు
పంజాబు తగాదా పరిష్కరించావు

గుజరాత్ గొడవలు అంతరించాయి
రాజీవు గాంధికి
కీర్తి తెచ్చావు
వినాయకులందరికీ
విమర్శించే పని లేకుండా చేశావు

అవినీతి పనిపట్టి
ఆనందమును ఇమ్ము
అమ్మ తనయ
హారతుల నందింతు
హాస్యప్రియుడ

• —ఎం ఎస్ ఎం

## ప్రతిభ

ఒకనాడు తులాబారంలో సత్యబామ వేషం వేసింది ఆ ప్రదర్శనను ఇక్కడి జమిందారు గారు ఏర్పాటు చేశారు ముందు వరుసలో జమిందారుగారు రాణీగారు కుమార రాజావారు ఇతర సంస్థానాల పెద్దలు కూర్చున్నారు వెనుక మొత్తం ఇసుక వేస్తే రాలకుండా కిటకిటలాడిపోతున్నది సర్వాలంకారభూషితమై ఆనందవల్లి రంగస్థలం మీదికి వచ్చింది ఆమెను చూచేసరికల్లానే ప్రజలు సమ్మోహితులయ్యారు ఒక నటి వివిధ రసాలను వెంటవెంట నటించడం చాలా కష్టమంటారు అలాంటిది బళ్ళారి రాఘవగారు మా కాలంలో – హిరణ్యకశిపుని వేషం వేసినపుడు ప్రహ్లాదుణ్ణి చూచి కుడికంట ప్రేమను ఎడమకంట క్రోదాన్ని ప్రదర్శించేవారు దీన్ని బ్రిటిష్ పత్రికలు కూడా ప్రశంసించాయి కాని ఆనందవల్లి ఒక కంటిలోనే రెండు మూడు రసాలు ప్రదర్శించేది ఒక్కొక్క చూపు ఒక్కొక్క రసాబినయానికి పట్టిన మన్మదబాణంలా వుండేది ఆమె అబినయాన్ని అంతకుముందు కుమార రాజావారు చూచి వుండలేదు ప్రదర్శన మొత్తం ముగిశాక వేదిక మీద ఆమెకు కార్యక్రమానంతరం ఘనంగా సన్మానం జరిగింది మరునాడు నాటక బృందంవారు అక్కడి నుంచి వెళ్ళిపోయే సన్నాహాలు చేస్తున్నారు ఇంతలో ఆమెను కుమార రాజావారు రమ్మంటున్నారని కబురు వచ్చింది తగిన వారిని వెంట బెట్టుకుని ఆమె రాజావారి బంగాళాకు వెళ్ళింది తను వచ్చిన వార్త లోపలకు కబురు పెట్టింది రాజావారు మందిరోపరి బాగం నుంచి చెక్కలతో చేసిన సోపాన పంక్తం దిగి క్రిందికి వచ్చారు ఆనందవల్లి ఆమె వెంట వచ్చినవారు యువరాజా వారికి నమస్కరించారు ఆయన వారిని కూచోమని తానూ కూర్చున్నాడు రాజావారి ఆస్థానంలో ఎవరూ ఎక్కువ మాట్లాడకూడదు ఎవరైనా అడిగితే యుక్తాయుక్తంగా సమాదానం చెప్పాలి ఎక్కువ తక్కువ మాట్లాడగూడదు అతిగా ప్రశంసించినట్లుండగూడదు విమర్శించినట్లు అసలే వుండగూడదు సమాదానంలో వెకిలి తనమూ కటువు యాచన వుండగూడదు ఎంత జాగ్రత్తగా మాట్లాడినప్పటికి గూడా ఒక్కొక్కపుడు ఈ ఆశ్రితుల సమాదానాలు రాజుల మనస్సును రంజింపజేయలేవు అందువల్ల ప్రభువుల దర్బారుల్లో మెలగడం కత్తి మీద సాము వంటిది ఒక్కొక్క సారి వారు దివానుల ద్వారా కబురు పంపి ఆశ్రితులకేమేమి కావాలో చేస్తారు చాలా అరుదుగా దర్శనాలు ఇస్తారు ఆశ్రితులు కళాకారులు చెప్పిన మాటలను వారు సగం వింటారు సగం వినరు ఒక్కొక్కప్పుడు విననట్లు అబినయిస్తారు కొంచెం తల ఊపుతారు చిరునవ్వు నవ్వుతారు ఇష్టం వుంటే ఆశ్రితుల వైపు ఒకసారి కన్నెత్తి చూస్తారు లేకుంటే లేదు అలా చూస్తేనే చాలు ఈ కళాకారులు తమ జన్మం దన్యమైనట్లు బావించుకుంటారు ఈ జమిందారులందరూ కూడా నిజానికి విద్వాంసులూ కళాశాస్త్ర మర్మజ్ఞులూ కాదు కాని సాటి సంస్థానాదిశుల్లో తమకు కూడా గొప్ప కళా పోషకులనే పేరు చిరస్థాయిగా వుండాలనే ఆశతో కొందరలా చేస్తుంటారు ఉత్తరాంధ్ర దేశంలో ఆనందగజపతి వారూ తెలంగాణాలో గద్వాల వనపర్తి సంస్థానాధీశులు ఇలా కొంత మంది స్వయంగా కవి పండితులు కళాబిజ్ఞులు కూడా లేకపోలేదు వీరంతా ఆనాడు ఇంగ్లీషువాళ్ళ రాజ్యమే వుండాలని అంటుండేవారు స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహం చేసిన వాళ్ళని లారీలతో కొట్టించి ఏనుగులతో తొక్కించి బాదించారు తమాషా ఏమిటంటే స్వాతంత్ర్యం వచ్చాక ఈ సంస్థానాదిపతులలో కొంతమంది అదికార పార్టీలో చేరి పాలకులయ్యారు ఫ్యాక్టరీలు కర్మాగారాలు పెట్టుకొని కోట్ల కొలది సంపాదిస్తున్నారు – నేను చెపుతోంది విసుగు పుడుతుందా నాయనా

లేదండి – ఆనందవల్లి కథ చెప్పండి

పారిజాతం నవ్వింది ఆ నవ్వుకు చాలా అర్థాలున్నాయి ఆ అర్థాలేమిటో బవబూతి గ్రహించి మళ్ళీ చిరునవ్వుతోనే సమాదానం చెప్పాడు

ఏదో చాదస్తంగా ఇలా నీ బోటి వాళ్ళు ఎవరైనా అడపాదడపా వస్తూ వుంటే పాతస్మృతులన్నీ ఒకసారి గుర్తుకు వస్తాయి ఆ నాటి ఆ కళలూ వైబవాలూ అవన్నీ ఎవరికి చెప్పుకోను? మా బుల్లెమ్మాయికి అక్కర్లేదు బుజ్జిగాడికి అంతకన్నా పని లేదు అప్పలనరసయ్య సరేసరి! ఎంతసేపూ వాడూ వాడి బిజినెస్సు అందుకని ఏదో తోచినట్లు వాగుతుంటాను – ఏ మాటకామాటే చెప్పుకోవాలి కళాకారులను పోషించే విషయంలో చాలా గొప్పకు పోయే వారు ఇంతకూ ఏమి చెప్తున్నాను? అవును ఆనందవల్లి కథ కదూ– ఆనందవల్లి కుమార రాజావారు రాగానే లేచి వినమ్ర నమస్సుమాంజలి సమర్పించింది కుమార రాజావారు ఆ వందనాన్ని సానందంగా స్వీకరించారు అప్పుడు వారు ఇలా అన్నారు

లోగడ మేం చాలా కళాప్రదర్శనలు చూశాం కాని నీ నటన చూడకపోవడం లోపమేనని నాకిప్పుడనిపిస్తున్నది ముఖ్యంగా స్వాదీనపతిక అబియంలో మీర జాలగలదా నా యానతి వ్రత విదాన మహిమన్ అనే పట్టం నీవు అబినంచేటప్పుడు నన్ను నేను మరచిపోయాను మీ వంటి కళాకారిణి మా మండలంలో పుట్టడం తెలుగుదేశంలో వుండడం మా అదృష్టం

దన్యురాలిని – ఇదంతా మీకు మా బోంట్లపైగల అబిమానాన్ని కరుణను చూపిస్తుంది

లేదు నేనేదో ముఖస్తుతిగా చెప్పటం లేదు నేను మనస్ఫూర్తిగా ప్రశంసిస్తున్నాను మీకు అబ్యంతరం లేకపోతే మా సంస్థానంలో మరి కొన్నాళ్ళుండి మా ఆతిద్యాన్ని స్వీకరించవచ్చు

దన్యులం మహాప్రభూ! కాని విజయనగరంలోనూ విశాఖపట్నంలోనూ బందరులోనూ వరుసగా కొన్ని ప్రోగ్రాములు ఒప్పుకున్నాము అన్నాడు ఆమె వెంట వచ్చిన వారిలో ఒకడు

కుమార రాజావారు ఒక్కక్షణం ఆగి మంచిది! మీ కార్యక్రమాలు అయిపోయిన తర్వాత ఒకసారి మా సంస్థానానికి రండి అని మళ్ళీ దారు సోపాన పంక్తిని అదిరోహించి కుమార రాజావారు తమ గదిలోకి వెళ్ళిపోయారు హాల్లో కూర్చున్న కళాకారులకు ఉండాలో వెళ్ళాలో తెలియదు రాజావారు వెళ్ళమనకుండా వెళ్ళడం ఒక నేరమవుతుంది అట్లని వారు వుండమని కూడా అనలేదు అందుకని వారు సందిగ్ధావస్థలో పడి దిక్కులు చూస్తున్నారు ఇలాంటి సందర్భంలో ఒక్కొక్కపుడు ఏ పరిచారికయో వచ్చి రాజావారు మీకు ఈ బహుమతిని అందజేయమన్నారు అని ఇచ్చిపోవడం కూడా కద్దు అందుకోసం వారు డోలాందోళిత మనస్కులై వుండగా కొన్ని క్షణాల్లోనే అనుకున్నట్లుగా జరిగింది మెట్లు దిగి పరిచారిక ఒకతె వచ్చి నటి ఆనందవల్లిని రాజావారు రమ్మంటున్నారు అని చెప్పింది

(ఇంకా ఉంది)




### ఎ వి కె –హైదరాబాదు

నాకు జలుబు రెండు సంవత్సరముల నుండి వున్నది ఇ యన్ టి స్పెష లిస్టుకి చూపిస్తే ఎ విటమిను తక్కువగా వున్నదని అన్నారు ఎక్స్‌రే తీసి మాత్రలు యిచ్చారు నాకు తగ్గలేదు వర్షా కాలములో ఎక్కువగా ఇతర కాలములందు తక్కువగా వుంటుంది

● దీనిని క్రానిక్ వెరాక్సిస్మల్ రైనోరియా అని అంటారు కొన్ని సం ల తర్వాత ఈ లక్షణం దానంతట అదే తగ్గిపోతుంది అంతవరకూ క్లోరొఫెనిరమిన్ మాలియేట్ మాత్రలు విటమిన్ ఎ మాత్రలు వాడటం వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుంది

### ఎ ఆర్ –తిరుపతి

మా అమ్మ వయసు 45 సంవత్సరములు ఆమెకు ఒక సంవత్సరం నుంచి ఒళ్ళు మరదలుగా వుంటున్నది ఎన్ని మందులు వాడినా తగ్గుటలేదు చర్మవ్యాధుల నిపుణులు ఫైన్‌లోన్ కోహైడెల్ట్రా లెదర్ కార్ట్ ఆయింటు మెంటును వాడమన్నారు అవి వాడినన్ని రోజులు కొంత తగ్గినట్లుగా వుంటున్నది వాడకపోతే మళ్ళీ మామూలుగా వస్తున్నది ఈ మరదలు శాశ్వతంగా తగ్గే మార్గం చెప్పండి

● కాల్షియం మాత్రలు విటమిన్ ఎ మాత్రలు క్లోరొఫెనిరమిన్ మాలియేట్ మాత్రలు వైద్యుల సలహా ప్రకారం వాడండి సీరం కాల్షియం బిలురుబిన్ పరీక్ష లివర్ పంక్షన్ టెస్టులు చెయించి ఫలితాలను వైద్యులకి చూపించండి

### ఎ హెచ్ ఎ –నర్సీపట్నం

నాకు 18 సంవత్సరములు నాకు స్త్రీపై ఉద్రేకం కలిగినప్పుడు పురుషాంగం వద్ద నొప్పిగా వుంటుంది

● ఇది ఒక విధంగా సహజమే' మరి నెప్పిగా ఉంటే శస్త్ర వైద్యులని కలవండి

### కె ఎల్ –జంతర

నాకు పెళ్ళి కాక ముందు ఎ రోగమూ లేదు పెండ్లి అయిన 2 సంవత్సరాలకు వైట్ డిస్‌చార్జి మొదలైనది యిప్పటికి 4 సంవత్సరాల నుండి బాధ పడుతున్నాను నా శరీరం అప్పుడప్పుడు వణుకుతున్నది ఎ పని చెయ్యలేక పోతున్నాను

● వైట్ డిశ్చార్జి అనేది కొంతవరకు స్త్రీలందరికి సహజమే' ఎక్కువగా ఉన్నప్పుడు మాత్రం వైద్యుల సలహా పొందటం మంచిది శరీరం వణకటానికి వైట్ డిశ్చార్జికి సంబంధంలేదు

ఈ లక్షణానికి వైద్యులని సంప్రదించి ఇంజక్షన్ బి–12 మొదలయినవి వాడండి

### యల్ ఎ –బళ్ళారి

నాకు యిరు ప్రక్కల దవడలు అంటే చెవి క్రింద ఎందుకో వాపుగా వుంటాయి నొప్పి లేదు చూడడానికి గవద బిళ్ళలు వచ్చినట్లు వుంటాయి నిద్ర నుండి లేచిన తరువాత ముఖము కళ్ళు వాపుగా వుంటాయి

● ఈ లక్షణాలన్నీ సర్జన్లకి చూపి మికులిక్జ్ రోగం ఉన్నదీ లేనిది తీర్మానించమనండి దానిని బట్టి వారు వైద్యం చేస్తారు □

# ప్రశాంత్ ప్రేమకథ

రాసినాతల సువర్ణ కన్యక

ప్రశాంత్ పది లక్షలకి వారసుడు. అందగాడు. తెలివైనవాడు. సిగరెట్టు వాసన కూడా నచ్చని అతిబుద్ధిమంతుడు. ఇల్లు, కాలేజి తప్ప ఇతర వ్యాపకాల్లేని అమాయకుడు.

పెళ్ళికున్న ఆడపిల్లల తండ్రులు ఆశగా చూసేంత అంతస్తున్నవాడు.

అతను బామ్మ చాటుగా పెరగడంవల్ల చొరవ తక్కువ!.... బామ్మకి చెప్పందే బాత్‌రూమ్‌కి కూడా వెళ్ళడు. చీకటంటే చచ్చే భయం. ఆడపిల్లలతో మాట్లాడ్డం అంటే మరీ భయం.

కాలేజీలో అతనికి "బామ్మ కూచి", "బుజ్జి పాపాయి" లాంటి పేర్లు కూడా వున్నాయి.

ప్రశాంత్ అత్త కూతురు సుబ్బులక్ష్మికి అతనంటే పిచ్చి ప్రేమ! వచ్చినప్పుడల్లా–

'బావా! బావా!...." అంటూ అతనిచుట్టూ తిరుగుతుంది. అసలు ప్రశాంత్ బామ్మగారు సుబ్బులక్ష్మికి, అతనికి పెళ్ళి చేసెయ్యాలని ఏనాడో నిర్ణయం చేసింది కూడా.

అయితే ఎందుకో ప్రశాంత్‌కి మాత్రం ఆ పిల్లని చేసుకోవడం అస్సలు ఇష్టం లేదు. అయినా బామ్మకి ఎదురు చెప్పడం ఇష్టం వుండదు కనుక తన అయిష్టాన్ని ఏనాడూ అతను బైటపెట్టలేదు.

ప్రశాంత్ వాళ్ళుండేది పట్నంలోనే అయినా బామ్మగారి ధర్మమా అని అన్నీ పల్లెటూరి అలవాట్లే వుండేవి ఆ ఇంట్లో.

పల్లెటూళ్ళలో లాగే లంకంత ఇల్లు, ఊరంత పెరడు, పాడి, పంటా అన్నీ వుండేవి.

బామ్మగారికి కొడుకు, కోడలు, మనవరాలు అందరూ వున్నా ప్రశాంత్ అంటేనే ఎక్కువ ప్రేమాభిమానాలు ప్రతి రోజూ రాత్రి అతను పడుకోబోయే ముందు అర్ధసేరు వుప్పు తిప్పి తీసేది. దేవుడి విబూది పెట్టేది. ప్రశాంత్ ఆవిడెలా చెప్తే అలా చేసేవాడు.

అయితే ప్రశాంత్ ప్రవర్తనలో హటాత్తుగా మార్పొచ్చింది. అది మొదటగా అతని చెల్లెలు ప్రవీణ గమనించింది.

ఆరోజు వినాయక చవితి!'

. ఆ పండగంటే ప్రశాంత్‌కి చాలా ఇష్టం. వినాయకుడంటే మరీ ఇష్టం. తనేపని చెయ్యాలన్నా - ఆరోజే చేసేవాడు. "చవితి పూటా ఏవిట్రా...?" అన్నా వినకుండా.

అలాగే ఆ రోజూ ప్రశాంత్ చీకటితో లేచి-పూలు పత్రీ సేకరించాడు. బామ్మగారతనికి అర కిలో నూనె పట్టించి పావు కిలో సున్ని పిండితో నలుగు పెట్టి, అర్ధ పావు కుంకుడుకాయలతో అభ్యంగన స్నానం చేయించింది. గుప్పెడు సాంబ్రాణి పొగ వేసింది. కొత్త బట్ట లిచ్చి కట్టుకోమని చెప్పి వంట పనిలో పడిపోయింది.

తల్లి, చెల్లెలు ప్రవీణ దేవుణ్ణి అమర్చడంలో మునిగిపోయారు. అప్పుడే ఓసారి వినాయకుడికి దణ్ణం పెట్టుకుని హడావిడిగా వీధి వైపు కెళ్ళిపోయాడు ప్రశాంత్.

పూజ వేళ అవడంతో కొడుకుని పిల్చుకురమ్మని తల్లి ప్రవీణని పంపింది.

ఆ పిల్ల వీధిలో కెళ్ళి అన్నగార్ని చూసి కెవ్వున అరిచింది. అంతే!

ఆ అరుపుకి.... పులుసులో తిరగమోత పెడుతున్న బామ్మగారు, కుందుల్లో వత్తులేస్తున్న తల్లి, పెరట్లో పని చేసుకుంటున్న పనిపిల్ల చంద్రి, బాత్‌రూమ్‌లో స్నానం చేస్తున్న తండ్రి ఒక్క పరుగున వీధిలో కొచ్చి పడ్డారు.

అక్కడి దృశ్యం చూసి కొయ్యబారిపోయారు.

వీధిలో ఓ పక్కగా ఏదో షెడ్డు వేయించడానికి ప్రశాంత్ వాళ్ళ నాన్నగారు పునాదులు తవ్వించారు. అవి, పెద్ద వానలు కురవడంతో పిల్ల కాలవల్లా నీళ్ళతో నిండి వున్నాయి. ఆ కాలవలమించి ఇట్నించి అటు, అట్నించి ఇటు, సీరియస్‌గా దూకేస్తున్నాడు ప్రశాంత్ చిన్న పిల్లాడిలా.

అందర్నీ చూసి కాస్సేపు దూకడం ఆపి మళ్ళీ మొదలు పెట్టాడు.

అతని బట్టలన్నీ బురదైపోయాయి. మొహానికి వంటికి కూడా అక్కడక్కడా బురద మరకలు అంటాయి.

"అయ్యో! పండగపూటా ఏవైందిరా నీకు?" అంటూ బావురుమంది బామ్మగారు.

"అబ్బ! ఇప్పుడేవైంది బామ్మా? ఎందుకూ ఏడుస్తావ్?" అన్నాడు ప్రశాంత్ దూకడం ఆపి.

"అయ్యో! నిక్షేపంలా ఇప్పుడేనమ్మా బిడ్డకి స్నానం చేయించి కొత్త బట్టలు కట్టించాను! ఇంతలో ఇలా అయిపోయింది!" దీర్ఘాలు తీసిందావిడ.

"అదికాదు బామ్మా! నాకేం కాలేదు! ఈ గోతులు దూకడం ప్రాక్టీసు చేస్తున్నానంతే!" తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు ప్రశాంత్.

"గోతులు దూకడం ఎందుకుట?" చిరాగ్గా అంది తల్లి.

"మా కాలేజీలో జంపింగ్ ప్లే ఒకటుందిలే!" అంటూ అప్పటికి అందరికీ నచ్చచెప్పి పంపేశాడు ప్రశాంత్.

తాత్కాలికంగా అప్పటికి తృప్తి పడ్డా ప్రశాంత్ ప్రవర్తన ఇంట్లో వాళ్ళందర్నీ భయభ్రాంతుల్ని చేసింది.

గదిలో కూర్చుని తన కొచ్చిన సినిమా మాటలన్నీ కర్ణకఠోరంగా పాడ్డం, దీపం పెట్టాక ఒంటరిగా పెరట్లోకి వెళ్ళాలన్నా హడలిపోయే అతను, అర్ధ రాత్రి దాకా భయంతో వణుకుతూనే ఆంజనేయ దండకం చదువుకుంటూ మరి తోటంతా కలియ తిరగడం, పనివాళ్ళు వారిస్తున్నా వినకుండా వాళ్ళ దగ్గర్నించి బరువులు తీసుకుని మొయ్యడం ఇలాంటివే ఇంకా చాలా చేస్తున్నాడు.

ఇవన్నీచూసి అందరూ కంగారుపడిపోయారు.



బామ్మగారు ఇల్లిగిరిపోయేలా శోకాలు మొదలెట్టింది.

తాయెత్తులు కట్టించింది.

విభూదులు పెట్టించింది!

అంజనా వేయించింది!

అర్చనలు చేయించింది!

ఊహు ఫలితం శూన్యం!

రాను రాను అతని ప్రవర్తనలో అందరి మతులూ పోతున్నాయి. కర్ణకఠోరమైన అతని గార్ధభ స్వరం వినలేక చుట్టు పక్కల వాళ్ళు ఇంటిమీదికొచ్చి గొడవ మొదలు పెట్టారు.

రిక్షావాడి చేతిలోంచి నిండు గేస్ సిలిండర్ తీసుకుని, అది మొయ్యలేక కాలిమీద పడేసుకుని, కాలు పచ్చడికాగా, అది మానడకోసం పది రోజులు హాస్పిటల్లో గడిపాడు.

ఇంకా ఇలాంటి అడ్వంచర్స్ చాలా చాలా చేస్తున్నాడు. ఇవన్నీ చూసిన ఇరుగు పొరుగులంతా అతనికి పిచ్చి పట్టిందని తీర్మానించారు. దెయ్యం పట్టిందని ఏడ్చింది బామ్మగారు.




అయితే ఇవేం కాదు!

అతను నిక్షేపంలా వున్నాడు. అతనిలోని ఈ మార్పు క్కారణం వాళ్ళ కాలేజీలో కొత్తగా చేరిన రాధ!

రాధ అందాల రాశి! చక్కగా మాట్లాడుతుంది. అనవసరంగా సిగ్గు పడదు! చిరునవ్వు ఆమెకి పెట్టని ఆభరణం! ఒకటి రెండు సార్లు ప్రశాంత్‌ని చూసి తియ్యగా నవ్వింది కూడా.

అంతే! ప్రశాంత్ ఆమె ప్రేమలో పడిపోయాడు. ఆమె కళ్ళల్లోకి సూటిగా చూడ్డానికి, నోరు తెరిచి మాట్లాడ్డానికి హడలిపోతూనే గాఢంగా ప్రేమించేశాడు.

అయితే తనకీ, ఆ పిల్లకీ స్వభావంలో చాలా తేడా వుందని అతనికి తెలుసు.

గలగల పారే సెలయేరులా తృళ్ళిపడే రాధని నిశ్చలంగా పడివున్నట్టుండే తనెలా ఆకర్షించగలడు?"

రాత్రింబవళ్ళు ఇవే ఆలోచనలు! చివరికి ఓ ఉపాయం తట్టింది. రాధ అలవాట్లని, ఇష్టాలనీ తెలుసుకుని తను కూడా అలా తయారవాలని!

రాధకి పాటలంటే ఇష్టం! స్పోర్ట్స్ అంటే చాలా ఇష్టం!.... నిస్సంకోచంగా మాట్లాడేవాళ్ళంటే మరి ఇష్టం! ఎడ్వంచర్ చేసే వాళ్ళంటే మరి మరి ఇష్టం! సినిమాలన్నా ఇష్టమే!

ఇంకా అలాంటి ఇష్టాలు చాలా వున్నాయి. అయితే ఇందులో ఏ ఒక్కటీ అతనిలో లేవు! అందుకే అన్నీ నేర్చుకుని అప్పుడు రాధని గెల్చుకోవాలి.

ఆ వుద్దేశంతోనే తన కిష్టమైన వినాయకచవితి రోజున తన ఎడ్వంచర్స్ ప్రారంభించాడు. కారణం

చెప్తే బామ్మ సుబ్బలక్ష్మిని చేసుకోనందుకు గొడవ పెడుతుందన్న భయంతో వాళ్ళెవరికీ చెప్పలేదు.

ఫలితంగా ప్రశాంత్‌కి దెయ్యం పట్టిందన్న వార్త ఖాయం చేసేసింది బామ్మగారు

సంవత్సరానికో సినిమా అయినా చూడని ప్రశాంత్ ఈమధ్య రోజూ చూస్తున్నాడు

అలాగే ఓ రోజు హీరోలా వెన్ను విరుచుకుని ఓ సినిమా కెళ్లాడు. అదృష్టవశాత్తూ, సినిమా హాలు దగ్గర క్యూని చూసి బెదిరిపోయి చూస్తున్న రాధ కనిపించింది.

ఒక్క అంగలో అక్కడికెళ్ళి–

"టికెట్స్ తీసుకున్నారా?" అన్నాడు ప్రశాంత్.

'లేదండి' చాలా రష్‌గా వుంది టికెట్స్ దొరికేలా లేవు!' బేలగా అంది రాధ.

"ఎందుకు దొరకవండి! మీ కెన్ని టికెట్స్ కావాలి?" ఉత్సాహంగా అన్నాడు ప్రశాంత్ రాధ చెప్పింది

అంతే!... ఆంజనేయుడు సముద్రం దాటినంత వేగంగా జనంలోకి చొచ్చుకుపోయి, వాళ్ళచేత నానా చివాట్లూ తిని, ఆపైన ఓ స్థూలకాయం ఒక్క తోపు తొయ్యగా ఆవడ దూరానెళ్ళి పడి కాలు బెణికి, ఒళ్ళు హూనం అయిందే గాని పాపం! ఒక్క టికెట్టు దొరకలేదు

ఇంక ఇలా కాదని టికెట్ ఇరవై రూపాయల చొప్పున బ్లాక్‌లో కొని తీసుకెళ్ళి రాధ చేతిలో పెట్టాడు ప్రశాంత్. ఆమె కృతజ్ఞతగా చూస్తుంటే పొంగిపోయాడు. "యు ఆర్ గ్రేట్ మిస్టర్ ప్రశాంత్! మధురంగా నవ్వుతూ అంది రాధ." అయ్ లవ్ యు ప్రశాంత్" అన్నంత సంబరపడిపోయాడు

"మీ టిక్కెట్ ఏది?" అంది రాధ.

అప్పుడు గుర్తొచ్చింది ప్రశాంత్‌కి ఈ హడావిడిలో తనకి టికెట్ కొనుక్కోలేదని! అయినా వాళ్ళ ముందు తన తెలివి తక్కువతనాన్ని అంగికరించడం ఇష్టం లేక–

"సారి రాధగారూ! ... నేను ఈ సినిమా ఆల్‌రెడీ చూసేశాను!" అనేశాడు.

"ఓ! మా కోసం ఇంత అవస్త పడ్డారా? సారీ!" నొచ్చుకున్నట్టు అంది రాధ. "ఫరవాలేదు. అవస్తేవుంది?" అన్నాడు తలవంచుకునే.

ఒక్కసారి ఆమె మొహంలోకి చూసి మాట్లాడాలన్న అతని కోరిక తీరనేలేదు. మరోసారి దాంక్స్ చెప్పి ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్ళిపోయింది రాధ.

తన పిరికితనాన్ని తానే తిట్టుకున్నాడు ప్రశాంత్

* * * *

నాలుగు రోజుల తర్వాత రాధ వెళుతుండగా ధైర్యం చేసి పలకరించాడు ప్రశాంత్ గొణిగినట్టు. ఆమె ఆగి నవ్వింది ఆ నవ్వుని చూసి పరవశించి పోయిన ప్రశాంత్‌కి తరవాత మాట రాలేదు మరోసారి నవ్వి వెళ్ళిపోయిందామె.

పరవాలేదు! నా క్కాస్త ధైర్యం వస్తోంది! అనుకుని మురిసిపోయి, కులాసాగా కూనిరాగం తీస్తూ, ఇల్లు చేరిన ప్రశాంత్ అక్కడ హడావిడి చూసి కొయ్యబారిపోయాడు.

బామ్మ వుత్తరం రాసి, పట్నానించి రప్పించిన భూత వైద్యుడు వీరన్న నట్టింట ముగ్గులు వేసి పసుపు కుంకుమలు, నిమ్మకాయలు, వేపమండలూ అమరుస్తున్నాడు.

"ఏవిటి బామ్మా? ఏవిటే గొడవంతా?" అయోమయంగా అన్నాడు ప్రశాంత్. విషయం వివరించింది ప్రవీణ.

"మైగాడ్!" కెవ్వున అరిచాడు ప్రశాంత్.

"భయం లేదు నాయనా!" అంది బామ్మగారు.

"నేను చచ్చినా ఒప్పుకోను!"

"నా తండ్రివిగదూ!" బతిమాలిందావిడ.

"నా కెక్కడ దెయ్యం పట్టిందే! ఆ దెయ్యాలేవో మీకు పట్టాయేమో! ఇదో! ఈ ముచ్చు వెధవ వీరన్నగాడికే పట్టింది!" చిందులు మొదలు పెట్టాడు ప్రశాంత్.

"చూశారా అమ్మగారూ! ఇదంతా ఆ భూతం పలికే పలుకులే!" నమ్మకంగా అన్నాడు వీరన్న వేపమండ విదిలిస్తూ.

"అవున్నాయనా! తొందరగా కానీయ్' అవతల







మళ్ళీ వర్షం వస్తుంది! ముక్కు చీదేసింది బామ్మగారు. ఇంటి మంగలి పోది తీసుకుని ప్రశాంత్ దగ్గరగా వచ్చాడు. బామ్మగారు ఏర్పాటు చేసిన నలుగురు వస్తాదులు ప్రశాంత్‌ని పట్టుకోవడానికి రెడీగా ఉన్నారు. చంద్రి నిమ్మరసం కప్పు పట్టుకుని నిల్చుంది.

ఇంక ప్రశాంత్ జుట్టు తీయించి, నిమ్మరసం పట్టించి, మంత్రించిన విభూది రాసి వేపమండలతో బాదే ఘట్టం జరగబోతోంది. ఇదంతా ఒప్పుకోరేమో అని కొడుకుని, కోడల్ని, బంధువులింటికి పంపేసింది బామ్మగారు.

ప్రశాంత్ బిక్క చచ్చిపోయి నిస్సహాయంగా చూస్తుండిపోయాడు. అతనికి తెలుసు బామ్మ తల్చుకుంటే అది జరిగి తీరాలని!

ఆ సమయంలో వురుము లేని పిడుగులా వచ్చింది రాధ ఫ్రెండ్స్‌తో.

ముఖం చిట్లించింది బామ్మగారు

కుతూహలంగా చూస్తున్నారు మిగతా వారు

ప్రశాంత్ ముఖం తెల్లగా పాలిపోయింది.

"సారి, మీరేదో పనిమీదున్నట్టున్నారు?" మొహమాటంగా అంది రాధ.

"అబ్బే! మరేం లేద రాధగారూ! ఈమధ్య మా ఇంట్లో అందరికీ పూజ్యారాలు!.... అదేదో చేతబడి అని మంత్రాలు వేయిస్తోంది బామ్మ!. .. ఆవిడదంతా చాదస్తం లెండి!" అంటూ వాళ్ళని కూర్చొబెట్టి అందర్నీ పరిచయం చేశాడు ప్రశాంత్ ఏవనుకున్నారో కానీ అందరూ కాస్సేపు పక్కకి తప్పుకున్నారు.

ప్రశాంత్ అందించిన కాఫీ తాగి, ఆరోజు తన పుట్టినరోజనీ పార్టీకి తప్పకుండా రమ్మనీ అతనికోసం ఎదురు చూస్తుంటాననీ యడ్రస్ రాసిచ్చింది రాధ.

ప్రశాంత్ ఓ నిర్ణయాని కొచ్చినట్టు తల విదిలించి–

"బామ్మా! ఈ తతంగం ఎంతసేపు పడుతుంది?" అన్నాడు సీరియస్‌గా.

అంతా ఎంత బాబూ! ఒక్క అరగంట చాలు! ఉత్సాహంగా అన్నాడు వీరన్న

"అయితే సరే! అన్నీ సిద్ధం చేయండి. నేను వీళ్లని ఆటో ఎక్కించి వస్తాను... అన్నట్టు ఇదిగో బామ్మా! అరగంటకి ఒక్క నిముషం ఎక్కువైనా నేను లేచిపోతాను! ఆ తరువాత మి ఇష్టం! 'కండిషన్ పెట్టాడు ప్రశాంత్.

"అలాగే!" మనవడిలోని మార్పుకి మురిసి పోయింది బామ్మగారు. అయితే ఆ మురిపెం ఎంతోసేపు ఉండలేదు. కారణం గంటలు గడిచినా ప్రశాంత్ జాడలేదు

నాలుగురోజుల తర్వాత ఇల్లు చేరిన ప్రశాంత్ తన బట్టలన్నీ సూట్‌కేసులో సర్దుకున్నాడు. బామ్మ అడ్డుపెడితే విదిలించి కొట్టాడు. తనెందుకలా ప్రవర్తించాడో చెప్పి తనకి పిచ్చి అన్నవాళ్లందర్నీ తిట్టిపోశాడు. ఇంకొక్క క్షణం కూడా ఈ ఇంట్లో వుండను " అన్నాడు

బామ్మగారు బతిమాలింది. ఇంకముందు నీ మాటలకు నేనే కాదు. ఇంకెవరూ ఎదురు చెప్పరు! సరేనా?' అంటూ వాగ్దానాలు చేసి అతని ప్రయాణాన్ని ఆపేసింది.

పది రోజుల తర్వాత ఓ రోజు కాలేజీ నుంచి వస్తున్నాడు ప్రశాంత్

"ఎక్స్‌క్యూజ్‌మి!" పదిరోజులు ప్రశాంత్ తన దగ్గరి కొస్తాడని ఆశగా ఎదురు చూసిన రాధ అతను రాక పోవడంతో తనే వచ్చి పలకరించింది.

"ఓ! మీరా! బావున్నారా? నవ్వుతూ అన్నాడు ప్రశాంత్. ఇప్పుడతని కళ్లలో బెరుకులేదు. మాటల్లో తడబాటులేదు సంపూర్ణ పురుషత్వం తొణికిసలాడుతోందతని మొహంలో

"నాబర్తుడే పార్టీకి రాలేదు !" చిరుకోపంగా అంది రాధ ఆ రూపాన్ని ఇదివరకు చూసినట్టయితే అతను పులకరించిపోయేవాడు. కానీ ప్రశాంత్‌కి హటాత్తుగా జ్ఞానం వచ్చేసింది. అందుకే

'సారి ' రాధా!... వీలు కాలేదు !" అన్నాడు నిర్మలంగా నవ్వుతూ.

"పోన్లెండి ! అలా పార్కుదాకా వెళ్దామా?" ఓరగా అతనికేసి చూస్తూ అంది రాధ.

"అలాగే పదండి!" అన్నాడు ప్రశాంత్

ఇద్దరూ పార్కులో కెళ్లి ఓ చెట్టు కింద కూర్చున్నారు. చల్లని గాలి శరిరాలకి తగిలి కితకితలు పెడుతోంది.

"మీరేం మాట్లాడంలేదు!" గోముగా అంది రాధ

"ఏం వుంది మాట్లాడ్డానికి?" నవ్వాడతను

"ఎం లేదా?' బుంగమూతి పెట్టి అదోలా అంది రాధ

"అంటే... విషయం... వుందనుకోండి." నసిగాడు ప్రశాంత్ రాధ మొహంలోకి వెలుగొచ్చింది

"అయితే చెప్పండి!" ఉత్సాహంగా అంది.

"ఊఁహు.... ముందు మీరేవైనా కబుర్లు చెప్పండి. లేడీస్ ఫస్ట్ అన్నారు కదా!" మళ్లీ నవ్వాడతను. అతని నవ్వుకు ఆమె పరవశించి పోయింది

సరదాగా చాలా కబుర్లు చెప్పింది.

అతనూ చెప్పాడు.

అయితే రాధ ఆశించినట్టు–

"అయ్ లవ్ యు రాధా!" అనలేదతను.

ఆమె మొహం చిన్నబోయింది.

"మీతో ఒక విషయం చెప్పాలి!" హటాత్తుగా అన్నాడు ప్రశాంత్. రాధ కళ్ళు తళుక్కుమన్నాయి.

"చెప్పండి!" అన్నట్టు చూసింది

క్షణం తర్వాత అతను మౌనంగా ఉండిపోయాడు.

"చెప్పండి దేన్నిగురించి?" ఆతృతగా అంది రాధ

"వ్యక్తిగత విషయం!' నవ్వాడు ప్రశాంత్.

రాధ గుండె లయతప్పింది

అతన్ని ఆట పట్టిస్తూనే అతనికి చేరువకావాలన్న ఆమె ఆశ నెరవేర బోతోందని మురిసిపోయింది.

"నేను పెళ్లిచేసుకోబోతున్నాను.!" అన్నాడు ప్రశాంత్ చిన్నగా నవ్వుతూ.

"నిజం? కొంటిగా నవ్వింది రాధ.

"ఊఁ! నిజం!"

"వధువెవరో?" ఆనందాన్ని దాచుకుని అమాయకంగా అడిగింది రాధ.

"మా అత్తయ్య కూతురు సుబ్బలక్ష్మి!" కూల్‌గా

"ప్రశాంత్ ప్రేమకథ"

అన్నాడు ప్రశాంత్

"వ్వాట్?" ఎదురు చూడని ఆ మాటకి అదిరి పడింది రాధ

"అవును ఇదిగో శుభలేఖ! మీరు పెళ్లికి తప్పకుండా రావాలి' శుభలేఖ అందిస్తూ అన్నాడతను

రాధ మొహం పాలిపోయింది

'అంటే మీ రు నన్ను ."

ప్రేమించలేదా? అని అడుగుతున్నారా? ప్రేమించాను! పిచ్చిగా ప్రేమించాను కానీ మీ మనస్తత్వం తెలిశాక ఆ ప్రేమ సారీ! అసహ్యంగా మారింది' అతని గొంతులో అవమానం, ఆవేశం చాయలు తొంగిచూస్తున్నాయి

అంటే ? తడారిపోతున్న పెదవులతో అంది రాధ

"మరేంలేదు! ఆ రోజు మీరు మీ ఫ్రెండ్స్ కలిసి ఓ హోటల్లో కూర్చుని నాగురించి మాట్లాడుకున్న మాటలన్నీ అనుకోకుండా నా చెవినేపడ్డాయి

మీరు ఆహ్వానించిన రోజు నిజంగా మీ బర్త్‌డే కాదనీ, మీరిచ్చిన యడ్రస్ కూడా సరైంది కాదనీ, కేవలం నన్ను ఆట పట్టించడానికే ఆ విందు కథ అల్లారని తెలుసుకున్నాను అంతేకాదు

ఫలానా సినిమాలోలా అతన్ని అల్లరిపెడుతూనే అతని ప్రేమ సంపాయిస్తాను! అతన్ని నా చుట్టూ కుక్కలా తిప్పించుకో పోతే నాపేరు మారుపేరు పెట్టుకుంటాను ' అన్న మీ శపథం కూడా విన్నాను

అంతే! నాకు లోకం పూర్తిగా అర్థమైపోయింది. మెరిసేదంతా బంగారం కాదనీ, మెరవనిది మట్టికాదనీ తొలిసారిగా తెలుసుకున్నాను అందుకే ఇన్నాళ్లూ ఈసడించిన మా సుబ్బుల్నే చేసుకుంటున్నాను

ఆమెకి మీ అంత అందం లేదు మీకున్నంత చదువు సంధ్యలు కూడాలేవు కానీ వీటన్నింటినీ మించిన సంస్కారముంది నన్ను ఆరాధించే మంచి మనసుంది' నా అమాయకత్వాన్ని కడుపులో దాచుకుని జీవితాంతం తోడుగా నీడగానిల్చే ప్రేమాభిమానాలున్నాయి అందుకే ఆమెకి చేరువౌతున్నాను

ఇది ఇది చెప్పడానికే మీతో పాటు ఇంత దూరం వచ్చాను మీ మనసుని గాయపరిస్తే క్షమించండి కానీ మిస్ రాధా! సినిమాలు వేరు, నిజ జీవితాలువేరు! సినిమాల్ని చూసి ప్రేమలో దిగితే అది అభాసుపాలవుతుందే తప్ప అనురాగంగా మారదు

చొరవ తీసుకున్నందుకు మరోసారి క్షమార్పణ కోరుకుంటున్నాను'' రెండు చేతులూ జోడించి లేచి అలా నడిచిపోతున్న ప్రశాంత్‌ని అలాగే చూస్తూ శిల్పంలా నిల్చుండి పోయింది అందాల సుందరి రాధ □



# సీరియల్ మల్లిక

యర్లగడ్డ కెమిరా

(గత సంచిక తరువాయి)

తొమ్మిదన్నరయ్యింది మల్లిక మనస్సులో ఆరాటం అంతకంతకూ అధికమవ్వసాగింది

ఇంకా రాకపోవట మేమిటి? అందులోనూ ఈ సంతోష సమయంలో!

సడెన్‌గా ఆమెకో భయంకరమైన విషయం గుర్తొచ్చింది

ఆ మధ్య భార్గవ్‌కి తెలిసిన ఒక సైంటిస్ట్ ఏదో కనిపెడితే అతనికి ఎవార్డ్ వచ్చింది అది తీసుకుని అతను సంతోషంగా ఇంటికి తిరిగి వస్తుంటగా దారిలో యాక్సిడెంటై అక్కడికక్కడే చనిపోయాడు–

ఆ విషయం గురించి చెబుతూ భార్గవ్ చాలా బాధపడ్డాడు జీవితాన్ని వెచ్చించి అతనా ఎవార్డ్ సంపాదించాడు అంత గౌరవం తెచ్చుకోవటం అందరికి సాధ్యమయ్యే పనికాదు కాని అది అనుభవించే అదృష్టం అతనికి లేకుండా పోయింది చేతికందింది నోటి కందాలి కదా ని అందుకే అంటారు కాబోలు!

అది తలుచుకుని ఆమె ఒళ్ళు గగుర్పొడిచింది లేదు! అలా జరగటానికి వీల్లేదు అదివరకెన్నిసార్లు భార్గవ్ లేటుగా రాలేదు?

అగతా క్రిస్టీ పుస్తకం తీసుకుని పేజీలు తిరగెయ్య సాగింది వూహు ఆమె మనస్సు దానిమీద నిలవడం లేదు కిటికిలోనుండి బైటికి చూసింది ఫాగ్ అంతకంతకూ దట్టం అవుతోంది కళ్ళు చించుకున్నా ఏమి కనబట్టం లేదు

ఫోన్ దగ్గర కెళ్ళి లాబ్‌కి డయిల్ చేసింది ఆపరేటర్ ఫోన్ ఎత్తింది సారీ మేడమ్! పార్టీ అయిపోయినాక ఎనిమిదన్నరకల్లా అందరూ వెళ్ళిపోయారు ఇప్పుడు లాబ్‌లో ఎవ్వరూ లేరు మల్లిక ప్రశ్నకు జవాబుగా అంది

అంటే లాబ్ ఒదిలి రెండు గంటలైంది ఎంత డ్రైవింగ్ కష్టమైనా అరగంట ముందే వచ్చివుండాలి

జిమ్‌కి ఫోన్ చేసింది అతను ఈ రోజు లాబ్‌కే వెళ్ళలేదని చెప్పాడు భార్గవ్ అతని అపార్ట్‌మెంట్‌లోనూ లేడు

లాబ్‌లో లేడు జిమ్ అపార్ట్‌మెంట్‌లో లేడు దాని అర్థం దారిలో వున్నాడనేగా? ఫాగ్‌లో డ్రైవింగ్ కష్టమై ఎక్కడైనా ఆగాడేమో!

రకరకాల ఆలోచనల్తోనే మరొక అరగంట గడిచింది మల్లిక సోఫా దగ్గర నుండి కిటికీ దగ్గరకూ కిటికీ దగ్గర నుండి సోఫా దగ్గరకూ కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూనే వుంది బొడ్డు లోపల ఏదో మొదలై వుంట తిరుగుతోంది అది చాలా అనీజీ ఫీలింగ్!

ఆ టెన్షన్ భరించలేక సోఫాలో కూర్చుని గట్టిగా కళ్ళు మూసుకుంది ఆమె కళ్ళముందు భార్గవే కనబడుతున్నాడు

ఏదైనా యాక్సిడెంటై ఏ రోడ్డు ప్రక్కనో నిస్సహాయంగా పడున్నాడేమో! అలా జరిగితే ఈ ఫాగ్‌లో ఎవరు గమనిస్తారు? చలిజ్వరం వచ్చినట్లు ఒళ్ళంతా ఒక్కసారిగా ఒణికింది

ఇప్పుడు తనేం చెయ్యాలి? టైం చూస్తే పదిన్నరయ్యింది

గబగబా ప్రక్కింటి లిలియన్‌ని పిలిచింది తన భయాన్ని చెప్పింది

ఇంకా కొంతసేపు చూసి పోలీస్ రిపోర్టిద్దాం నన్ను రమ్మంటావా? అంది లిలియన్ అంతా విని

అక్కర్లేదు ఇంకొక అరగంట చూసి మళ్ళీ నీకు ఫోన్ చేస్తాను

ధైర్యంగా వుండు మల్లికా! ఏం జరిగుండక పోవచ్చు మళ్ళీ నన్ను పిలిచి ఏ విషయమూ చెప్పూ

అలాగే ఫోన్ పెట్టేసింది

ఆమె ఫోన్ పెట్టెయ్యగానే డోర్ బెల్ మ్రోగింది గబుక్కున డోర్ దగ్గరకు పరిగెత్తింది

పిప్ హోల్‌లో నుండి చూస్తే ఇద్దరు పోలీస్ ఆఫీసర్స్ కనబడ్డారు

మల్లిక ఒక్క క్షణం బిగుసుకుపోయింది

వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ? డోర్ చెయిన్ తియ్యకుండానే తలుపు జరగా తెరిచి అడిగింది

న్యూయార్క్ పోలీస్! అంటూ బాడ్జ్‌లు తెరిచి చూపించారు

ఆ భయంకర సంఘటన గుర్తొచ్చింది వీళ్ళు నిజమైన పోలీసులని నమ్మక మేమిటి?

ఇంతలో ఒకతను జేబులో నుండి వాలట్ తీసి

ఇది మి హస్బెండ్‌దేనా? అని అడిగాడు

చిరగటానికి సిద్ధంగా వున్న బ్రౌన్ లెదర్ వాలట్! క్రొత్త వాలట్ కొనుక్కోమని చాలా రోజులనుండే పోరుతున్నా భార్గవ్ పని హడావిడిలో పట్టించుకో లేదు

దాన్ని చూడగానే మల్లిక గుండె ఆగిపోయినట్లయ్యింది ఆమె కేదో అర్థమయ్యింది

డోర్ చెయిన్ తీసి తలుపు బార్లా తెరిచింది

ఈ వాలట్‌లో మి ఫోటో మి ఇంటి అడ్రసూ వున్నాయి అయామ్ సారీ మేమ్! మి హస్బెండ్ డ్రైవ్ చేస్తున్న కారు చెట్టుకి గుద్దుకుంది అతన్ని ఇప్పుడే హాస్పటల్‌కి పంపి మేమిటు వస్తున్నాం సానుభూతిగా అన్నాడు రెండవ పోలీస్

తలుపు పట్టుకుని నిలదొక్కుకుంది మల్లిక ప్రాణాలతో వున్నాడా? వూపిరి బిగబట్టి అడిగింది

మేం చూసేసరికి స్పృహ తప్పి వున్నారు తలకు బాగా గాయం తగిలింది మిరొస్తానంటే హాస్పటల్‌కి మాతో తీసికెళ్తాం?

ఒక్క క్షణం! తూలిపోతున్న శరీరాన్ని మనస్సుని అదుపులోకి తెచ్చుకుంటూ లోపలికి పరిగెత్తింది బాగ్ తీసుకుని వెంటనే తిరిగి వచ్చింది

పదండి

పోలీస్ కారు చూసేమో లిలియన్ బైటికొచ్చింది విషయం విని తనూ హాస్పటల్‌కి వస్తానంది మల్లిక అభ్యంతరపెట్టలేదు త్వరగా తన బాగ్ తెచ్చుకుని కార్లో కూర్చుంది లిలియన్

దార్లో మల్లికేమి మాట్లాడ లేదు ఆమె మనస్సంతా భయంకర మృగాలతో నిండివున్న మహారణ్యంలా బీభత్సంగా వుంది! లిలియన్ కూడా మల్లిక చేతిని తన చేతిలోకి తీసుకుని మౌనంగా కూర్చుంది

## 13

అర్ధరాత్రి అవటం వల్ల హాస్పటలంతా నిశ్శబ్దంగా వుంది నైట్ స్టాఫ్ తప్ప పేషెంట్లందరూ నిద్రపోతున్నారు

మల్లికనీ లిలియన్‌నీ ఎమర్జెన్సీ రూం వరకూ తీసుకొచ్చి భార్గవ్ గురించిన

---

జరిగినకథ–19 ‘ మల్లిక భార్గవ్ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు వారి జీవితం సాఫీగా జరిగిపోతున్నా పిల్లలు మాత్రం కలుగ లేదు వెడ్డింగ్ యానివర్సిరి నాడు భార్గవ్ తప్పతాగి ఇంటికి రాకుండా జిమ్ అపార్ట్‌మెంటులో పడి ఉండటంతో మల్లికకి మనస్సంతా శూన్యంగా అయ్యింది పిల్లలు లేక పోవడమే దీనికంతా కారణం అనుకుంటుందామె మల్లిక తను భార్గవ్‌కి దూరంగా వెళ్ళిపోతే అతను పిల్లల కోసం మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడని అనుకుంటుంది ఆ ఉద్దేశ్యంతోనే నెల రోజులు చికాగోలో గడిపి వస్తానని భార్గవ్‌కి చెప్పి వెళ్ళిపోతుంది చికాగోకి వెళ్ళి మల్లికని తన వెంట న్యూయార్క్ తీసుకు వచ్చేసాడు భార్గవ్ మల్లిక తను ప్రెగ్నెంట్ అని భార్గవ్‌కి చెప్పాలనుకుంటున్న సమయంలోనే అతనికి కారు యాక్సిడెంట్‌లో స్పృహ తప్పింది

కొన్ని వివరాలు వ్రాసుకుని వెళ్ళిపోయారు పోలీస్ ఆఫీసర్స్

అక్కడే వున్న ఒక చైనీస్ నర్స్ వీళ్ళకు ఎదురొచ్చి బార్గవ్ అనే పేషెంట్‌కి బంధువులు మీరేనా అనడిగింది

అవును ఈమె అతని భార్య పేషెంట్ ఎలా వున్నాడు? లిలియన్ అడిగింది

గుండెలు కొట్టుకుంటుండగా నర్స్ చెప్పే సమాధానం కోసం ఎదురుచూసింది మల్లిక ఆమెకు నోరు పెగిలి మాట రావటం లేదు

ఇప్పుడు డాక్టర్ పేషెంటుతో వున్నారు ఆయనే మీకు ఏ సమాధానమూ చెప్పగలరు! ఈ లోపల దయచేసి మీరీ ఫామ్ పూర్తి చేస్తారా? మల్లికకు ఒక అప్లికేషన్ ఫామ్ పెన్ ఇచ్చింది నర్స్

పేషెంట్ బయోడేటా హాస్పటల్ బిల్లు ఏవిధంగా పే చేస్తారో వివరాలు పేషెంటుకి చెయ్యబోయే టెస్ట్‌లకు బంధువుల సమ్మతి- మొదలగు వివరాలను గురించిన ఫామ్ అది

ఇదిప్పుడే పూర్తి చేసి తీరాలా? అయిష్టంగా అడిగింది మల్లిక

అవును మీ పర్మిషన్ లేకుండా టెస్ట్‌లు చెయ్యటానికి వీలుండదు మరి అని వెళ్ళిపోయింది నర్స్ నర్స్ వెనకే తలుపువరకూ వెళ్ళింది మల్లిక మూసివున్న తలుపుల్లోనుండి ఏమీ కనబట్టం లేదు ఆ తలుపుల అవతల బార్గవ్ చావు బ్రతుకుల్లో పడివున్నాడని తలుచుకుంటే మల్లిక మనస్సును ఏ రాక్షసుడో ఇనప ఎడికిళ్ళతో నొక్కుతున్నట్లయ్యింది

లిలియన్ మల్లిక భుజం మెదుగా చెయ్యేసి తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టింది

అరగంటకి డాక్టర్ బైటికొచ్చారు సరాసరి మల్లికావాళ్ళు కూర్చున్న వైపుకి వచ్చారు

మిసెస్ బార్గవరామ్ మీరేనా?

అవును లేచి నిలబడబోయింది మల్లిక

వద్దు లేవకండి నాపేరు డాక్టర్ స్టీవెన్‌సన్ మీ హస్బెండ్‌ని పరీక్ష చేసిన న్యూరాలజిస్ట్‌ని అంటూ మల్లిక ప్రక్కన కూర్చున్నాడు

మల్లిక అతని కళ్ళల్లోకి చూసింది ఆమె అడగబోయే ప్రశ్నేమిటో అతనికి తెలుసు

పేషెంట్ కండిషన్ స్టేబుల్‌గానే వుందని చెప్పటానికి సంతోషిస్తున్నాను మిసెస్ రామ్! తలకి తగిలిన గాయం అంత బలమైంది కాదని మేం చేసిన కొన్ని టెస్టులవల్ల తేలింది కంకషన్ అని అభిప్రాయపడుతున్నాం అతన్ని హాస్పటల్‌కి తీసుకొచ్చిన పేరామెడిక్స్ చెప్పినదాన్ని బట్టి యాక్సిడెంట్ జరిగినప్పుడు అతను సీట్ బెల్ట్‌లో వున్నాడు అదే అతన్ని కాపాడింది లేకపోతే కండిషన్ ఇంకా సీరియస్‌గా వుండేది

అయితే ఒక్క విషయం! ప్రస్తుత పరిస్థితి బాగానే వుందని పూర్తి నిశ్చింత పనికిరాదు కనీసం ఇరవైనాలుగ్గంటలైనా పేషెంట్‌ని క్లోజ్ అబ్జర్వేషన్‌లో వుంచాలి అప్పటిక్కూడా ఏ కాంప్లికేషన్సూ లేకుండా వుంటే గండంగడిచినట్లే!

మొదట చెప్పింది విని మల్లిక తేలిగ్గా వూపిరి పీల్చింది కాని చివరిది మాత్రం మనస్సులో మళ్ళీ అలజడి రేపింది అయినా బంధువుల హోప్‌ని ఎక్కువ చెయ్యకుండా వుండటానికి డాక్టర్లిలాగే అంటార్లే అని తనను తాను సమాధానపరుచుకుంది

థాంక్యూ డాక్టర్! అంది ఒకరకమైన రిలీఫ్‌తో

ఇక మీరిక్కడుండి చేసేదేం లేదు ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకుని ప్రొద్దున్నే






# మల్లిక

రమ్మని నా సలహా అన్నాడు డాక్టర్ లేస్తూ

లేదు డాక్టర్! ఇంటికెళ్ళినా నిద్ర ప్రసక్తి వుండదు ఇక్కడే వుండాలనుకుంటున్నాను ధృడంగా అని తనూ లేచింది అతన్ని చూడొచ్చా?

సందిగ్ధంగా చూశాడు డాక్టర్ తల గోక్కుంటూ అన్నాడు ఇంకా పూర్తి తెలివి రాలేదు అదిగాక నొప్పి తెలియకుండా వుండటానికి లైట్ సెడెటివ్ ఇచ్చాం అతను నిద్రపోతుంది వుంటాడు మరి!

ఫరవాలేదు వూరికే చూసి వచ్చేస్తాను

సరే అని వెళ్ళిపోయాడు డాక్టర్

లిలియన్ తలుపు వరకూ వచ్చి ఆగిపోయింది మల్లిక లోపలికెళ్ళింది

మంచం మీద కళ్ళు మూసుకుని నిస్సహాయంగా పడివున్నాడు బార్గవ్ తలకి కట్టు ఒక చేతికి ఇంట్రావీనస్ ఫ్లూయిడ్ ట్యూబ్! గదిలో ఇంకా ఏవో పేర్లు తెలియని పరికరాలు వాటిపని అవి చేస్తున్నాయి

ఆ స్థితిలో బార్గవ్‌ని చూస్తుంటే మల్లిక మనస్సు దేవినట్లయ్యింది ఈ రోజుకోసం ఇద్దరూ ఎంతగా ఎదురు చూశారు? కాని జరిగిందేమిటి? మితిమీరిన ఆనందం ఇలాగే విషమిస్తుందా? ఇంకానయం! ఘోరమైన ప్రమాదాన్ని తప్పించుకున్నాడు ఆ చెట్టు అడ్డుకోక పోతే? చెట్టు అడ్డుకున్నా సీట్‌బెల్ట్ లేకపోతే? మల్లిక వూహించలేక పోయింది

వంగి బార్గవ్ నుదుటన ముద్దు పెట్టుకుంది అతని చెయ్యి చేతిలోకి తీసుకుని నిమిరింది

త్వరగా కోలుకో డార్లింగ్! నీకొక ముఖ్యమైన విషయం చెప్పాలి గుసగుసగా అంది

* * * * *

మల్లికను ఒంటరిగా వదలి వెళ్ళటానికి లిలియన్‌కి మనసొప్పటం లేదు కానీ ప్రొద్దున్నే ఆమెకు ముఖ్యమైన ప్రోగ్రాం ఒకటి వుంది వెళ్ళితీరాలి

లిలియన్ సంశయిస్తుంటే మల్లిక వెళ్ళమని గట్టిగా చెప్పింది

నాకేం పరవాలేదు లిలియన్! నర్సులున్నారు అదిగాక తెల్లారటానికి ఇంకొద్ది గంటలేకదా? ఇక్కడ సోఫాలో పడుకుంటాను

లిలియన్ వెళ్ళటానికి లేస్తూ ఏదో గుర్తొచ్చి ఆగింది ఈ వూళ్ళో నీకెవరైనా బంధువులు గాని స్నేహితులు గాని వున్నారా?

మల్లిక జవాబివ్వటానికి ఎక్కువ ఆలోచించనవసరం లేదు ఆమెకు గాని బార్గవ్‌కి గాని ఈ దేశంలో బంధువులు లేరు ఈ దేశంలో నేనేమిటి మల్లికకసలు బంధువులే లేరు ఇక బార్గవ్‌కి ముఖ్యమైన వాళ్ళల్లో వాళ్ళనాన్న ఒక్కడే!

స్నేహితులు? లూసీ అంజలి ఇద్దరూ దూరంగానే వున్నారు ఇకపోతే ఫిలిప్ జిమ్

వాళ్ళగురించి చెప్పింది మల్లిక

వాళ్ళ ఫోన్ నంబర్లు తెలుసా?

ఇప్పుడు నా దగ్గరలేవు అయినా ఎందుకు? ఆశ్చర్యంగా అడిగింది మల్లిక

వాళ్ళని పిలుస్తాను నీకు తోడుగా వుంటారు

ఇంత రాత్రిలోనా? అనవసరంగా వాళ్ళ నిద్ర పాడు చేసినట్లవుతుందేమో! సంశయించింది మల్లిక

ఈ మాత్రం ఆదుకోలేని స్నేహితులెందుకు? పరవాలేదు వాళ్ళ ఇంటిపేర్లు చెప్పు ఫోన్ డైరెక్టరిలో వెదకొచ్చు

మల్లిక అయిష్టంగానే ఇద్దరి ఇంటిపేర్లూ చెప్పింది

* * * * *

లిలియన్ వెళ్ళిపోయిన పావుగంటకల్లా ఫిలిప్ వచ్చాడు

అయామ్ రియల్లీ సారి మల్లికా! ఎలా జరిగిందిది?

అంతా వివరించింది ఫిలిప్‌ని చూస్తుంటే ఆమెకు కొండంత ధైర్యం వచ్చింది అతన్ని పిలిచి లిలియన్ మంచిపనే చేసిందనిపించింది

తర్వాత పావుగంటకి జిమ్ వచ్చాడు ఇద్దర్నీ ఒకళ్ళనొకళ్ళకి పరిచయం చేసి మళ్ళీ జరిగిందంతా జిమ్‌కి చెప్పింది

థాంక్ గాడ్! చిన్న గాయంతో తప్పించుకున్నాడు అన్నాడతను

మల్లికా! నువ్వేదైనా ఆహారం తీసుకుని ఎంతసేపయ్యింది? సడెన్‌గా అడిగాడు ఫిలిప్ మల్లిక ముఖం కొన్ని లంఖణాలు చేసినట్లుగా వుంది

ఒకదాని తర్వాత ఒకటిగా జరుగుతున్న సంఘటనలు ఆమెలోని శక్తినంతా తోడేశాయి ఇప్పటివరకూ టెన్షన్‌లో తన స్థితి తెలిసిరాలేదామెకు ఫిలిప్ అడిగిన ప్రశ్నతో ఎక్కడలేని నీర్సమూ వచ్చింది

మధ్యాన్నమెప్పుడో లంచ్ తిన్నానంతే

ఇప్పుడే వస్తానని మల్లిక పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు ఫిలిప్

అరగంటలో చిన్న బ్రౌన్ బాగ్‌తో తిరిగి వచ్చాడు

బాగ్ నుండి ఫ్లాస్క్ శాండ్‌విచ్ పొట్లాం బైటికి తీశాడు ఫ్లాస్క్ నుండి వేడిసూప్ మూతలో పోసి స్పూన్ వేసి మల్లికకిచ్చాడు

వేడిసూప్ ఇప్పుడెక్కడ దొరికింది నీకు? ఆశ్చర్యంగా అడిగింది

ఇంటికెళ్ళి తీసుకొచ్చాను నా అపార్ట్‌మెంట్ ఇక్కడికి దగ్గరే

ఫిలిప్ ముఖంలోకి చూసింది మల్లిక అతను ఎప్పటిలా చిలిపిగా అమాయకంగా లేడు సేదదీర్చే పెద్దన్నయ్యలా గంభీరంగా వున్నాడు

థాంక్యూ ఫిలిప్!

(ఇంకా ఉంది)

# అర్ధనారీశ్వరుడు

## జొన్నలగడ్డ లలితాదేవి

కాగితం కలం పట్టుకుని టేబుల్ దగ్గర కూర్చుని దీర్ఘాలోచనలో మునిగిపోయాడు శ్రీకాంత్ సాహిత్యం అనేది సరస్వతీదేవి ప్రసాదమని సంగీత సాహిత్యాలు ఆవిడ స్తన యుగళమని ఆ క్షీరాన్ని అంతో ఇంతో గ్రోలితేనే అవి లభ్యపడతాయని లేకపోతే లేదని పెద్దల వాక్కు. ఆ మాట వినడానికి తనకి ఎప్పుడూ మహదానందంగానే వుంటుంది ఎందుకంటే తనకి అంతో ఇంతో సాహిత్య పిపాస లేదా పిచ్చి తప్పకుండా వుంది

కాగితం మీద కలం పెడితే అలా ఆగకుండా రాయగల సత్తా కూడా వుంది ఒక్కొక్క మూడ్ వచ్చినప్పుడు బ్రహ్మాండంగా రాసి పారేస్తావు గురూ అంటూ ఆపీసులో తోటిపనివారు ఇంకా ఇతరత్రా మిత్రులు పొగుడుతూ వుంటారు

అంతవరకూ బేషుగానే వుంది అయితే వచ్చిన చిక్కు ఎక్కడ అంటే ఇంతమంది ఏకగ్రీవంగా బాగుందని తీర్మానించిన తన కథని ఏ పత్రికాధిపతి దయతలచి ప్రచురించలేదు

ఇంతమందికి నచ్చింది వాళ్ళకేందుకు నచ్చదో అసలు సాంతం చదువుతారో చదవరో తనకి ఎప్పుడూ సందేహాస్పదంగానే వుంటుంది

పోస్టేజితో పంపిస్తాడు కనక కొన్ని తిరిగివచ్చాయి మరికొన్ని అలా కూడా రాలేదు దాంతో విసిగిపోయాడు శ్రీకాంత్

చీ కాగితం కలం క్రింద పారేసి అస్త్ర సన్యాసం చేద్దామనుకున్నాడు ఇంక జీవితంలో కథలు రాసే వ్యధలు కొని తెచ్చుకోకూడదనుకొన్నాడు వచ్చిన జీతంతో సంతుష్టపడి పనిలోనే పైకి వచ్చి గొప్ప ఆఫీసరుగా కీర్తింపబడదామనుకున్నాడు.

అలాంటి నిరాశాపూరితమైన వాతావరణంలో తారకమంత్రం బోధించి వాల్మీకిని పునీతుని చేసిన



# ఇప్పటినుంచే పాప పళ్ళకు రక్షణ యివ్వండి



## పాపకు ఈ ఫ్లోరైడ్ రక్షణను బినాకా ఫ్లోరైడ్‌తో యివ్వండి




జీవితాంతం నిలిచి
వుండాలంటే మీ పళ్ళు
పిప్పి పళ్ళు కాకుండా ఉండేలా రక్షించుకో
వాలి. మరి బినాకా ఫ్లోరైడ్ యిస్తుంది కీలకమైన
ఆ రక్షణని— ఫ్లోరైడ్‌తో. ఎందుకంటే, హానిచేసే ఆమ్లాలు
పళ్ళ పైపొరను ఎదుర్కొన్నప్పుడు, పళ్ళలోకి ఫ్లోరైడ్ పీల్చుకోబడి.
తద్వారా పళ్ళ ఎనామెల్‌ని పిప్పి పళ్ళు కాకుండా నిరోధించేలా చేస్తుంది.
ప్రథమ దశల్లోనే పళ్ళు పిప్పిపళ్ళు కాకుండా చేసేది యిదే మరి
పళ్ళను పిప్పిపళ్ళు కానివ్వకండి, బినాకా ఫ్లోరైడ్‌తో వాటిని అరికట్టండి

జవజీవాలొలికే పళ్ళిక మీవి

**బినాకా ఫ్లోరైడ్**
టూత్‌పేస్ట్

అగ్రశ్రేణికి చెందిన భారతదేశపు ప్రభావంగల మొట్టమొదటి ఫ్లోరైడ్ టూత్‌పేస్ట్

ULKA HCC BF 10.85 TEL

నారద మహర్షిలా అతనికో గురువు వుపదేశించాడు ఓ మంత్రం

అదేమిటయ్యా అంటే ఆడవాళ్ళ రచనలకి యమా డిమాండ్ అని వాళ్ళు రాసింది కళ్ళు కమ్ముకోకపోయినా ప్రచురణ భాగ్యం అయినా కలిగిస్తారని అందుచేత పేరు మార్చి స్త్రీమూర్తిగా మారిపొమ్మన్నాడు

ఇంత బతుకు బతికి ఇంటి వెనకాల చచ్చినట్లు ఇంత మగమహారాజునై వుండి నెలకి నాలుగంకెల జీతం సంపాదిస్తూ ఓ ఆడ పేరుతో సాహిత్య కాంక్ష తీర్చుకోనా అని ఎదురు ప్రశ్న వేశాడు శ్రీకాంత్

ఆ మాటకు బిగ్గరగా నవ్వాడు ఆ మిత్రుడు ప్రతాప్

చూడు శ్రీకాంత్ నీకు దేవుడి మీద భక్తి వుందా?

ఆ! కావల్సినంత

నీ ఆరాధ్య దైవం ఎవరు?

శ్రీనివాసుడు

అదా! ఆయన బావమరిదిని తలచుకో ఒక్కసారి

బావమరిదినా!

అదే శంకరుడని ఆయన అర్ధనారీశ్వరుడన్న మాట నీకు గుర్తు వుండే వుంటుందిగా!

వుందన్నట్లు తల తాటించాడు శ్రీకాంత్

అలాగే శిఖండిని కూడా తల్చుకో - శిఖండి లేకపోతే భీష్ముడు నేలకొరిగేవాడా చెప్పు? ఆ శిఖండి ఎవడు ఆడ - మగ అలాగ నిన్ను మారిపొమ్మనలేదు పేరు మార్చుకోమన్నాను అంటూ నచ్చ చెప్పాక అంగీకరించాడు

ఆ మిత్రుడు సలహా ఇచ్చిన వేళ చాలా మంచిది 'శ్రీదేవి' అన్న పేరుతో అతను రాసినవన్నీ కాకపోయినా రెండు మూడు అయినా పడ్డాయి దాంతో చాలా ధైర్యం వచ్చింది శ్రీకాంత్‌కి

సరిగ్గా ఇలాంటి పరిస్థితిలోనే వున్న మరో సాహిత్య పిపాసి గురించి అతనికి తెలియదు

ఎన్ని కథలు పంపినా తిరిగి వచ్చాయి ఇప్పుడంతా మగమహారాజులు ఏలుతున్న లోకం - ఏ ఫీల్డులో చూసినా వాళ్ళే! కనీసం ఆడరాజ్యం అని సంతోషపడటానికి ఇందిరాగాంధీ కూడా లేకపోయె ఒకప్పుడు స్త్రీల రచనలని విశేషంగా ఆదరించిన పాఠక మహాశయులందరి గాలీ మారిపోయింది

ఏ పత్రిక చూసినా మగవాళ్ళే! వాళ్ళ రచనలే! ఏం? మగాళ్ళు ఆడ పేరుతో రాయగాలేంది ఆడవాళ్ళు మగ పేరుతో రాస్తే వచ్చిన తప్పేమిటి? అనుకుంది ఈజీచైర్‌లో వాలి దీర్ఘాలోచనతో మునిగిన మానస

అందుకే అర్ధనారీశ్వరునే ఆమె కూడా గుర్తు చేసుకుంది తన పేరుని మనోహర్‌గా మార్చుకుంది ఆ పేరుతో నాలుగయిదు పత్రికలకి కథలు పంపింది

ఆశ్చర్యంగా అవి ప్రింటయ్యాయి - అవి పడిన ప్రోత్సాహంతో నవలా రచన కుపక్రమించింది మానస

తనకి శ్రీదేవి పేరు బాగా కలిసి వచ్చినందుకు సంతోషంగా నవల రాశాడు శ్రీకాంత్

ఆ రెండు నవలలూ ఒకే పత్రికకు పంపబడ్డాయి

## ఉద్ధరింపుము ప్రభూ!

ఓంకార మందిరమున సు
ఖం కరమౌ నాదపీర కస్థితన్నైద్యా
నాంకిత చిత్తంబున నిను
సంకీర్తన చేతు సతము సామజ వదనా

విఘ్నముల శాంతి బొందించు విధిని నిర్వ
హింప నియమింపబడితి పీ పృథివి యందు
కార్యనిర్వాహకత యందు కడుసమర్థ
వంతుడవె ఈప్రమత్తత వచ్చెనెట్లు

సేతుశీతాచల వ్యాప్త సీమలోన
నేడు ముసిరిన హింసాభ్రని చయమెంత
ప్రళయకరముగ నున్నదో పరచి చూచి
కర్ణరుంరయూనిలముల బోకార్ప వేమి?

ఆఫ్రికావాసు లాకలి కల్లలాడ
పాలసంద్రాల బీతికెడి పాడియాల
చంపు జర్మన్ల వారించి నింపు మిల తి
రంబుగా వసుధైక కుటుంబ దృష్టి

వ్యక్తిగతముగ వ్యక్తుల వాంఛ లొసగి
వారినానంద పరచు టేపాటి మహిమ
వేదనార్ణవ మగ్నయా విశ్వమాత
నుద్ధరింపుము నీశక్తియుక్తి లొసగ

—సూర్యదేవర రవికుమార్

## అర్ధనారీశ్వరుడు

విచిత్రంగా ఆ రెండూ సెలక్టయ్యాయి అంతేనా ఒకవారం తేడాగా రెండూ ప్రచురణ ప్రారంభమయ్యాయి

ఆనందంతో పది పౌన్లు పెరిగిపోయాడు శ్రీకాంత్ ఎక్కడికి వెళ్ళినా అతని నవలని గురించే కబుర్లు దాంతో పాటు మనోహర్ రాస్తున్న నవల మీద కూడా చర్చ జరుగుతోంది

నాలుగు వారాలు గడిచాయి

ఆ రోజు ఆఫీసుకు వచ్చిన లెటరు అందుకుని చదవసాగాడు శ్రీకాంత్

శ్రీదేవిగారికి, మీరు కుమారియో, శ్రీమతో నాకు తెలియదు కాని మీరు స్త్రీ అయి వుండి స్త్రీని ఆ విధంగా చిత్రించడం ఏమీ బాగాలేదు పురాణాల్లో వర్ణించినట్లు నిత్యజీవితంలో ఏ కథానాయికా వుండదు వుండలేదు

సముద్ర కెరటాల్లాంటి మోకాలి వంకూ వున్న నల్లని శిరోజాలూ తామర రేకుల్లాంటి కళ్ళు, పచ్చని పసనిమ్మ పండు రంగు దానిమ్మ గింజల లాంటి పెదవులు సంపెంగలాంటి నాసిక సింహమధ్య మద్య నడుము సుతారంగా సుకుమారంగా ప్రేమే తప్ప మరో గుణం లేని -నిదానమే తప్ప గట్టి పలుకులు కూడా రాని అప్సరస ఎక్కడ వుంటుంది అది అలా వుండాలి అన్న మీ ఊహ మాత్రమేనని చెప్పగలను

నిత్యం అనేక సంఘర్షణల మధ్య నలిగే ఆడపిల్లలు వున్న లావణ్యాలనే కోల్పోయి నిరాశా పూరితమైన సంఘ వాతావరణంలో అలా మీరు రాసినట్లు వుండటం అసంభవం - స్త్రీ కథానాయికని మార్చండి ఆ కాలంలోలా అసూర్యంపశ్యలుగా వుండి ఏ ఆడదానికీ రోజు వెళ్ళదు ఆనాటి మహారాణులు పాలిటిక్స్‌లో దిగిన వారు లేరా, కాలం మారలేదా, జయపూర్ మహారాణి గాయిత్రిదేవి లాంటి వారిని ఉదాహరణగా తీసుకోండి దిగువ నా అడ్రసు వుంది జవాబు రాయండి నా నవల మీ నవలతో పాటి వస్తోంది చూస్తున్నారా? మనోహర్

ఆ ఉత్తరం ఒకసారి గాదు పదిసార్లు చదివాడు శ్రీకాంత్ ఇతనెవరో పాపం తను నిజంగా స్త్రీయే అనుకుంటున్నాడు నిజంగా తను స్త్రీ అయితే గదా స్త్రీలని గురించి అంతో ఇంతో అయినా తెలుసుకోవడానికి పోనీ భార్య ద్వారా పదిమంది ఆడవారిని పరిశీలించాలంటే తనకింకా పెళ్ళి కూడా కాలేదు

తననీ ఎవరో విమర్శించాడు బాగానే వుంది అతని నవల కూడా సీరియల్‌గా వస్తోంది అందులోనూ వెతికితే తప్పులు దొర్లవేమిటి!

వెంటనే తన డబుల్ లెన్స్‌లోంచి పరిశీలించి అట్టే కష్టపడకుండానే ఓ పాయింట్‌ని పట్టేశాడు

మిస్టర్ మనోహర్

మీ ఉత్తరం చదివాను బాగానే వుంది నేను స్త్రీ అయి వుండి స్త్రీల నెంత అసహజంగా సృష్టించాననుకున్నారో మీరూ అంతేగా మీరు మాత్రం పెద్ద నేచురాల్టీ కుప్పించిందేముంది మీ హీరో వర్ణనే తీసుకోండి ఆజానుబాహు అరవింధదళాయతాక్షు అన్నట్లు రాశారు గొప్ప చదువు ఆరు అడుగుల ఎత్తు అరడజను బిజినెస్‌లు అరడజను బిల్డింగ్‌లు కొత్తగా వచ్చిన మారుతీ కారుతో సహా అరడజను కార్లు, స్కూటర్లు, తోటలు, పొలాలు, అందమైన రూపం, మంచితనం అంతా మూసబోసుకొని కామక్రోధ లోభమోహాలన్నీ జయించిన జితేంద్రుడిలా మహాశాంతపరుడు స్త్రీలని ప్రేమించడం, గౌరవించడం తప్ప పల్లెత్తి మాట మాట్లాడలేనివాడు సిగిరెట్ అన్నా తాగని సద్గుణవంతుడు ఇన్ని మహోన్నతమైనవన్నీ ఒకే వ్యక్తిలోనే వుండటం సంభవమే నంటారా? మగవారై వుండి మీరే ఇలా రాస్తే మగవారి సమస్యలు వారి ఇబ్బందులు, వారి కష్టనష్టాలు లోకానికి తెలియ చెప్పినట్లే వుంటుందా! ఆలోచించండి

శ్రీదేవి

ఆ ఉత్తరం చదువుకొని ఆలోచనలో పడింది మానస

ఈమె ఎవరో బాగానే రాసిందే అనుకుంది

# అర్ధనారీశ్వరుడు

నిజంగానే తన వూహల్లోని రాకుమారుడు నిత్యజీవితంలో వుండగలడా' ఊహ – వాస్తవానికి ఎప్పుడూ తేడా వుంటుంది

దానికి జవాబు రాసింది మానస

ఆ విధంగా ప్రారంభమైన ఉత్తరాల పరిచయం ఒకరినొకరు చూడాలన్న తపన వరకూ వచ్చింది

'నేను ఎఱ్ఱ రంగు ప్యాంటు, తెల్లరంగు షర్టు వేసుకుని ఫలాని రోజున హొటల్ మమత దగ్గర వుంటాను మీరు రండి అంటూ మనోహర్ నించి వుత్తరం వచ్చింది

నేను కూడా ఎఱ్ఱ రంగు చీర, తెల్లరంగు జాకెట్ వేసుకొని వస్తాను చేతిలో ఎఱ్ఱ గులాబి పట్టుకుంటాను అంటూ శ్రీదేవి జవాబిచ్చింది ఆ రోజే మమత హొటెల్ దగ్గర కలవ వలసిన రోజు

తల దువ్వుకుంటూ నవ్వుకొసాగాడు శ్రికాంత్

ఎఱ్ఱ ప్యాంటు, తెల్ల షర్టు వేసుకున్నాడు టేబుల్ మీద ఎఱ్ఱ గులాబి నవ్వుతోంది

అదే టైములో ముస్తాబవుతోంది మానస

ఎఱ్ఱ చీర, తెల్ల జాకెట్ – తను ప్యాంట్ షర్టులో వూహించుకుంటుంది పాపం శ్రీదేవి తను ఆడది అని తెలియదుగా అని తనలో తనే నవ్వుకుంటూ హ్యాండ్‌బ్యాగ్ అందుకుంది

పాపం తను నిజంగానే ఆడపిల్ల అనుకుని చూసి మురిసిపోదామనుకుంటూ బయలుదేరుతూ వుంటాడు పూర్ ఫెలో! తన్ని చూసి నిలువునా నిర్ఘాంతపోతాడు మనోహర్ అనుకుంటూ తాళం పెట్టి బయలుదేరాడు శ్రికాంత్

హోటల్ మమత దగ్గర ఇద్దరూ రిక్షాలు దిగారు బయట వేసి వున్న సోఫాలో కూర్చున్నాడు శ్రికాంత్

అతన్ని చూసి తెల్లబోయింది మానస ఇతగాడెవరో అయివుంటాడు శ్రీదేవి వస్తుంది అనుకుంటూ సోఫా చివరగా కూర్చుంది ఈ దేంజర్ శారి ఎవరు మన పక్కన చేరింది ఇంకా ఎంత సేపటికి దిగుతాడో ఆ మనోహరుడు రచయిత అయివుండి ఆ మాత్రం పంక్చ్యువాలిటీ మెయిన్టైన్ చేయక్కర్లేదా అనుకుంటూ విసుక్కొన్నాడు శ్రికాంత్

అరగంట గడిచినా ఎవరూ రాకపోయేసరికి – ఇద్దరికీ అనుమానం కలిగింది మానస ముందుగా శ్రికాంత్‌కేసి తిరిగింది అతనింకా అలా గులాబి పువ్వు పట్టుకొనే వున్నాడు

'చూడండి మీరు – అంటూ ఆగిపోయింది

'మీరే – మరి మీరు అన్నాడు శ్రికాంత్ కూడా ఆమెకేసి తిరిగి

"నేను మనోహర్‌ని అంది సిగ్గుపడుతూ

చంపారు – నేను శ్రీదేవిని అన్నాడు శ్రికాంత్

బలే బాంబు వేశారే' అంది నవ్వుతూ

మీకంటేనా' మగవాళ్ళు ఆడ పేరుతో రాసేవాళ్ళున్నారని నాకు తెలుసు గాని ఇలా ఆడవాళ్ళు మగ పేరుతో రాసి అందర్నీ పల్టీలు కొట్టిస్తారని మటుకు నా లైఫ్‌లో నేను ఇదే చూడటం"

ఆ మాటకు గర్వంగా నవ్వింది మానస

'ఏం చేస్తాం రోజులలా వున్నాయి అంతా పురుష రాజ్యం ఆడబడుచులకి ఆదరణ లేక ఇలా మగ పరదా వేయాల్సి వచ్చింది '

ఆమె జవాబుకి నవ్వుకున్నాడు శ్రికాంత్

మీరు మగవారు కనక ఆడవార్ని అంత గొప్పగా వూహించారా అంది మానస

మరో' మీరు ఆడవారు కనక అంత గొప్ప వూహాసుందరుడిని చిత్రించారు ఆడవాళ్ళని అంచనా వేయడంలో నేను – మగవారి స్వభావాల చిత్రీకరణలో మీరు ఫెయిల్ అయ్యారంటే మీకు కోపం రాదుగా!"

కోపం దేనికి?" అంది నవ్వుతూ మానస

"థాంక్యూ' రండి మన పరిచయానికి గుర్తుగా పైకి పోయి కాస్త కాఫీ త్రాగివద్దాం అన్నాడు శ్రికాంత్

అనుసరించింది మానస.

స్వీటు, శావరి, కాఫీ తెప్పించాడు అవి తింటూ

మీ పేరు ఏమిటి?' అని అడిగాడు

నా పేరు మానస మీ పేరు?

శ్రికాంత్

బ్యాచిలరా

మరే మీరు కూడా మిస్ అనేనా అంచనా!"

'అవును నేనూ మిస్‌నే అంది నవ్వుతూ మానస

ఆ కలయిక అద్భుతంగా అపురూపంగా చిత్రించుకుంటూ ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు

ఈసారి శ్రికాంత్ నుంచి ఉత్తరం అందుకుంది మానస

డియర్ మానసాదేవి స్త్రీలని గురించి మీరు – పురుషుని గురించి నేను వారి సమస్యల నర్థం చేసుకుంటూ ఉభయులం ఏకమై సాహిత్యం ప్రారంభిస్తే మనకి ఎదురుండదు మీకు అభ్యంతరం లేకపోతే మనం వివాహం చేసుకుందాం జవాబిస్తారుగా! శ్రికాంత్

ఆ ఉత్తరం చదువుకుని పులకరించిపోయింది మానస

మరి నెల్లాళ్ళకి శుభలేఖలు అచ్చయ్యాయి అందులో శ్రికాంత్ (శ్రీదేవి) మానస (మనోహర్) పెన్ నేమ్‌లని కూడా పక్కన వేసి మరి పంచితే చదువుకున్న అందరూ ఆశ్చర్యంతో నోరు తెరిచారు

హిందూవులకి ఆరాధ్య దైవాల్లో అర్ధనారీశ్వరుడు కూడా ముఖ్యుడే గదా – అని వారి జవాబు విని మరోసారి హాయిగా నవ్వుకున్నారు – వచ్చిన ఆహూతులు







ANDHRA
CEMENT

# చవితి హాస్య విపంచి

ARUN nagisetty..


















## వ్యక్తిగతం



గుజరాత్‌కి చెందిన గిత్ సేఠీ బిలియార్డ్స్ చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించాడు ఈయన వయసు 24 సంవత్సరాలు న్యూఢిల్లీలో జరిగిన 25వ ప్రపంచ బిలియార్డ్స్ చాంపియన్ షిప్ పోటీలలో సేఠీ ప్రఖ్యాత ఆస్ట్రేలియన్ ఆటగాడైన బాబ్ మార్షల్ (75) పైఅ05పై 3,809–2,453 పాయింట్లతో మన విజయాన్ని సాధించాడు ఈ పోటీలలో పాల్గొనటం సేఠీకి ఇదే మొదటిసారి ఇంత వరకూ ఈ టైటిల్‌ని గెలుచుకున్న ఆటగాళ్ళందరిలో సేఠీ చిన్నవాడు బిలియార్డ్స్ ఆటలో చాంపియన్‌లకి చాంపియన్ అయిన ఇతనికి ఉజ్వల బవిష్యత్తు ఉందనటంలో సందేహం లేదు □



ఇటీవల ఫ్రెయిడా సెమ్‌బాక్ క్రోన్ తమ 70వ పుట్టిన రోజు పండుగని ఘనంగా జరుపుకున్నారు మ్యూనిచ్‌కి చెందిన క్రోన్ సర్కస్ ప్రాంగణంలో జరిగిన ఈ పండుగకి హాజరైన అతిథులలో జోకర్‌లు రింగ మాష్టర్‌లే కాక గుర్రాలు ఏనుగులు కూడా ఉన్నాయి!

శ్రీమతి ఫ్రెయిడా క్రోన్ సర్కస్ లో సీనియర్ డయిరెక్టర్! ఈమెకి చిన్నప్పటి నించీ సర్కస్ అంటే ప్రాణం! ఈమె తల్లితండ్రులు కూడా క్రోన్ సర్కస్‌కి చెందినవారే 1934 లో ఫ్రెయిడా కార్ల్ సెమ్‌బాక్‌ని వివాహం చేసుకొన్నారు సెమ్‌బాక్ జంతువులకు సర్కస్ ఎట్లని గురించి తర్ఫీదు ఇచ్చేవారు వారిద్దరూ కలిసి రింగ్ విన్యాసాలు నృత్యాలు ఊయల విలాసాలు గుర్రపు స్వారీలు చేసేవారు వారి ఎట్లని జనం విరగబడి చూసేవారు!

భర్త మరణించాక కూడా శ్రీమతి ఫ్రెయిడా క్రోన్ సర్కస్‌ని వదలిపెట్టలేదు ఆరున్నర దశాబ్దాలకి పయిగా ఆ సర్కస్‌తో ఆమె అనుబంధాన్ని పెంచుకున్నారు ఇప్పటికి ఈమె అబిమానులు లక్షల సంఖ్యలో ఉన్నారు చలాకీగా, ఉల్లాసంగా ఎప్పుడూ ఆరోగ్యంగా కనిపించే శ్రీమతి ఫ్రెయిడా తమ శేష జీవితాన్ని కూడా సర్కస్ లోనే గడపదలచుకోవడంఆమెకి సర్కస్‌పట్ల ఉన్న ఆసక్తినీ అనురక్తినీ స్పష్టం చేస్తుంది □

## వారఫలం

### 13–9–1985 శుక్రవారం మొదలు 19–9–1985 గురువారం వరకు

★ **మేషం :** చేసే వ్యాపారమందు ఒడిదుడుకులు సహజం, అందుకొరకు చింతించటం న్యాయం గాదు. ధైర్యంతో ముందుకు నడవాలి పని పాటలు చేసేవారి కొరత ఏర్పడు-తుంది బారి వ్యాపార మందు అనవసరంగా అడ్డంకులు రానున్నవి. గ్రహించాలి స్త్రీలకు అనుకొన్న దొకటి, అయ్యేదొకటి గ్రహించండి

★ **వృషభం :** నూతన మిత్రులు దాపునకు రాగలరు. వారి మూలాన ఏదో లాబం లబ్ధి ఆశిస్తారు సంబవమనే గ్రహించండి అంతో యింతో స్థితి యందు మార్పు రానున్నది లలిత కళా ప్రావీణ్యత ప్రకాశిస్తుంది స్త్రీలకు కృషి యందు రాణింపు, ఉద్యోగమందు పెంపునకు అనుకూలం

★ **మిథునం :** ఆరోగ్య విషయంగా శ్రద్ధ వహించాలి పరాయి వారికి సాయపడటం మంచిదేగాని, మి వ్యవహారాలు చూచుకోండి మికూ కావలసినంతటి బాధ్యత ఉందిగా స్వప్రయోజన-మాశించి చాలా మంది దాపునకు వస్తారు గమనించి మెలగండి స్త్రీలకు చేసిన ఉద్యోగ యత్నాలు ఫలవంతం కానున్నవి. గ్రహించాలి

★ **కర్కాటకం :** ఎంతో కాలంగా మొదలు పెట్టిన ఒకానొక నిర్మాణ కార్యక్రమం మరలా ప్రారంబం కానున్నది కళా ప్రావీణ్యత వికాస మందనున్నది నటకులకు, గాయకులకు, నాట్యమందు ప్రావీణ్యతగల వారికి, సదవకాశాలు వారాంతంలో సంబవం, ఉద్యోగ యత్నాలు కలసి రాగలవు స్త్రీలకు ముఖ్య రంగాలలో అనుకూలం, దనాదాయం, విలువగల వస్తుసేకరణ

★ **సింహం :** ఎంతో కాలంగా ఆశించిన ప్రయాణం, హటాత్తుగా ఈ వారం నెరవేరనున్నది అధికార రీత్యా మికేదో మేలు చేకూర నున్నది కొందరకు అప్రయత్నాదాయ మున్నది తెలివి తేటలు రాణించే సమయం స్త్రీలకు వస్తువులు సమకూర్చుకొనుటకు, విశేషంగా ధనరాబడికి అనుకూలం

★ **కన్య :** బంధువులనో, మిత్రవర్గాన్నో ఆదరించవలసిన అగత్యం ఏర్పడుతుంది ఏమయినా వ్యాపారరీత్యా అత్యాశకు పోవటం సమంజసం గాదు లాభాపేక్షకు కూడ హద్దు గలదు నూతనాంశాలు గ్రహించుటకు, కొందరు నూతన వ్యాపారం ప్రారంభించుటకు అనుకూల వారంగా గుర్తించాలి స్త్రీలకు ధన కనక వస్తు సేకరణకు, ఉద్యోగమందు పెంపునకు అనుకూలం. గ్రహించండి

★ **తుల :** చాలమంది మిమ్ము స్వప్రయోజనాలకు వాడుకోవాలని చూస్తారు రాజకీయ రంగాన మిమ్ము క్రిందికి త్రోయాలనే యత్నాలు జరుగుతాయి డబ్బుకొరకు యిబ్బందిపడటం తప్పదు ఉద్యోగమందు కూడా సంకట పరిస్థితులుంటాయి స్త్రీలకు వృత్తి వికాసం, పెద్దల అనుబూతి, ప్రయాణానుకూలం

★ **వృశ్చికం :** స్థితియందు చెప్పదగిన ప్రగతి కనిపిస్తుంది విద్యా విషయంగా మికు మేలు చేకూరుతుంది లలిత కళా ప్రావీణ్యత వికాసం నొందగలదు చాల మందికి పొరుగూరి ప్రయాణాలు చెప్పదగిన అంశం నాల్గువిధాలా ప్రగతి గలవారం స్త్రీలకు ఉద్యోగమందు ప్రమోషన్ ఆశింప దగినవారం

★ **ధనుస్సు :** చాల వారాలుగా అనుకొన్న పనులు జరుగకపోవటం చేసిన పనే మరలా చేయవలసి రావటం, వృత్తి కుంటుపడటం, అనవసర చికాకు చుట్టు ప్రక్కల వారితో, బంధువులతో మనస్తాపానికి అవకాశ మున్నది జాగ్రత్తపడాలిగా! స్త్రీలకు సుఖశాంతులకు, ఆశించిన దనం అందటానికి అవకాశం

★ **మకరం :** మి మనోరథం ఈడేరే వారం కుటుంబ కలహాలు ఒక రేవునకు రాగల సమయం ఏదో మేలు జరుగ నున్నదని ఆశించటమే గాని అందగల మార్గం లేదు వృత్తియందు కూడ ఆశించిన ప్రయోజనం అందదు స్త్రీలకు [illegible]గా నమ్ముకోవచ్చు దనరాబడికి, ముఖ్యులను కలిసి కొనుటకు అవకాశమున్నది

★ **కుంభం :** శుభకార్యం నిమిత్తం బంధుమిత్రులను చూచుటకు ప్రయాణిస్తారు ధన విషయ పరిష్కారానికి అనుకూల సమయం, అప్రయత్న ధనలబ్ధి కొందరకు చెప్పదగిన అంశం సబాగౌరవం పత్రికా గౌరవానికి అస్కారమున్నది స్త్రీలకు సుఖ శాంతులు, వృత్తియందు కించిత్తు పెంపు చెప్పవచ్చు

★ **మీనం :** నూతన మిత్రుల సందర్శించుటకు, నూతనాంశాలు గ్రహించుటకు, స్పెక్యులేషన్ ఫలించుటకు, అనుకూల సమయం ఎవరో రావాలని ఎదురు చూస్తున్నారుగా! వారిమూలాన ఏదో ఉపకారం ఆశించారుగా! అది నెరవేరుట, గృహ నిర్మాణం పునహ ప్రారంభించుటకు అవకాశమున్నది శుభ కార్యానుకూలత చేకూరుతుంది స్త్రీలకు బంధువైరమో, మిత్ర సంఘంలో మనస్తాపమో సంబవం. జాగ్రత్త!

–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# హైదరాబాద్ నోట్‌బుక్

## శ్రీ రాజేశ్వరరావుకు సన్మానం :–

రసమయి ఆగస్టు 11న రవీంద్ర భారతిలో చలనచిత్ర సంగీత సమ్రాట్టు శ్రీ సాలూరు రాజేశ్వరరావు చలన చిత్ర జీవిత స్వర్ణోత్సవం జరిపి సహృదయులందరినీ ఆనందపరచింది సార్వత్రిక విశ్వవిద్యాలయం అధ్యక్షుడు డాక్టర్ సి నారాయణరెడ్డి ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించారు 1935 లో కృష్ణలీలలు చిత్రంలో బాలకృష్ణుడుగా నటించిన శ్రీ రాజేశ్వరరావు సంగీత ప్రపంచంలో అడుగు పెట్టి మహా సంగీత దర్శకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించారని డాక్టర్ నారాయణరెడ్డి ప్రశంసించారు ముఖ్య అతిథిగా వచ్చిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు ప్రసంగిస్తూ ఆదర్శమైన నడవడితో మనుగడ సాగించడమే జీవిత పరమార్థం దానికి తోడుగా సమాజ సేవా భావంతోను నూతనత్వానికి నీరాజనాలిచ్చే తృష్ణతో కళాతపస్విగాను మనగలగడం నిజంగా ఎంతో గొప్ప విషయం అలాటి ఉత్తములు సాలూరు రాజేశ్వరరావుగారు జన్మించిన సాలూరు వంశం ధన్యమైంది రసజ్ఞుల సమక్షంలో రాజేశ్వరరావు గారికి జరుగుతున్న ఈ సన్మానాన్ని సంగీత సరస్వతికి జరుగుతున్న కనకాభిషేకంగా భావిస్తున్నాను ఈ కార్యక్రమంలో పాల్గొనడం నా అదృష్టంగా భావిస్తున్నాను అని అన్నారు పిదప ప్రముఖ చలనచిత్ర నటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు రసమయి పక్షాన శ్రీ రాజేశ్వరరావును సన్మానించారు శ్రీ రాజేశ్వరరావు చలనచిత్ర సంగీత జీవితంపై ఎవరైనా డాక్టరేట్ చేస్తే బాగుంటుందని ప్రముఖ చలనచిత్ర నేపథ్య గాయకుడు శ్రీ ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సూచించారు ఘంటసాల పేరుతో ప్రభుత్వం నెలకొల్పదలచుకొన్న సంగీత కళాశాలకు శ్రీ రాజేశ్వరరావును ప్రధానాచార్యులుగా నియమించడం ఉచితమని ప్రముఖ చలనచిత్ర సంగీత దర్శకుడు శ్రీ సత్యం సూచించారు డాక్టర్ దాశరథి పోలీసు కమిషనర్ శ్రీ రొద్దం ప్రభాకరరావు శ్రీ కె వి భాస్కరరావు ప్రముఖ చలనచిత్ర దర్శకుడు శ్రీ బి ఎ సుబ్బారావు, సెన్సార్ బోర్డు అధ్యక్షుడు శ్రీ సుబ్బరామిరెడ్డి, శ్రీ బి ఎ వి శాండిల్య మున్నగువారు అభినందించారు శ్రీ రాజేశ్వరరావు కృతజ్ఞత తెలుపుతూ ఆంధ్ర రాజధానిలో పలువురు పెద్దల సమక్షాన జరుగుతున్న ఈ స్వర్ణోత్సవం తనకెంతో సంతోషం కలిగిస్తున్నదన్నారు చివరగా శ్రీ రాజేశ్వరరావు ఐదుగురు కుమారులు సంగీత విభావరి సమర్పించారు

## దేశసమగ్రతా పాదయాత్ర :–

ప్రజాపిత బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయం వారు భారత సంస్కృతి వ్యాప్తికి ప్రజలలో నైతిక జీవిత వికాసానికు చేస్తున్న అపార కృషి అందరికీ తెలిసిందే ఇప్పుడు ఈ విశ్వవిద్యాలయ బృందం దేశప్రజలలో సమైక్య భావనా వ్యాప్తి మరొక గొప్ప పనికి పూనుకుంది ఇది కన్యాకుమారి నుంచి ఢిల్లీకి పాదయాత్ర ఈ బృందం జూన్ 9 న పాదయాత్ర ప్రారంభించి 66 రోజులలో 2300 కిలో మీటర్లు పయనించింది 2400 గ్రామాలు సందర్శించి ఆగస్టు 13 ఉదయం హైదరాబాద్ చేరింది ఈ బృందానికి సిటీ కాలేజ్ ఆవరణలో రాష్ట్ర పురపాలక శాఖా మంత్రి శ్రీ వేంకటరావు స్వాగతం పలికారు ఇలాటి పాదయాత్రలను ప్రజలు, ప్రభుత్వం ప్రోత్సహించాలని, యువకులు తమ శక్తిని, సమయాన్ని దేశాభ్యుదయానికి వినియోగించాలని శ్రీ వేంకటరావు అన్నారు బ్రహ్మకుమారి కులదీప్ తమ సంస్థ కార్యకలాపాలు, లక్ష్యాలు చెబుతూ, తమ విశ్వవిద్యాలయానికి ఐక్యరాజ్యసమితి సభ్యత్వం ఉన్నదని, దేశ విదేశాల్లో 15 వేల సేవా కేంద్రాలున్నాయని అన్నారు కులమత వర్గ విభేదాలు లేనప్పుడే దేశం ముందుకు పోతుందని అందువల్ల తమ సంస్థ అస్పృశ్యత, బాల్యవివాహాలు వరకట్నాలు వంటి దురాచారాలకు వ్యతిరేకంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నదని ఆమె అన్నారు అధ్యక్షత వహించిన హైదరాబాద్ మాజీ మేయర్ శ్రీ కుముద్‌నాయక్ తమ ప్రసంగంలో సంఘంలోని దురాచారాలు తొలగించి, దేశ ప్రజలలో సమైక్య భావనను వ్యాపింపజేయడానికి జరుగుతున్న ఈ మహాకార్యాన్ని ప్రశంసించారు పాదయాత్ర సంచాలిక శివకన్య, బ్రహ్మకుమార్ ప్రతాప్ బ్రహ్మకుమారి రాధ తమ పాదయాత్రానుభవాలు తెలిపారు

## నన్నేం చేయమంటారు?

అంతర్జాతీయ మహిళా దశాబ్దం ఈ సంవత్సరంతో సమాప్తమయింది ఈ సందర్భంగా రాష్ట్ర మహిళా సంఘం ఆగస్టు 14 న నిర్వహించిన ప్రదర్శనం అనంతరం ముఖ్యమంత్రి శ్రీ రామారావు మహిళను ఉద్దేశించి ప్రసంగిస్తూ, నేను నా ప్రభుత్వం మహిళా లోకానికి ఎంతో చేయాలనుకుంటున్నాము కాని ప్రతిదానికి కేంద్రంపై ఆధారపడడం వల్ల ఏమీ చేయలేకపోతున్నాము యాభైఒక్క శాతం ఆడవారున్న సమాజంలో వారి సమస్యలే ఎక్కువగా వున్నాయి అందరికీ సమాన హక్కులు కల్పించేందుకు తెలుగుదేశం శాయశక్తులా కృషి చేస్తుంది స్త్రీలకు ఆస్తి హక్కు కోసం ఒక బిల్లును తయారు చేసి కేంద్ర ప్రభుత్వం పరిశీలనకు పంపాము అయితే ఇంతవరకు దానిపై కేంద్రం నిర్ణయం రాలేదు రాష్ట్రప్రభుత్వం అభ్యుదయభావాలతో ఏ నిర్ణయం తీసుకున్నా, కేంద్రం అడ్డుపడుతున్నది ఉద్యోగాలలో స్త్రీలకు 35 శాతం రిజర్వేషనులు కల్పించాలని తలపడితే, న్యాయస్థానాలు దానికి వ్యతిరేకంగా తీర్పు చెప్పాయి అని ఆవేదన వెలిబుచ్చారు తన ప్రభుత్వం మహిళల కోసం చేసిన పనులను ముఖ్యమంత్రి వివరిస్తూ, విముక్తి కార్యక్రమం క్రింద గ్రామానికొక మరుగుదొడ్డి గర్భిణీ స్త్రీలకు రెండు నెలల పాటు జీతంతో సెలవు విధవలకు పింఛను, మహిళలకు తిరుపతిలో విశ్వవిద్యాలయం మరికొన్ని సౌకర్యాలు కలిగించామన్నారు ఏ పార్టీ అయినా, ఏ వ్యక్తి అయినా, స్త్రీల అభ్యుదయం కోసం పాటుపడాలని ఆయన కోరారు ప్రజలకు సమానత నేర్పలేని స్వాతంత్ర్యం మనకెందుకు అని ముఖ్యమంత్రి ప్రశ్నించారు ఈ ప్రదర్శనం ఉదయం ఆర్ టి సి క్రాసురోడ్డు నుంచి అసెంబ్లీ వరకు జరిగింది దాదాపు 5000 మంది మహిళలు ప్రదర్శనంలో పాల్గొన్నారు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల నుంచి మహిళలు వచ్చి ఈ ప్రదర్శనంలో చేరారు ప్రదర్శనం తర్వాత అసెంబ్లీ ప్రాంతంలో సభ జరిగింది మహిళా ప్రతినిధులు దాదాపు రెండు లక్షల మంది మహిళల సంతకాలున్న వినతిపత్రాన్ని ముఖ్యమంత్రికి అందజేశారు స్త్రీలకు సమాన హక్కుల కోసం కేంద్రం అనుమతి కోసం రాష్ట్ర ప్రభుత్వం గట్టిగా కృషి చేయాలి మహిళల స్వయం ఉపాధి పథకాలు గట్టిగా అమలుపరచాలి, మహిళాభ్యుదయానికి కృషి చేయాలి అనేవి వినతి పత్రంలోని ప్రధానాంశాలు

## ఉపశ్రుతి :–

ఏం కవిగారూ మెడ అలా పెట్టికొని నడుస్తున్నారే? ఏమైంది? – అనడిగాను, మెడ వంకర పెట్టి నడుస్తున్న ఒక కవిశేఖరుణ్ని **ఏముంది? కీర్తికాంత** కావలించుకొన్నప్పుడు **మెడనరం పట్టి వుంటుంది** పాపం! – **అన్నాడు** పక్కన వున్న ఒక రసికుడు

– తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor S Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*

# అసలైన తెలుపు ఏమిటో... ప్రపంచానికి చూపండి

# డెట్



## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ. దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!




Shilpi DM 9A/84 Tel.

# హిమగిరి సొగసులు
# మురిపించును మనసులు

# హిమా

## బ్లూ డిటర్జెంట్ వాషింగ్ పౌడర్




కొన్ని ఇతర వాషింగ్ పౌడర్ల వలె

- గరుకుగా ఉండదు
- చేతులు మండవు
- బట్టలు చిరిగిపోవు
- ముక్కుకి ఘాటుగా ఉండదు

మార్కెటింగ్ చేయువారు




MTP మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్

బొడ్డపాటివారి వీధి గాంధీనగర్ విజయవాడ3 ఫోన్ 73457

Sound• Dolphin

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

13-19 సెప్టెంబరు, '85